అలా వెళ్ళిన కేసి రాక్షసుడు, పూర్వం కుముదుడనే దివ్యుడు. అతడు మహేంద్రుని అనుచరుడుగా ఉండేవాడు. ఆయనకు గొడుగు పట్టి తిరుగుతూ ఉండేవాడు.

వృత్రాసురవధ మూలంగా తనకు సంక్రమించిన బ్రహ్మహత్యా పాతకాన్ని తొలగించుకునే నిమిత్తం, దేవేంద్రుడు అశ్వమేధం తల పెట్టాడు. ఆ యాగం కోసం నిర్ణయించిన అశ్వాన్ని కుముదుడు హరించుకు పోవటం జరిగింది. అది గ్రహించిన మహేంద్రుడు అతణ్ణి వెదకి పట్టుకుని, బంధించి తెచ్చి 'అశ్వంమీది వ్యామోహంతో నువ్వీ రాక్షసకృత్యానికి పాల్పడ్డావు కాబట్టి, నువ్వు అశ్వరూప రాక్షసుడవు కావలసింది' అని శపించాడు.

ఆ శాపం మూలంగా, అశ్వరూపి అయిన కుముదుడు, శ్రీకృష్ణుని దయవల్ల శాపవిముక్తి పొందటం, తిరిగి అమరావతికి వెళ్లటం జరిగింది.

### 60. నారదుని వినుతి :

ఆవిధంగా, హయాసురుడు హతుడు కావటం గ్రహించిన దేవతలు, కృష్ణయ్యమీద కుసుమవర్షం కురిపించారు. వ్రజవాసులు అదంతా మహాద్భుతంగా భావించారు; తమకు సర్వరక్షకుడయిన నల్లనయ్యను అమితంగా ప్రస్తుతించారు. ఆ సమయంలోనే నారద మహర్షి కూడా అక్కడికి రావటం జరిగింది. అలావచ్చిన నారదుడు, శ్రీకృష్ణుని, ఏకాంత ప్రదేశంలో సందర్శించి...

'జగదీశ యోగీశ సర్వభూతాధార
సకల సంపూర్ణ యీశ్వర మహాత్మ
కాష్టగతజ్యోతికైవడి నిఖిల భూ
తములందు నొకడవై తనరు దీవు

సద్గూఢుడవు గుహాశయుడవు సాక్షివి
నీయంతవాడవై నీవు మాయ
గూడి కల్పింతువు గుణముల వానిచే
బుట్టించి రక్షించి పొలియజేయు
దీ ప్రపంచ మెల్ల నిట్టి నీ విప్పుడు
రాజమూర్తులయిన రాక్షసులను
సంహరించి భూమి చక్రంబు రక్షింప
నవతరించినాడవయ్య కృష్ణ!"

అని వినుతించాడు. ఆ పైన సాధుజన పోషణార్థం ఆయన చేయ నున్న కొన్ని పనులనుకూడా వివరించాడు. ఆయనకు మ్రొక్కి, ఆయన సెలవుతీసుకుని మహదానందంతో వెళ్ళిపోయినాడు.

61. . . . వ్యోమాసురుడు :

ఆ మరునాడు, శ్రీకృష్ణుడూ కొందరు గోపకుమారులూ పశువులను మేపుకునే నిమిత్తం ఒకకొండ ప్రక్కకు వెళ్ళటం జరిగింది. అలా వెళ్ళి. . .*[51]

కొందరు గొఱియల మంచును
గొందరు పాలకుల మంచు కుటిలత్వమునం
గొందరు దొంగల మనుచును
జెంది కుమారకులు క్రీడసేసిరి తమలోన్.

అంతలో, మయాసురుని కుమారుడూ, మహామాయావీ అయిన వ్యోముడు, గోపకుమారుని రూపం ధరించి వారితో చేరాడు. అలా చేరి, వారిలో చాలామందిని కపటోపాయంతో ఒకకొండ గుహ

*51 తత్రాసన్ కతిచి చ్చోరాః పాలా శ్చ కతిచి న్నృప
మేషాయితా శ్చ తత్రైకే విజహ్రు రకృతో భయాః.

వద్దకు తీసుకుపోయి, వారి నందులో ప్రవేశింప చేశాడు; వారు తిరిగి బయటకు రాకుండా, ఒక పెద్ద పాషాణాన్ని ఆ గుహాముఖాన ఉంచాడు.

అది శ్రీకృష్ణుడు గ్రహించాడు. గ్రహించి, *52 ఆ ప్రాంతం లోనే తక్కుతూ తారాడుతూఉన్న వ్యోముని ఒడిసి పట్టుకున్నాడు; తన మాయాబలంద్వారా ఒక మహాపర్వతంమాదిరి శరీరాన్ని పెంచు కున్న వ్యోమునితో తలపడ్డాడు.

అప్పుడు జరిగిన పోరులో కృష్ణయ్య*53 అతణ్ణి చేతులో చిక్కించు కుని, క్రిందపడేసి, అతనిమీద కూర్చుని, అతడు హాహాకారాలు చేస్తున్నా జాలి వహించకుండా చిత్రవధ చేశాడు. ఆ విధంగా హతుడైన వ్యోమునిలోనుంచి ఒక దివ్యతేజం బయటకు వచ్చి శ్రీకృష్ణునిలో లీనమై పోయింది.

ఆ తరువాత శ్రీకృష్ణుడు *54గుహాముఖాన ఉన్న పాషాణాన్ని తొలగించి, లోపలఉన్న గోపకుమారులందరినీ తీసుకుని అమితానం దంతో గొల్ల పల్లె చేరుకున్నాడు.

శ్రీకృష్ణుని వల్ల ఆ విధంగా సంహారింపబడ్డ వ్యోముడు పూర్వం భీమరథుడనే రాజు. అతడు మంచి మేధావి. హరిభక్తుడు. వారణాసిలో నివసిస్తూ ఉండేవాడు.

---

*52 తస్య తత్కర్మ విజ్ఞాయ కృష్ణః శరణదః సతాం
గోపాన్ నయంతం జగ్రాహ వృకం హరి రివౌజసా.

*53 తం నిగృహ్యాచ్యుతో దోర్భ్యాం పాతయిత్వా మహీతలే
పశ్యతాం దివి దేవానాం పశుమార మమారయత్.

*54 గుహాపిధానం నిర్భిద్య గోపాన్ నిస్సార్య కృచ్ఛ్రతః
స్తూయమానః సురై ర్గోపైః ప్రవివేశ స్వగోకులం.

భీమరథుడు చాలాకాలం ప్రజారంజకుడై రాజ్యపాలనం చేశాడు. ఆ తరువాత కుమారునికి పట్టం కట్టి, మలయాచలానికి వెళ్లి తపస్సు చేసుకోసాగాడు.

ఆ సమయంలో, పులస్త్యుడు, తన శిష్యవర్గంతో ఒకసారి అక్కడికి వెళ్లటం సంభవించింది. అది తెలిసికూడా భీమరథుడు ఆయన్ని సందర్శించలేదు. సన్మానించలేదు.

అది పులస్త్యునకు ఆగ్రహాకారణ మయింది. ఆ వెంటనే ఆయన భీమరథుని ఉద్దేశించి 'రాక్షసుడవు కావలసింది' అని శపించాడు.

అలా శాపం పొందిన భీమరథుడు, ఆ మహర్షి పాదాలమీద పడి, తన తప్పిదాన్ని క్షమించవలసిందిగా ప్రార్థించాడు. మహర్షి అతని పశ్చాత్తాపాన్ని గ్రహించి, అతనికి, ద్వాపరాంతాన వ్రజసీమలో జనించే శ్రీహరి ద్వారా శాపవిముక్తి కలిగేటట్టు అనుగ్రహించాడు.

శాపమోక్షణమార్గం గ్రహించిన భీమరథుడు, కాలక్రమాన మయపుత్రుడైన హయాసురుడు కావటం, శ్రీకృష్ణునిచేత సంహారింపబడి, శాపవిముక్తి పొంది ఆయనలో లీనమైపోవటం జరిగింది.

### 62. అక్రూరుని ఆగమనం :

మథురనుంచి బయలుదేరిన అక్రూరుని రథం, మాధవుని విహారస్థలమయిన మందలో ప్రవేశించబోతూఉండగా, అక్రూరుని హృదయం ఆనందతాండవం చేయసాగింది. శ్రీహరి సన్నిధానానికి తన్ను తీసుకుపోతున్న తన అదృష్టాన్ని, అప్పు, డత డెంతగానో అభినందించుకోసాగాడు. ఆ సందర్భంలోనే...

'ఎట్టి తపంబు సేయబడె నెట్టి చరిత్రము లబ్ధ మయ్యెనో
ఎట్టి ధనంబు లర్థులకు నీబడెనో తొలిజామునందు నా

యట్టి వివేకహీనునకు నాది మునీంద్రులు యోగదృష్టులం
బట్టగలేని యీశ్వరుని బ్రహ్మమయున్ హరి జూడ గల్గెడిన్'

అని, తనలో తా, నెంతగానో మురిసిపోయినాడు.

అంతలో, తనదయిన అదృష్టానికి, మహారాజైన కంసునితో తనకున్న స్నేహమే కారణమన్న భావం అతనికి కలిగింది. అందుకనే...

'సూరులు తొల్లి యే విభుని శోభితపాదనఖప్రభావళిం
జేరి భవాంధకారముల జిక్కక దాటుదు రట్టి దేవరన్
వైరముతోడనైన బిలువన్ ననుబంచి శుభంబు చేసె ని
ష్కారణమైన ప్రేమ నిదె కంసునిబోలు సఖుండు గల్గునే!'

అని, కంసునికూడా ప్రశంసించాడు.

అంతలో అతని కొక సందేహం కలిగింది. తాను కంసుని అధీనంలో ఉన్నవాడు. అదీకాక, కంసునిపక్షాన, కంసుని సందేశాన్ని తీసుకువెడుతున్నాడు. ఆ సందేశమయినా కాపట్యంతో కూడుకున్నదిగాని అన్యమైనది కాదు; అయినా, తనలో కల్మషం లేదు. శ్రీకృష్ణుడు తనప్రాణానికి ప్రాణమైనవాడు. ఆయనకు సర్వవేళలా జయం కలగాలనే తను కోరుకుంటూఉంటాడు. ఆరోజున, ఆయనను దర్శించుకునే అవకాశం లభించబోతున్నందుకు తా నెంతగానో సంతోషిస్తున్నాడుకూడా. కాని, గత్యంతరంలేక, మహారాజైన కంసుని కుటిలసందేశాన్ని ఆయన కందచేయబోతున్నాడు. అందుకనే, తన స్వామిఅయిన శ్రీకృష్ణుడు తన్ను ఏమని భావిస్తాడోనన్న ఆందోళన అతనిలో ఉత్పన్నమయింది. అది కారణంగానే...

'ఇత డా కంసునిచేత బంపువడి నన్ హింసింప నేతెంచినా
డతి దుష్టుండని చూచునో సకల భూతాంతర్బహిర్మధ్యసం

గతుడౌటం దలపోసి నన్ను సుజనుంగా జూచునో యెట్టి యు
న్నతి గావించునొ యేక్రియం బలుకునో నాభాగ్య మెట్లున్నదో !'

అని, తనలోతాను వితర్కించుకోసాగాడు. అంతలో అతనికి, భక్త వత్సలుడయిన శ్రీకృష్ణుడు, తనకు అభయమిచ్చి తీరుతాడన్న విశ్వాసం కలిగింది. ఆ విశ్వాసంతోనే అతడు ముందుకుపోసాగాడు.

అలా పోయిపోయి, అక్రూరుడు, సాయంసమయానికి బృందావనం సమీపించాడు. సమీపించగానే, అతనిలో అదోవిధమైన అనిర్వచనీయానందం జనించింది. అక్కడఉన్న చెట్లూ, పుట్టలూ, గుట్టలూ, నదీనదాలూ అన్నీకూడా, ఎప్పుడో ఒకప్పుడు, శ్రీకృష్ణుని సన్నిధినంది పవిత్రతను పొందినవే ననీ, బృందారణ్యసీమలోఉన్న జీవరాశి అంతా ఆ లీలామానుష విగ్రహుని అపాంగవీక్షణల నందుకుని ధన్యత పొందినదేననీకూడా అత డప్పుడు భావించాడు. అది కారణంగానే అతడు, తనకు లేని అదృష్టం వాటికి ఉన్నదని నిర్ణయించుకున్నాడు. వాటితో పోల్చుకుని తన అల్పజ్ఞత్వాన్ని గుర్తించుకున్నాడు; ఆవెంటనే రథంనుంచి దిగాడు.

అలా రథంనుంచి దిగిన అక్రూరునకు, శ్రీకృష్ణుని చరణాబ్జాలను శిరాన ధరించి తరించిన పచ్చికబీళ్లు కనిపించినై. వాటిని చూడగానే ఆయన ఒళ్ళు పులకరించింది, ఆయన కంటివెంట ఆనందాశ్రులు రాలినై. ఆవెంటనే, ఆయన, వాటిమీదపడి పొర్లాడాడు. వాటిని కన్న ధరిత్రిని చుంబించాడు. ఆవిధంగా కొంతసేపు తన్మయుడై చరించి, ఆ తరువాత బలరామ కృష్ణు లున్న గోదోహన స్థానం చేరుకున్నాడు; చేరుకుని...

కనె నక్రూరుడు పద్మనేత్రులను రంగ ద్గాత్రులన్ ధేను దో
హన వాటీ గతుల న్నలంకృతుల నుద్యద్భానులం బీత నీ
ల నవీనోజ్జ్వల వాసులం గుసుమమాలాధారులం ధీరులన్
వనితాకాముల గృష్ణ రాముల జగద్వంద్యక్ర మోద్ధాములన్.

అలా తమ్ము సమీపించిన అక్రూరునీ, బలరామ కృష్ణులు చూశారు; చూసి, మందహాసంతో పలుకరించారు. అతని అభివాదనను స్వీకరించారు.

ఆ వెంటనే, శ్రీకృష్ణుడు, అక్రూరుని, ప్రేమపురస్సరంగా కౌగిలించుకున్నాడు. కుశలప్రశ్నలు వేశాడు; బలరామ సహితుడై అతణ్ణి ఇంటికి తీసుకువెళ్ళాడు.

అక్కడ నందుడు అక్రూరుని బహువిధాల సత్కరించాడు. అతణ్ణి ఒక పర్యంకంమీద సుఖోపవిష్టుణ్ణి చేసి, కుశల ప్రశ్నలు వేశాడు. ఆ సమయంలోనే శ్రీకృష్ణుడు అక్రూరుని ఉద్దేశించి...*55

'శుభమే నీకు బ్రమోదమే సఖులకుం జుట్టాలకున్ సేమమే
యభయంబే ప్రజకెల్ల గోత్రజుల కాత్మానందమే మామ ము
క్తభయుండే వసుదేవ దేవకులు త త్కారాగృహంబందు మ
త్ప్రభవ వ్యాజ నిబద్ధులై బ్రదికిరే ప్రాణానిలోపేతులై.
నెటి నే డిక్కడ నీవు రాగ వగతో నీతోడ నేమైన నా
కెఱుగం జెప్పుమటంచు జెప్పరుగదా యేమందు రావార్త యే
తెఱగున్ లేదని డస్సిరో వగచిరో దీనత్వముం జెందిరో
వెఱతో నా తలిదండ్రు లెట్లు వడిరో విన్పింపు మక్రూరకా!'

---

*55 తాత సౌమ్యాగతః కచ్చిత్ స్వాగతం భద్ర మస్తు వః
అపి స్వ జ్ఞాతి బంధూనా మన మీవ మనామయం.
కిం ను నః కుశలం పృచ్ఛే ఏధమానే కులామయే
కంసే మాతుల నామ్న్యంగ స్వానాం న స్తత్ప్రజాసు చ.
అహో అస్మదభూ ద్భూరి పిత్రోః వృజిన మార్యయోః
యద్ధేతోః పుత్ర మరణం యద్ధేతో ర్బంధనం తయోః.
దిష్ట్యాద్య దర్శనం స్వానాం మహ్యాం వ సౌమ్య కాంక్షితం
సంజాతం వర్ణ్యతాం తాత తవాగమన కారణం.

అని పరామర్శపూర్వకంగా అడిగాడు. ఆ తరువాత, అతని రాకకు గల కారణం తెలుపవలసిందనికూడా కోరాడు.

శ్రీకృష్ణునకు సమాధానంగా, అక్రూరుడు, తన ఆగమనానికి సంబంధించిన సర్వవిషయాలనూ విశదపరచుకున్నాడు. ఆ సందర్భం లోనే...

"కృష్ణా! ఇటీవల నారదమహర్షి మథురకువచ్చి, మా మహా రాజును కలుసుకున్నాడు. ఆ సమయంలో, ఆయన, నువ్వు రాతుసాం తకుడవనీ, దుష్టసంహారానికే ఉద్భవించావనీ కూడా తెలియపరచాడు. అది కారణంగానే, కంసుడు, ఈ ధనుర్యాగం పేరుపెట్టి నిన్నక్కడికి రప్పించుకోవాలనీ, అక్కడ ఏదో ఒకవిధంగా నిన్ను సంహరించాలనీ నిశ్చయించుకున్నాడు," అని కూడా విశదపరచాడు.

అక్రూరుని పలుకులు విన్న బలరామ కృష్ణులు కడుపుబ్బేటట్టు నవ్వుకున్నారు. ఆ తరువాత కృష్ణయ్య గోపకుల నుద్దేశించి...

'భూనాథుండు మఖంబుజూడ బిలువం బుత్తెంచినా డవ్విభుం
గానం బోవలె బాలు నెయ్యి పెరుగుల్ గట్నంబులుం గానికల్
మీ నేర్పొప్పగ గూడబెట్టుడు తగన్ మీ మీ నివాసంబులన్
యానంబుల్ గొనిరండు పొండు మథురాయాత్రాభిముఖ్యంబుగన్'

అని నియమించాడు. శ్రీకృష్ణుని దైన అభిప్రాయాన్ని గ్రహించి, నందుడు, ఆ వెంటనే, ఆ విషయాన్ని గొల్లపల్లెలో నలుమూలలా చాటించవలసిందిగా తనవారికి ఆదేశించాడు.

63 ... *గోపికల ఆవేదన :*

అది విన్న గోపికలు, శ్రీకృష్ణుడు మథురానగరానికి వెళ్ళటం తథ్యమని తేల్చుకున్నారు. తమ ప్రియుడైన అతణ్ణి వదలిఉండటం దుర్భరమనుకున్నారు. అతడు తమ్ము విడిచి పోకుండా ఉండాలని

కోరుతూ, ముక్కోటి దేవతలకూ మొక్కుకున్నారు. తమ ప్రాణానికి ప్రాణమైన శ్రీకృష్ణుని, తమకు దూరం చేయదలచిన బ్రహ్మదేవుని పరిపరివిధాల దూషించారు. అక్రూరుడనే పేరు పెట్టుకునికూడా, క్రూరుడై తమకు ప్రియవియోగదుఃఖాన్ని కల్పిస్తున్న అక్రూరుని తూలనాడారు. అంతేకాదు. అంతవరకూ తమతోటిదే లోకమన్నట్టు వ్యవహరించి, అలా అమాంతంగా తమ్ము వదలిపోవటానికి నిశ్చయించుకున్న కృష్ణయ్యనుకూడా నిశితంగా విమర్శించారు. ఆ రాత్రంతా, కన్నీటికాలువలై, వివశత్వంతో, తమ కృష్ణయ్యనే తలచుకుంటూ వేగించారు.

ఆ మరునాడు ఉదయాన, నందాది గోపప్రముఖులందరూ తమతమ శకటాలమీద మథురాభిముఖులై బయలుదేరారు. బలరామ కృష్ణులు మాత్రం, అక్రూర చోదితమయిన రథ మధిరోహించి వారికి ముందుగా కదిలారు.

బలరామ కృష్ణుల రథం బయలుదేరబోతూఉండగా, గోపికలు ఒక్కసారిగా దాన్ని చుట్టేశారు. ఆవెంటనే, శ్రీకృష్ణుని ఉద్దేశించి, 'నువ్వు లేని మందలో మేము ఉండలేము. మమ్మల్నికూడా నీతో తీసుకుపోవలసింది' అని దీనాతిదీనంగా అతణ్ణి బ్రతిమాలుకున్నారు.

ఆవిధంగా బ్రతిమాలుకుంటున్న గోపికలను, కృష్ణయ్య ప్రేమపూర్వకంగా చూశాడు. మందహాసం చేశాడు. ఆపైన వారి నుద్దేశించి 'వెంటనే తిరిగివస్తాను' అని మాటయిచ్చి, వారికి కొంత ఉపశమనం కలిగించాడు.

## 64. అక్రూరుని అదృష్టం :

అలా ప్రయాణంసాగించిన రామ కృష్ణులు మధ్యాహ్న సమయానికి కాళిందిని చేరుకున్నారు. అక్కడ, వారు రథాన్ని ఆపి. అందులో ప్రవేశించి దాహం తీర్చుకున్నారు; తిరిగి రథ మధిరోహించారు.

రామ కృష్ణులు తిరిగి రథ మధిరోహించిన తరువాత, అక్రూరుడు, వారివద్ద సెలవుతీసుకుని స్నానార్థం అచటి అనంతతీర్థానికి

వెళ్లాడు. అలా వెళ్ళి, అందులో ప్రవేశించి, విధిపూర్వకంగా వేద మంత్రాలు పఠిస్తూఉండగా, అతనికి, నదీగర్భంలో రామ కృష్ణులు కనిపించారు. అంతకుపూర్వం రథంలో ఉండి తనకు సెలవిచ్చిన వారు తన ఎదుట అలా ప్రత్యక్షం కావటం అతనికి ఆశ్చర్యంగా తోచింది. అందుకనే అతడు, అదేమిటో తెలుసుకుందామని, చరచరా ఒడ్డుకు వచ్చి, రథంఉన్న దిక్కుగా వెళ్ళాడు. అలా వెళ్ళిన అతనికి రథంలో యథాపూర్వకంగా ఆసీనులై ఉన్న ఆ అన్నదమ్ములు కనిపించారు. అప్పు డతడది మహాద్భుతంగా భావించాడు. కాని, తన విస్మయాన్ని ఏమాత్రంగానూ వారికి తెలియపరచకుండానే, అతడు తిరిగి నదివేపుగా నడకసాగించాడు; అలా వెడుతూ, ఆ కళ్యాణచారిత్రుల మాహాత్మ్యాన్నిగురించే ఆలోచించసాగాడు.

## 65 . . . అక్రూరుని హృదయం :

తిరిగి కాళిందిని చేరుకున్న అక్రూరునికి, వేయి పడగలతో వెలుగులు చిమ్ముతూఉన్న అనంతుడూ, అతడు తల్పంగా పడుకునిఉన్న శ్రీమహావిష్ణువూ గోచరించారు.*56 శ్రీ మహావిష్ణువు నీలమేఘంవంటి

*56 తస్యోత్సంగే ఘనశ్యామం పీతకౌసేయవాససం
పురుషం చతుర్భుజం శాంతం పద్మపత్రారుణేక్షణం
చారు ప్రసన్నవదనం చారుహాస నిరీక్షణం
సుభ్రూన్నసం చారుకర్ణం సుకపోలారుణాధరం
ప్రలంబపీవరభుజం తుంగాంసోరస్థలశ్రియం
కంబుకంఠం నిమ్ననాభిం వలిమత్పల్లవోదరం
బృహత్కటితట శ్రోణి కరభోరుద్వయాన్వితం
చారుజానుయుగం చారు జంఘాయుగల సంయుతం
తుంగ గుల్ఫారుణ నఖ వ్రాత దీధితిభిర్వృతం
నవాంగుల్యంగుష్ఠదలై ర్విలసత్పాదపంకజం
సుమహార్హమణివ్రాత కిరీట కటకాంగదైః
కటి సూత్ర బ్రహ్మసూత్ర హార నూపుర కుండలైః
భ్రాజమానం పద్మకరం శంఖ చక్రగదాధరం
శ్రీవత్సవక్షసం భ్రాజ త్కౌస్తుభం వనమాలినం,

శరీర చ్ఛాయతో ప్రకాశిస్తున్నాడు. పట్టుపీతాంబరం ధరించి ఉన్నాడు. నాలుగు చేతులతోనూ, కలువరేకుల వంటి కళ్లతోనూ, ప్రముఖమైన నాసికతోనూ, తీర్చి దిద్దినట్లున్న కనుబొమలతోనూ చూడటానికి ముచ్చటగా ఉండే బుగ్గలతోనూ, దొండపండువంటి పెదిమతోనూ, పొడుగుపాటి చేతులతోనూ, ఉబికిఉండే వక్షస్థలంతోనూ, శంఖంవంటి మెడతోనూ, అలాగే సర్వాంగ సుందరమైన రూపంలో ఆయన పొడగట్టాడు. ఆయన ధరించిన భూషలు దివ్యమైనవిగా ఉన్నై. ఆయన రొమ్ముమీద శ్రీవత్సం భాసిస్తోంది. మెడలో కౌస్తుభమణి ప్రకాశిస్తోంది. ఆయన తులసీదామ భూషితుడై ఉన్నాడు.

ఆ మహానుభావుని ప్రక్కగా నిలబడి*57 నంద సునందులు స్తోత్రం చేస్తున్నారు. సనక, సనందన, సనాతన, సనత్కుమారులు ఆయన వెనుక నిలబడి ఉన్నారు. బ్రహ్మరుద్రాదులు ఆయన దక్షిణ పార్శ్వాన నుంచున్నారు. మరీచి మొదలైన నవవిప్రులు ఆయన వామభాగాన ఉన్నారు. ప్రహ్లాదుడు, నారదుడు, ఉపరిచర వసువుడు మున్నగువారు ఆయన ఎదుట నిలబడి ఉన్నారు. శ్రీ, పుష్టి, వాణి, కాంతి, కీర్తి, తుష్టి, ఇల, ఊర్జ, విద్య, అవిద్య, శక్తి, మాయ మున్నగు వారు ఆయన్ని సేవిస్తూ ఉన్నారు. సిద్ధులు, చారణులు, గంధర్వులు, అసురులు ఆ మహానుభావుని స్తుతిస్తూ ఉన్నారు. వారందరినీ చూడ గానే అతని కళ్ళవెంట ఆనందాశ్రులు రాలినై. అతని శరీరం పులకిం చింది. ఆ వెంటనే అతనికి, శ్రీకృష్ణుడు శ్రీ మహావిష్ణువే అన్న స్ఫురణ

---

*57 సునంద నంద ప్రముఖైః పార్షదైః సనకాదిభిః
సురేశై ర్బ్రహ్మరుద్రాద్యై ర్నవభిశ్చ ద్విజోత్తమైః
ప్రహ్లాద నారద వసు ప్రముఖై ర్భాగవతోత్తమైః
స్తూయమానం పృథగ్భావై ర్వచోభి రమలాత్మభిః.

శ్రియా పుష్ట్యా గిరా కాంత్యా కీర్త్యా తుష్ట్యేలయోర్జయా
విద్యయా విద్యయా శక్త్యా మాయయా చ నిషేవితం.

కలిగింది. అది కారణంగానే అతను, ఆ భగవంతునికి సాష్టాంగ ప్రణామం చేశాడు; తిరిగి లేచి, గద్గదస్వరంతో ఆయన నిలా ప్రస్తుతించాడు.

"కృష్ణా! నువ్వు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడవు. సృష్టిలో ఉన్న జీవరాశికంతటికీ నువ్వే మూలకారణుడవు. కాని, మాయా మోహితుడయిన జీవుడు సామాన్యంగా నిన్ను గుర్తించ లేడు.

మహాయోగులు నిన్ను మహాపురుషునిగా కొలుస్తారు. కర్మిష్టులు నిన్ను యజ్ఞ యాగాదులద్వారా ఆరాధిస్తారు. జ్ఞానులు తాము చేసే సర్వకర్మలనూ నీయందే సన్యసించి, జ్ఞానస్వరూపుడవైన నిన్ను జ్ఞానమార్గాన ధ్యానిస్తారు. ఎవరు ఏవిధంగా ఏరూపాన్ని ఆరాధించినా అది సర్వదేవతామయుడవైన నీకే చెందుతుంది.

నాయనా ! నీ మాయకు వశంకాని దేదీ లోకంలో లేదు. జీవులకు, 'నేను' 'నాది' అనే అభిమానం కలగటానికి మూలం నీ మాయ తప్ప మరొకటి కాదు. ఆ మాయ కారణంగానే సర్వజీవులూ కర్మమార్గాన పరిభ్రమించటం జరుగుతోంది. నామటుకు నేను కూడా...

కలలం బోలెడి పుత్రమిత్ర వనితాగారాది సంయోగముల్
జలవాంఛారతి నెండమావులకు నాసల్ సేయు చందంబునం
దలతున్ సత్యములంచు మూఢుడ వృథా తత్త్వజ్ఞుడన్ నాకు నీ
విలసత్పాదయుగంబు సూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ !"

అలా వినుతించిన అక్రూరునికి అభయ మిచ్చి, శ్రీమన్నారాయణుడు తిరోహితుడయినాడు. ఆ వెంటనే, అక్రూరుడు, తిరిగి రామకృష్ణులను చేరుకున్నాడు. అతణ్ణి చూడగానే శ్రీకృష్ణుడు మంద హాసం చేస్తూ...

'జలములు చేరువ నున్నవి
తలపోయగ నీవుపోయి తడవయ్యె నదీ
జలముల నభమున ధరణిం
గలుగని చోద్యములు నీకు కానంబడెనే!'

అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు సమాధానంగా, అక్రూరుడు...

'నీలోన లేని చోద్యము
లే లోకములందు జెప్ప రీశ్వర నీటన్
నేలన్ నింగిని నున్నవె
నీలో జోద్యంబు లెల్ల నెగడు మహాత్మా!'

అని నివేదించుకున్నాడు. అది విన్న బలరామ కృష్ణులు ఒకరివంక ఒకరు చూసుకున్నారు. చిరునవ్వు నవ్వుకున్నారు. ఆ తరువాత అక్కడినుంచి బయలుదేరి, వారు, సాయంకాలానికి మధురానగరం చేరుకున్నారు.

మధురానగరం చేరుకోగానే, బలరామ కృష్ణులు, పురోపవనం వద్ద తమ రథాన్ని ఆపించి, అక్రూరుని, ముందుగా నగరంలో ప్రవేశించవలసిందని ఆదేశించారు. కాని, అక్రూరుడు, శ్రీకృష్ణుని ఉద్దేశించి...

'నా యింటికి విచ్చేయుము
నీ యంఘ్రి సరోజ రేణు నికరము సోకన్
నా యిల్లు పవిత్రంబగు
శ్రీయుత నీ భటుని బెద్దసేయం దగదే!'

అని ప్రార్థించాడు.

ఆవిధంగా ప్రార్థించిన అక్రూరునికి సమాధానంగా, శ్రీకృష్ణుడు...

'యదుకుల విద్వేషణుడై
మదమున వర్తించు కంసు మర్దించి భవ
త్సదనంబు జూడ వచ్చెద
బోదమీ స్యందనము గొనుచు బురమున కనఘా!'

అని పలికాడు. ఆ పలుకులు విని సంతుష్టిపొందిన అక్రూరుడు, ఆ తరువాత పురప్రవేశంచేసి, కంసరాజేంద్రుని దర్శించి, రామ కృష్ణుల రాకను గురించి ఆయన కెరిగించాడు.

66. *నగర ప్రవేశం :*

మధురాపురం, పూర్వం, మధువన మనే పేరుతో ఉండేది. అప్పుడు దానికి, రావణాసురుని మేనల్లుడు లవణాసురుడు అధిపతిగా ఉండేవాడు.

లవణాసురుడు అమిత పరాక్రమశాలి. అతని ముందు రావణాసురుడు కూడా తలఒగ్గి ఉండేవాడు.

ఆ లవణాసురుడు, మునులను అమితంగా బాధించేవాడు. అది గ్రహించి, శ్రీరామచంద్రుడు, శత్రుఘ్నునిద్వారా అతణ్ణి సంహరింప చేసి, మధువనాన్ని అసురనిర్ముక్తం చేయటం జరిగింది. అది కారణంగా, ఆ వనంలో వెలసిన మధురానగరానికి, శ్రీహరి అధిపతి అయినాడు.

మధురానగరాన్ని శత్రుఘ్నుని కుమారులైన పుష్కరుడూ అమడూ అనేవారు కొంతకాలం పాలించారు. వారి తరువాత దాన్ని యాదవులు స్వాధీనపరచుకున్నారు.

మధురాధిపతి అయిన శూరసేనుడు యయాతికుమారుడు. అతడు మహాబలవంతుడు. ప్రతాపవంతుడు. కాని, అతని పాలన అంత సక్రమంగా ఉండేదికాదు. అది కారణంగా మాధవవంశానికి చెందిన ఉగ్రసేనుడు ఆ పరిపాలనను నిర్వహించటం జరిగింది.

మధురానగరంలో ఆరాధ్యదేవత చండి. ఆమెనే మధురాంబ అనికూడా అంటారు. ఆమె, తన్ను కొలిచే ప్రజానీకానికి ఆయురారోగ్యైశ్వర్యాలను చేకూరుస్తూ ఉంటుంది; అక్కడ మరణించిన వారికి పరమపదాన్ని ప్రసాదిస్తూ ఉంటుంది.

స్వయంభువు అక్కడ నూరేళ్లు తపస్సుచేసి, స్వాయంభువ మనువు అనే కుమారుని పొందాడు.

భూతేశ్వరుడైన శంకరుడు, ఆ విధంగానే తపస్సుచేసి, శ్రీహరి దయవల్ల, ఆ నగరద్వారపాలకత్వం పొందటం జరిగింది.

ఇంద్రుడు, ఇనుడు, ధనదుడు, యముడు, ధ్రువుడు నియమ ప్రకారం ఆ వనంలోనే తపస్సు చేశారు. దాని ఫలితంగా, వారు క్రమంగా, మహేంద్రపదవినీ, ప్రాజాపత్యాన్నీ, నిత్యనిధినీ, పాశాన్నీ ధ్రువపదాన్నీ పొందారు.

మధువనంలో తపస్సు చేయటంద్వారానే, రావణాసురుడు బర్హిర్ముఖులను ఓడించగలిగాడు; లంకానగరాన్ని నిర్మించుకోగలిగాడు.

శంతనుడు డా వనంలో తపస్సుచేసిన తరువాతనే ఆయనకు భీష్ముడు జన్మించాడు.

మధురను స్మరిస్తే మాధవుని స్మరించినట్టవుతుంది. మధురా వాసులను భజిస్తే మాధవభక్తులను భజించినట్టవుతుంది. మధురను గురించి వింటే మాధవుని గాథను విన్నట్టవుతుంది. మధురను చూస్తే మాధవుని చూసిన ఫలం లభిస్తుంది.

మధురాపతి మాధవుడు. మధురానగరం యాదవులకు తొలి నివాసం.

నందాది గోపకులతోనూ, బలరామునితోనూ ఒక రోజంతా పురోపవనంలో గడిపి, శ్రీకృష్ణుడు, ఆ మరునాడు, మధురానగరంలో ప్రవేశించటం జరిగింది. అలా నగరప్రవేశం చేసిన రామకృష్ణులను సందర్శించుకోవాలనే ఉద్దేశం పౌరసుందరులలో జనించింది. అది కారణంగానే వారు...

'నందతపః ఫలంబు సుగుణంబుల పుంజము గోపకామినీ
బృందము నోముపంట సిరివెంట దయాంబుధి యోగి బృందముల్
డెందములందు గోరెడు కడింది నిధానము సేరవచ్చె నో
సుందరులార రండు చని చూతము కన్నులకోర్కి దీరగన్,

అని పరస్పరం ఆహ్వానించుకుంటూ, ముందుకుసాగిపోయినారు. వారిలో కొందరు హర్మ్యాగ్రభాగాలలో నిలబడి, అత్యుత్సాహంతో, ఆ యదుకుల శ్రేష్ఠులను దర్శించుకోసాగారు.

అంతకుపూర్వం, మధురానగరవాసులు, బలరామకృష్ణుల లీలా శిశుక్రీడలనుగురించి మహాద్భుతవిషయాలు విన్నారు. అవి విన్న ప్పటినుంచీ, ఆ దివ్యసుందరమూర్తుల నెప్పుడు దర్శిస్తామా అన్న ఆతురత వారిలో ప్రబలమయింది. అది కారణంగానే, ఆ అన్నదమ్ము లను చూసేభాగ్యం కలిగినందుకు వారెంతగానో సంతోషించారు. ఆ సమయంలో వారు పొందిన ఆనందానికి అవధి అనేది కనిపించలేదు. అందుకనే వారా నందకిశోరుని చూసి...

'వీడటే రక్కసి విగతజీవగ జన్ను
బాలు ద్రావిన మేటి బాలకుండు
వీడటే నందుని వెలదికి జగమెల్ల
ముఖమందు జూపిన ముద్దులాడు
వీడటే మందలో వెన్నలు దొంగిలి
దర్పించి మెక్కిన దాపరీడు
వీడటే యెలయించి వ్రేతల మానంబు
సూఱలాడిన లోకసుందరుండు

వీడు లేకున్న పుర మటవీస్థలంబు
వీని బొందని జన్మంబు విగత ఫలము
వీని బలుకని వచనంబు విహగరుతము
వీని చూడని చూడ్కులు వృథలు వృథలు.'

అని, అతనిమీద తమకున్న అభిమానాన్నీ ప్రేమనూ గౌరవాన్నీ పరస్పరం విశదపరచుకున్నారు. ఆ ఆనందమయమూర్తిమీద కుసుమ

వర్షంకురిపించారు. ఆయన కూడా *[58] తన ప్రసన్న వదనంతోనూ మందహాసంతోనూ ఓరచూపులతోనూ వారందరి హృదయాలనూ ఆకర్షించుకున్నాడు. వారందరికీ పరమానందాన్ని ప్రసాదించాడు,

## 67. కంస భృత్యుడు-రజకుడు :

ఆవిధంగా పురపురంధ్రుల నధిగమించి, రామ కృష్ణులు మరి కొంతదూరం వెళ్ళారు. అంతలో, వారికి, కంసుని పరిచారకుడైన రజకు డొకడు ఎదురయినాడు. శ్రీకృష్ణు డతణ్ణి చూసి...*[59]

'విందులమై నరేశ్వరుని వీటికి వచ్చితి మేము మాకు మా
మందలలోన గట్టికొన మంచి పటంబులు లేవు నీ ముడిన్
సుందర ధౌతచేలములు శోభిలుచున్నవి తెమ్ము నిమ్ము మే
లందెదు నిమ్ము రాజుదెస నల్లుర మో రజకాన్వయాగ్రణీ !'

అని పరియాచకంగా పలుకరించాడు.

ఆ పలుకులు, రజకునికి కోపం కలిగించినై. అది కారణంగానే, అతడు శ్రీకృష్ణుని ఉద్దేశించి...

'ఎట్టెట్టా మనుజేంద్రు చేలములు మీ కీ బాడియే మీరలుం
గట్టం బోలుదురే పయో ఘృత దధి గ్రాసంబులన్ మత్తులై
యిట్టాడంజనెగాక గొల్లలకు మీ కెబ్బంగి నోరాడెడిం
గట్టా ప్రాణము గోలుపోయెదుసుమీ కంసోద్ధతిన్ బాలకా !'

---

*58 మనాంసి తాసా మరవిందలోచనః
ప్రగల్భ లీలాహసితావలోకనైః
జహార మత్త ద్విరదేంద్రవిక్రమో
దృశాం దదచ్ఛ్రీరమణాత్మనోత్సవం.

*59 దేహ్యావయోః సముచితా న్యంగవాసాంసి చార్హతోః
భవిష్యతి పరం శ్రేయో దాతుస్తే నాత్ర సంశయః.

అని హుంకరించాడు, అంతేకాదు. 'మీరు మందబుద్ధులూ ఆసన్న మరణులూ కావటంవల్లనే మా రాజుగారి ద్రవ్యానికి ఆసపడు తున్నారు. మీ దురుద్యోగం మా రాజభటులకు తెలిసినపక్షంలో, వారు మిమ్మల్ని బంధించి, హింసించితీరుతారు. మీ దరి గ్రహించి, బ్రతికి బయటపడటం సమంజసం' అనికూడా ప్రేలాడు.

రజకుని పలుకులు శ్రీకృష్ణునకు కోపం కలిగించినై. అది కారణంగా ఆయన *[60] అతణ్ణి ఒక్కచఱపు చఱిచాడు. దాంతో, ఆ రజకుడు నేలకొరిగి ప్రాణం వదలటం జరిగింది. ఆ వెంటనే, అతనిలో నుంచి బాహిరిల్లిన ఒక జ్యోతి, శ్రీకృష్ణునిలో లీనమయింది.

రజకు డలా కూలటంచూసి, అతని అనుచరు లందరూ, తమ తమ మూటల నక్కడే వదలి, ప్రాణభీతితో పారిపోయినారు. అది గ్రహించిన బలరామ కృష్ణులు పకపకలాడారు. ఆ వెంటనే *[61] ఆ వస్త్ర రాసులలో తమకు నచ్చినవాటిని ఏరి తీసుకుని, కొన్నిటిని తాము ధరించారు; మరికొన్నిటిని తమప్రక్కనేఉన్న గోపబాలురకు పంచిపెట్టారు.

రావణసంహారానంతరం, శ్రీరామచంద్రుడు అయోధ్యకుపోయి రాజ్యపాలనం చేస్తున్న సమయంలో, ఒకచాకలివాడు, తనభార్య నుద్దేశించి, 'పరుని ఇంట్లోఉండివచ్చిన నిన్ను పరిగ్రహించటానికి నేను వెఱ్ఱిరాముడ ననుకున్నావా!' అని నిందాపూర్వకంగా అనటం జరిగింది. ఆ మాట చారులద్వారావిని, రామచంద్రుడు చాలా బాధపడ్డాడు. ఆ అపకీర్తిని తొలగించుకునే నిమిత్తమే, దోషరహిత అయిన సీతా మహాదేవిని మాయోపాయంద్వారా అడవికి పంపివేశాడు.

---

*60 ఏవం వికత్థమానస్య కుపితో దేవకీసుతః
రజకస్య కరాగ్రేణ శిరః కాయా దపాతయత్.

*61 వసిత్వాఽత్మప్రియే వస్త్రే కృష్ణః సంకర్షణ స్తథా
శేషా ణ్యాదత్త గోపేభ్యో విసృజ్య భువి కానిచిత్.



ఆ విధంగా, ఏ పాపం ఎరుగని సీతామహాదేవికి అరణ్యావాసం కల్పించిన ఆ రజకుడు, పాపఫలాన్ని అనుభవించే నిమిత్తం ద్వాపరాంతాన తిరిగి రజకుడుగానే జన్మించాడు. ఆ రజకుని సంహరించి, శ్రీకృష్ణుడు, అతనికి పాపవిముక్తి కలిగించాడు; పరమపదాన్ని ప్రసాదించాడు.

68. . . . వాయకుడు :

రజకుని మూటలోనుంచి తీసుకున్న పట్టుపుట్టాలను రామకృష్ణులు అస్తవ్యస్తంగా ధరించటం జరిగింది.. అదిచూసిన వాయకుడొకడు వారిని సమీపించి, వారి దుస్తులను సవరించి, నూత్న వస్త్రాలలో ఉన్న వారి సౌందర్యాన్ని చూసి మురిసిపోయినాడు. అది గ్రహించిన శ్రీకృష్ణుడు, *62 అతనికి మేలు చేకూర్చేవరాల నెన్నింటినో ప్రసాదించాడు.

ఆ వాయకుడు ఆదిజన్మలో మిథిలాపురనివాసి. జానకీదేవి వివాహసమయంలో, జనకుని ఆదేశంమీద, రామ లక్ష్మణులకు వలసిన పీతాంబరాలను, అతడు స్వయంగా నేసి ఇచ్చాడు. ఆ వస్త్రాలను జనక మహారాజు అల్లుర కివ్వటం, వారు పరమానందంతో వాటిని ధరించటం జరిగింది. అది చూసిన వాయకుడు, ఆ దుకూలాలతో తాను స్వయంగా ఆ దివ్యమూర్తులను అలంకరించలేదే అని ఎంతగానో ఆవేదన పడ్డాడు.

శ్రీరామచంద్రుడు అతని ఆవేదనను గ్రహించాడు. గ్రహించి, అతనికోరిక ద్వాపరాంతాన తీరేటట్టు వరం ప్రసాదించాడు; శ్రీకృష్ణుడై జన్మించి ఆ వరాన్ని సఫలం చేశాడు.

---

*62 తస్య ప్రసన్నో భగవాన్ ప్రాదాత్ సారూప్య మాత్మనః
శ్రియం చ పరమాం లోకే బలైశ్వర్యస్మృతీంద్రియం.

68 . . . సుదాముడు :

ఆవిధంగా అతనిపట్ల ప్రసన్నుడయిన శ్రీకృష్ణుడు, రామునితో సహా, సుదాముడనే ఒక మాలాకారునిఇంటికి వెళ్ళాడు. అలా, తమకు తామై కోరి దర్శన మిచ్చిన రామ కృష్ణులకు సుదాముడు, ఉత్త మాసనం సమర్పించుకున్నాడు. ఆ తరువాత, అమితభక్తితో వారి పాదాలు కడిగాడు. వారి శరీరమంతటా చల్లనిసుగంధం పూశాడు. వారిని వివిధపుష్పాలతో అలంకరించి పూజించాడు. అనంతరం వారిని ఉద్దేశించి...

'పావనమయ్యె నా కులము పండె దపంబు గృహంబు లక్ష్మికిన్
సేవితమయ్యె నిష్టములు సేకుఱె విశ్వనిదాన మూర్తులై
భూవలయంబుగావ నిటుపుట్టిన మీరలు రాకజేసి నే
నే విధ మాచరింతు బను లెయ్యవి బంట నెరుంగ జెప్పరే!'

అని వినయపూర్వకంగా నివేదించుకున్నాడు; ప్రార్థించాడు.

తమపట్ల సుదామునకున్న భక్తిని గ్రహించి రామ కృష్ణులు సంతుష్టులయినారు. అది కారణంగానే, 'ఏదైనా ఒకవరం కోరుకో వలసింది' అని వా రతనితో అన్నారు. ఆవెంటనే, సుదాముడు శ్రీకృష్ణుని ఉద్దేశించి...

'నీ పాదకమలసేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును
దాపసమందార నాకు దయసేయగదే!'

అని అర్థించాడు.

ఆవిధంగా అనన్యభక్తిని ప్రదర్శించుకున్న సుదామునకు, శ్రీకృష్ణుడు*[63] అతడు కోరిన వరాలతోపాటు, అతని వంశాభివృద్ధికి

*63. ఇతి తస్మై వరం దత్వా శ్రియం చాన్వయవర్ధినీం
బల మాయు ర్యశః కాంతిం నిర్జగామ సహాగ్రజః.

అవసరమైన ఐశ్వర్యాన్ని, బలాన్ని, ఆయువునూ, యశాన్ని, తేజాన్ని కూడా ప్రసాదించాడు.

సుదాముడు. పూర్వం, కుబేరుని చైత్రరథవనంలో పూలు ఏరేవాడుగా ఉండేవాడు. అప్పుడతని పేరు హేమమాలి.

హేమమాలి న్యాయబుద్ధిగలవాడు. పెద్దలకు విధేయుడు. దానశీలుడు. హరిసేవాపరాయణుడు.

అతడు శ్రీహరిని సాక్షాత్కరింపచేసుకునే ఉద్దేశంతో, ఐదువేల అరవిందాలను ఏరి కోరి సమకూర్చుకుని, మహేశ్వరునిస్వయంగా అర్చించాడు.

మహేశ్వరుడు అతని భక్తికి ఆనందించి, ప్రత్యక్షమై, 'వరమేదైనా కోరుకోవలసింది' అన్నాడు. అది విన్న హేమమాలి, ఆయన్ని అమితంగా స్తుతించి, 'స్వామీ! జగన్నాథుడైన శ్రీమన్నారాయణుడు నా ఆతిథ్యాన్ని స్వీకరించేటట్టు అనుగ్రహించవలసింది' అన్నాడు.

హేమమాలి కోరికను మహేశ్వరుడు మన్నించాడు. మహేశ్వరుడిచ్చిన ఆ వరాన్నే, శ్రీకృష్ణుడు ద్వాపరాంతాన చెల్లించటం జరిగింది.

## 70. కంస దాసి: కుబ్జ :

సుదామునకు ఆవిధంగా వరాలు ప్రసాదించి, నగరసౌభాగ్యాన్ని తిలకించే ఉద్దేశంతో, బలరామ కృష్ణులు అక్కడినుంచి బయలుదేరి వెళ్ళారు. వారలా వెడుతూఉండగా, మైపూతలతో నిండిన బంగరు పాత్రలు తీసుకునిపోతున్న కంసదాసి, కుబ్జ, వారికి కనిపించింది. శ్రీకృష్ణుడు, ఆమె వికృతాకృతిని చూసి అమితంగా జాలిపడ్డాడు. అదికారణంగానే, ఆమె నాపి...

'ఎవ్వరిదానవు లేపము
లెవ్వరికిం గోరి కొనుచు నేగెదు నీ పే
రెవ్వతె మా కి మ్మిన్నియు
నివ్వటిలెదు చక్కనగుచు నీరజనేత్రా !'

అని పలుకరించాడు.

ఆ పలుకులు విన్న కుబ్జ, రామ కృష్ణుల రూప లావణ్యా సౌంద ర్యాదులు చూసి ముగ్ధురాలయింది. వారి మధుర మందహాసంచూసి మురిసిపోయింది. అది కారణంగానే, ఆమె, తన్ను పలుకరించిన కృష్ణయ్యా నుద్దేశించి...

'చక్కనివాఁడ వౌదు సరసంబుల నొంపకు మెల్లవారికిం
జక్కదనంబు లెక్కడివి చారు శరీర త్రివక్రయంద్రు నే
నిక్కము కంసుదాసిని వినిర్మల లేపన విద్యాదాన నన్
మిక్కిలి రాజు మెచ్చు దగ మీరు విలేపనముల్ ధరింపరే !'

అని సమాధానపూర్వకంగా ప్రార్థించింది. వారికి స్వయంగా మైపూ తలు పూసింది. మనసారా వారిని సేవించింది.

అలా తమ్ము సేవించిన కుబ్జపట్ల రామ కృష్ణులు ప్రసన్ను లయినారు. ఆవెంటనే శ్రీకృష్ణుడు*64 ఆమె పాదంమీద తనపాదం మోపి, ఆమె గడ్డంక్రింద చెయ్యిపెట్టి పైకి ఎత్తాడు. అలా ఎత్తటం వల్ల ఆమెకు నడుంవద్దా, వక్షస్థలంవద్దా, కంఠంవద్దా అంతవరకూ ఉన్న వంకరలు తొలగిపోయినై ; ఆమె సౌందర్యరాశిగా తయా రయింది.

---

*64 పద్భ్యా మాక్రమ్య ప్రపదే ద్వ్యంగుల్యుత్తానపాణినా
ప్రగృహ్య చుబుకేఽధ్యాత్మ ముదనీనమ దచ్యుతః.
సా త దర్జు సమానాంగీ బృహచ్ఛ్రోణి పయోధరా
ముకుందస్పర్శనాత్ సద్యో బభూవ ప్రమదోత్తమా.

సీతా రామ లక్ష్మణులు జనస్థానంలో ఉన్న సమయంలో, లంకేశ్వరుని సోదరి అయిన శూర్పణఖ వారిని సమీపించటం, రామచంద్రుని మోహించి, తన్ను పెండ్లిచేసుకోవలసిందిగా ఆయన్ని కోరటం జరిగింది. రాముడు ఏకపత్నీవ్రతుడు కావటంవల్ల, ఆమె కోరికను తిరస్కరించాడు. ఆ యథార్థాన్ని గ్రహించలేక, శూర్పణఖ, సీతా మహాదేవి ఉండటంవల్ల రాముడు తన్ను తిరస్కరించాడనుకుని, సీతను మ్రింగటానికి ఉద్యమించింది. అది గ్రహించిన సౌమిత్రి దాని ముక్కునూ చెవులనూ కోసివేశాడు.

ఆవిధంగా అవమానింపబడ్డ శూర్పణఖ, ఆ తరువాత, పుష్కర తీర్థానికి పోయి, శంకరుని గురించి తీవ్రమైన తపస్సు చేసింది. శంకరుడామెకు ప్రత్యక్షమై 'నీ కోరిక ఏమిటి?' అని అడిగాడు. ఆయనకు సమాధానంగా, శూర్పణఖ, 'శ్రీరాముడు నా పట్ల ప్రసన్నుడయ్యేటట్టు వర మివ్వవలసింది' అని కోరింది. శంకరుడు 'సరే' నన్నాడు. కాని, ఆ కోరిక ద్వాపరయుగాంతాన తీరుతుందని చెప్పాడు.

శూర్పణఖకు శంకరు డిచ్చిన వరాన్ని గుర్తుంచుకుని, శ్రీకృష్ణుడు, కుబ్జగా వెలసిన ఆమెను అనుగ్రహించటం జరిగింది.

## 71. రాచ విల్లు :

ఆవిధంగా, కుబ్జకు ఉన్న వక్రత్రయాన్ని తొలగించి, ఆమెకు సెలవిచ్చి, బలరామ కృష్ణులు విపణిమార్గాన నడకసాగించారు. ఆ సమయంలో, పురప్రముఖులూ వణిజులూ వారిని అమితంగా సత్కరించటం జరిగింది. చందన తాంబూలాలనూ, పూలమాలలనూ బహువిధాలయిన కానికలనూ వారు బలరామ కృష్ణులకు సమర్పించుకున్నారు. అలా సన్మానితులవుతూ, వారు, పోయిపోయి, కంసుని ధనుశ్శాలలో ప్రవేశించారు; అక్కడ ఇంద్రచాపంమాదిరి మహోద్భుతంగా ఉన్న ఉద్దండ కోదండాన్ని చూశారు.

ఆ వెంటనే, శ్రీకృష్ణుడు దాన్ని సమీపించి *[65]కావలివారు వారి స్తున్నా లక్ష్యం చేయకుండా, దాన్ని ఎక్కు పెట్టాడు; మరుక్షణంలోనే, ఏనుగు చెఱకుగడను విరిచినట్టుగా విరిచేశాడు.

అది చూసిన నందాదులు అమితాశ్చర్యం పొందారు. అది కల్పించిన ధ్వనికి కంసాదులు భయవిహ్వలు లైనారు.

రాచవిల్లు నా విధంగా అగౌరవపరచిన గోపకుమారులను శిక్షించితీరాలని కోదండరక్షకులు నిశ్చయించుకున్నారు.*[66] అది గ్రహించిన రామ కృష్ణులు, చెరొక కార్ముకఖండాన్నీ తీసుకుని, వివిధాయుధాలతోనూ, పరివారంతోనూ, తమతో తలపడ్డవా రందరినీ సంహరించటం జరిగింది.

ఆ రోజుకు ఆవిధంగా మథురాపురీ విహారం ముగించుకుని రామకృష్ణులు విడిదల చేరుకున్నారు. ఆ మర్నాడు కంసుని కలుసుకునే ఉద్దేశంతో, ఆరాత్రి సుఖంగా నిద్రపోయినారు.

బలరామ కృష్ణులు, రాచవిల్లు విరిచారని విన్న కంసునకు అపరిమితమైన ఆందోళన కలిగింది. ఆ రాత్రి అతనికి నిద్ర పట్టలేదు. ఆ అశాంతికి తోడుగా, అతని కప్పుడు తన మరణాన్ని సూచించే ఉత్పాతాలుకూడా అనేకం గోచరించినై. అది కారణంగానే, అతనికి ప్రాణభీతి కలిగింది; అది అతని అశాంతిని అధికం చేసింది.

---

*65 కరేణ వామేన సలీల ముద్ధృతం
సజ్యం చ కృత్వా నిమిషేణ పశ్యతాం
నృణాం వికృష్య ప్రబభఞ్జ మధ్యతో
యథేక్షుదండం మదకర్యురుక్రమః.

*66. అథ తాన్ దురభిప్రాయాన్ విలోక్య బలకేశవౌ
క్రుద్ధౌ ధన్వన ఆదాయ శకలే తాంశ్చ జఘ్నతుః.

## 72. . . . కువలయాపీడం .

అంతలో తెల్లవారింది. రామ కృష్ణులు, తమవారితోపాటు లేచి, స్నానాదికాలు పూర్తిచేసుకున్నారు. ఆ వెంటనే, కంసరాజేంద్రుడు నిర్వహించబోతున్న మల్లక్రీడా మహోత్సవాన్ని దర్శించే కుతూహలంతో అటుగా బయలుదేరారు.

రామ కృష్ణులు మల్లరంగద్వారం చేరుకునే సమయానికి, భీకరంగా ఘీంకరిస్తూ, తమకు అడ్డుగాఉన్న మత్తగజం, కువలయాపీడం, వారికి కనిపించింది దాన్ని చూసి, వారక్కడ ఆగారు. ఆవెంటనే శ్రీకృష్ణుడు, పోరుకు సిద్ధమవుతున్నట్టుగా కాసెబిగించి కట్టుకున్నాడు. ముఖంమీద పడుతున్న చిరుకేశాలను ముడివేసుకున్నాడు. ఆ పైన మేఘగంభీర స్వరంతో, దాని మావటివాణ్ణి ఉద్దేశించి*[67] 'ఏనుగును దారిలోనుంచి తొలగించవలసింది' అని గర్జించాడు. కాని, ఆ మావటివాడు, అతని మాటలను లక్ష్యం చేయలేదు. లక్ష్యం చేయకపోవటమే కాదు; ఆ మత్తగజాన్ని, ఆ అన్నదమ్ములమీదకు ఉసికొల్పటంకూడా జరిగింది. అది గ్రహించిన శ్రీకృష్ణుడు అతణ్ణి ఉద్దేశించి...

'ఓరీ కుంజరపాల మా దెసకు నీ యుద్యన్మదేభేంద్రముం
బ్రేరేపం బనిలేదు త్రిప్పు మరలం బ్రేరేచినన్ నిన్ను గం
భీరోగ్రాశనితుల్య ముష్టి హతులన్ భేదించి నే డంతకుం
జేరం బుత్తు మహోత్తర ద్విపముతో సిద్ధంబు యుద్ధంబునన్'

అని హెచ్చరించాడు. అలా హెచ్చరించి ఊరుకోలేదు.

---

*67. బధ్వా పరికరం శౌరిః సముహ్యా కుటిలాలకాన్
ఉవాచ హస్తిపం వాచా మేఘనాదగభీరయా.

అంబష్ఠాంబష్ఠ మార్గం నౌ దేహ్యాపక్రామ మాచిరం
నో చేత్ పకుంజరం త్వాద్య నయామి యమసాదనం.

మించుగ గొప్పు జక్కనిడి మెల్లన పచ్చని చీర గాసె బం
ధించి లలాటకుంతలతతిన్ మరలించుచు సంగరక్రియా
చుంచుత బేర్చి బాలకుడు చూచు జనంబులు దన్ను 'బాపురే'
యంచు నుతింప డగ్గరియె హ_స్తజితాగము గంధనాగమున్.

శ్రీకృష్ణు డలా ముందుకు రావటం చూసి, మావటివాడు మండి పడ్డాడు. ఆ వెంటనే, అతడు, తన మ_త్తేభాన్ని ఉద్రేకపరచాడు; కృష్ణయ్యతో ఢీ కొలిపాడు.

అప్పుడు కృష్ణయ్యకూ కువలయాపీడానికీ మధ్య విచిత్రమైన పోరు జరిగింది. *[68] కువలయాపీడం కృష్ణయ్యను తన తొండంతో పట్టుకుంది. కృష్ణయ్య దానిపట్టు తప్పించుకుని, దాని కాళ్ళక్రిందకు దూరాడు. అది గ్రహించలేక, ఆ ఏనుగు, అతణ్ణి వెతుక్కుంటూ వల యాకారంగా కొంతసేపు తిరిగింది. కాని, చివరకు వాసనపట్టి, అతణ్ణి పట్టుకునే ఉద్దేశంతో, తన తొండాన్ని చాచింది. వెన్నదొంగ, దానికి అందకుండా, మెల్లమెల్లగా వెనక్కుపోయినాడు. అలా పోయి పోయి, దాని తోకపట్టుకుని లాగి, అటూ ఇటూ త్రిప్పి, దాన్ని అమి తంగా పీడించాడు. అది కారణంగా, దానికి రోషం కలిగింది. వెంటనే అది అతనిమీదకు కాలు విసరింది. ఆ దెబ్బను తప్పించుకునే నిమి_త్తం, నల్లనయ్య నేలకు వ్రాలాడు. అది చూసిన ఆ మ_త్తగజేంద్రం

---

*68 పుచ్ఛే ప్రగృహ్యాతి బలం ధనుషః పంచవింశతిం
విచకర్ష యథా నాగం సుపర్ణ యివ లీలయా.

స పర్యావ_ర్తమానేన సవ్యదక్షిణతోఽచ్యుతః
బభ్రామ భ్రామ్యమాణేన గోవత్సేనేవ బాలకః
తతోఽభిముఖ మభ్యేత్య పాణినాఽఽహత్య వారణం
ప్రాద్రవన్ పాతయామాస స్పృశ్యమానః పదే పదే.
స ధావన్ క్రీడయా భూమౌ పతిత్వా సహ సోత్థితః
తం మత్వాపతితం క్రుద్ధో దంతాభ్యాం సోఽహానత్ క్షితిం.

కృష్ణయ్య కూలిపోయినాడనే అనుకుంది. అనుకుని, అమితక్రోధంతో, అతణ్ణి తన దంతాలతో గ్రుచ్చి చీల్చటానికని అతనిమీదకు ఉరికింది. అది గ్రహించిన కృష్ణయ్య ప్రక్కకు తప్పుకున్నాడు. అత డలా తప్పుకోవటంవల్ల దాని దంతాలు భూమిలో గ్రుచ్చుకు పోయినై. అది అమితంగా బాధపడ్డది.

అలా బాధపడుతూఉన్న దాన్ని, మావటివాడు నిర్లక్ష్యంగా ఉద్రేకపరచాడు. దాంతో, ఆ గజేంద్రం ఒక్కసారిగా కృష్ణయ్య మీదకు ఉరకటం జరిగింది. అది గ్రహించిన కృష్ణయ్య *69 ఆ వెంటనే, దాని రెండు దంతాలనూ పట్టుకుని, వాటిని బలవంతంగా పెకలించాడు. వాటితోనే, దాన్ని మోది గాయపరచాడు. ఆ బాధను భరించలేక, ఆ దంతావళం గిలగిలతన్నుకుని ప్రాణం వదలింది. ఆ వెంటనే దాని తేజం శ్రీకృష్ణునిలో లీనమయింది.

పూర్వం, బలికుమారుడు, మందగతి అనేవా డొకడుండేవాడు. అతడు మహాబలుడు. సర్వశాస్త్రప్రవీణుడు.

అత డొకసారి శ్రీరంగయాత్రకు బయలుదేరాడు. అలా బయలుదేరినవాడు, దారిలో, కనిపించినవా రందరినీ మత్తగజం మాదిరి ఢీకొంటూ, పడత్రోసుకుంటూ గమించసాగాడు.

ఆ విధంగా అతని వల్ల బాధపొందినవారిలో, త్రితుడనే ఒక మునికూడా ఉన్నాడు. ఆయన వృద్ధుడు. బలహీనుడు. ఆయన, నేల మీద పడిపోయి, అమితంగా గాయపడ్డాడు. అది కారణంగా ఆయనకు ఆగ్రహం కలిగింది. ఆ వెంటనే ఆయన, మందగతిని ఉద్దేశించి, 'నువ్వు

*69 త మాపతంత మాసాద్య భగవాన్ మధుసూదనః
నిగృహ్య పాణినాహ స్తం పాతయామాస భూతలే.
పతితస్య పదాఽఽక్రమ్య మృగేంద్ర ఇవ లీలయా
దంత ముత్పాట్య తేనేభం హ స్తిపాంశ్చాహన ద్ధరిః



ఏనుగుమాదిరి చరిస్తున్నావు కాబట్టి ఏనుగువై పోవలసింది' అని శపించాడు.

శాపం పొందినమీదట, మందగతికి తనదోషంతెలిసివచ్చింది. ఆ వెంటనే, అతడు, ఆయన పాదాలమీదపడి క్షమించవలసిందిగా ప్రార్థించాడు. కాని, ఆమహర్షి, తన శాపం వ్యర్థం కాదనీ, శ్రీకృష్ణునిద్వారా మాత్రమే అతనికి ముక్తి లభిస్తుందనీ తెలియచేశాడు.

ఆ తరువాత, మందగతి, కువలయాపీడమనే పేరుతో వింధ్య పర్వతాలలో జనించటం జరిగింది. దాన్ని, మగధేశ్వరుడైన జరాసంధుడు అతి కష్టంమీద స్వాధీన పరచుకున్నాడు. కాలక్రమాన, దాన్ని, కంస రాజేంద్రునకు కానికగా సమర్పించుకున్నాడు.

ఆ మత్త గజేంద్రాన్నే, శ్రీకృష్ణుడు, సునాయాసంగా సంహరించటం, తద్వారా, మందగతికి ముక్తిని ప్రసాదించటం జరిగింది.

## 73. *రంగస్థలి ప్రవేశం :*

ఆవిధంగా, కువలయాపీడం అనే మత్త మాతంగాన్ని వధించి*70 గోవిందుడు, దాని దంతాన్ని బుజాన పెట్టుకుని, బలరామునితోనూ, తదితర యాదవులతోనూ రంగస్థలంలో ప్రవేశించాడు. అలా ప్రవేశించిన కృష్ణయ్య *71 మల్లులకు పిడుగుమాదిరిగా, పురుషులకు మూర్తిదాల్చిన పౌరుషంగా, యువతీమణులకు నవ

*70 మృతకం ద్విప ముత్సృజ్య దంతపాణిః సమావిశత్
అంసన్యస్త విషాణోఽసృ స్మద బిందుభిరంకితః
విరూఢ స్వేద కణికా వదనాంబురుహో బభౌ.

*71 మల్లానామశని ర్నృణాం నరవరః స్త్రీణాం స్మరో మూర్తిమాన్
గోపానాం స్వజనోఽసతాం క్షితిభుజాం శాస్తా స్వపిత్రోః శిశుః
మృత్యుర్భోజపతే ర్విరాడవిదుషాం తత్త్వం పరం యోగినాం
వృష్ణీనాం పరదేవ తేతి విదితో రంగం గతః సాగ్రజః

ఏనుగుమాదిరి చరిస్తున్నావు కాబట్టి ఏనుగువై పోవలసింది' అని శపించాడు.

శాపం పొందినమీదట, మందగతికి తనదోషం తెలిసివచ్చింది. ఆ వెంటనే, అతడు, ఆయన పాదాలమీదపడి క్షమించవలసిందిగా ప్రార్థించాడు. కాని, ఆమహర్షి, తన శాపం వ్యర్థం కాదనీ, శ్రీకృష్ణునిద్వారా మాత్రమే అతనికి ముక్తి లభిస్తుందనీ తెలియచేశాడు.

ఆ తరువాత, మందగతి, కువలయాపీడమనే పేరుతో వింధ్య పర్వతాలలో జనించటం జరిగింది. దాన్ని, మగధేశ్వరుడైన జరాసంధుడు అతి కష్టంమీద స్వాధీన పరచుకున్నాడు. కాలక్రమాన, దాన్ని, కంస రాజేంద్రునకు కానికగా సమర్పించుకున్నాడు.

ఆ మత్త గజేంద్రాన్నే, శ్రీకృష్ణుడు, సునాయాసంగా సంహరించటం, తద్వారా, మందగతికి ముక్తిని ప్రసాదించటం జరిగింది.

## 73. *రంగస్థల ప్రవేశం :*

ఆవిధంగా, కువలయాపీడం అనే మత్త మాతంగాన్ని వధించి*[70] గోవిందుడు, దాని దంతాన్ని బుజాన పెట్టుకుని, బలరామునితోనూ, తదితర యాదవులతోనూ రంగస్థలంలో ప్రవేశించాడు. అలా ప్రవేశించిన కృష్ణయ్య *[71] మల్లులకు పిడుగుమాదిరిగా, పురుషులకు మూర్తిదాల్చిన పౌరుషంగా, యువతీమణులకు నవ

---

*70 మృతకం ద్విప ముత్సృజ్య దంతపాణిః సమావిశత్
అంసన్యస్త విషాణోఽసు న్మద బిందుభిరంకితః
విరూఢ స్వేద కణికా వదనాంబురుహో బభౌ.

*71 మల్లానామశని నృణాం నరవరః స్త్రీణాం స్మరోమూర్తిమాన్
గోపానాం స్వజనోఽసతాం క్షితిభుజాం శాస్తా స్వపిత్రోః శిశుః
మృత్యుర్భోజపతే ర్విరాడవిదుషాం తత్త్వం పరం యోగినాం
వృష్ణీనాం పరదేవతేతి విదితో రంగం గతః సాగ్రజః

మన్మథుడుగా, గోపబాలురకు తమప్రాణస్నేహితుడుగా, దుర్మార్గులకు శాసకుడ్డుగా, తల్లిదండ్రులకు తమ ముద్దు బిడడ్డుగా, కంస రాజేంద్రునకు మృత్యుదేవతగా, అజ్ఞానులకు అల్పుడుగా, యోగీశ్వరులకు తత్త్వస్వరూపుడుగా, యాదవులకు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడుగా గోచరించటం జరిగింది. అలా దర్శనీయుడైన శ్రీకృష్ణునీ, అతని ప్రక్కనే ఉన్న బలరామునీ చూసి, అక్కడివారు...

'వసుదేవు నివాసంబున
వసుధన్ రక్షింప వీరు వైష్ణవ తేజో
ల్లసనమున బుట్టినారట
పసి బిడ్డలనంగ జనదు పరదేవతలన్'

అని, తమకు వారిపై కుదిరిన భక్తిభావాన్ని పరస్పరం వ్యక్తపరచుకున్నారు. అంతేకాదు...

'చంపె రక్కసిబట్టి చక్రవాకుని గూల్చె
బడ 'ద్రోసె' మద్దుల బకుని జీరె
నఘదైత్యు బొరిగొనె నడరి వత్సకు ద్రుంచె
గిరియెత్తి దేవేంద్రు గ్రిందు పఱిచె
గాళియు మర్దించె గహనానలము ద్రావె
గేశి నంతకుపురి గ్రేవ కనిచె
మయు పుత్రుబరిమార్చె మఱియును దానవ
భటుల హరించి గోపకుల గాచె

గోపకాంతల మనముల కోర్కి దీర్చె
నీ సరోరుహలోచనుం డీ శుభాంగు
డీ మహామహు డీ దిగ్గజేంద్రనిభుడు
మనుజమాత్రుడె తలపోయ మాధవుండు'

అని, శ్రీకృష్ణుని లీలావిశేషాలను తలచుకుంటూ అబ్బురపడసాగారు.

74. సమరాహ్వానం :

ఆవిధంగా, పౌరజనుల ప్రశంసలు పొందుతూ, రంగస్థలంలో ప్రవేశిస్తున్న రామ కృష్ణులను, చాణూరుడు చూశాడు. చూసి...

'వనమార్గంబున గోపబాలకులతో వత్సంబులన్ మేపుచున్
బెనగన్ మిక్కిలి నేర్చినా రనుచు నీ పృథ్వీజనుల్ సెప్ప మా
మనుజేంద్రుం డిట మిమ్ము జీరబనిచెన్ మల్లాహవక్రీడకుం
జనదే కొంత పరాక్రమింప మనకున్ సభ్యుల్ విలోకింపగన్'

అని పలుకరించాడు. అంతేకాదు.

'జనములు నేర్చిన విద్యలు
జననాథుని కొఱకు కాదె జననాథుడు నీ
జనములు మెచ్చగ యుద్ధం
బున మనముం గొంత ప్రొద్దు పుత్తమె కృష్ణా!'

అనికూడా అన్నాడు. అతనికి సమాధానంగా శ్రీకృష్ణుడు...*72

'సాములు లేవు పిన్నలము సత్త్వము గల్గనరాదు మల్లసం
గ్రామ విశారదుల్ కులిశకర్కశ దేహులు మీరు మీకడ
న్నేము చరించు టెట్లు ధరణీపతి వేడ్కలు సేయువారముం
గాము వినోదముల్ సలుపగాదనవచ్చునె యొక్కమాటికిన్'

అని అతని ఆహ్వానానికి తన అంగీకారాన్ని తెలియపరచాడు. అది విన్న చాణూరుడు, 'కృష్ణా! నువ్వుగాని బలుడుగాని నీ వన్నట్లు పిన్నలు గారు. వేయి యేనుగుల బలంగల కువలయాపీడాన్ని అనాయాసంగా 'ఇట్టె' కూల్చివేసిన మీరు బాలు రనుకోవటంగాని, మల్లయుద్ధ విశారదులు కారనుకోవటం గాని భ్రమ కాకపోదు. మీరు మాతో పోట్లాడ

*72 బాలా వయం తుల్యబలైః క్రీడిష్యామో యథోచితం
భవే న్నియుద్ధం మా ధర్మః స్పృశేన్మల్లసభాసదః

టంలో అధర్మమేమీ ఉండదు. ఇక మీ మీ శక్తిసామర్థ్యాలను మా పట్ల చూపవలసింది. మహారాజుకు వినోదం కలిగించవలసింది' అన్నాడు. ఆ వెంటనే, కృష్ణయ్య అతణ్ణి ఉద్దేశించి...

'నీ తోడుత నే బెనగెద
బ్రీతిన్ ముష్టికునితోడ బెనగెడి బలుడు
గ్రాతత మల్లాహవమున
భూతలనాథునికి మెచ్చు పుట్టింతు సభన్'

అని అతడితో పోరాడటానికి తనకున్న ఉత్సాహాన్ని వ్యక్తపరచాడు.

శ్రీకృష్ణుని పలుకులు చాణూరునకు రోషం కలిగించినై. అది కారణంగానే, అతడు కృష్ణయ్య నుద్దేశించి...

'నాతో బోరగ నెంతవాడ విసిరో నాపాటియే నీవు వి
ఖ్యాతుండం గులజుండ సద్గుణుడ సత్కర్మ స్వభావుండ నీ
కేతాదృగ్విభవంబులెల్ల గలవే యీవీట బోరాడుటల్
ప్రేతల్ చూడగ గుప్పిగంతు లిడుచే వీక్షింపు గోపార్భకా!'

అని, తన్నుతాను పొగడుకున్నాడు; ఆయన్ని హేళనచేశాడు. అప్పటికీ ఆగకుండా....

'ప్రల్లదమేటికి గోపక
బల్లిదుడను లోకమందు బ్రఖ్యాతుడ నా
చల్లడముక్రింద దూఱని
మల్లురు లే రెందు ధరణి మండలమందున్'

అని తన అద్వితీయ ప్రతాపాన్ని వెల్లడిచేసుకున్నాడుకూడా.

అంతలో, ముష్టికుడు ముందుకువచ్చి అతిభీకరంగా గర్జించాడు, బొబ్బలు చరచాడు. ఆ ధ్వనికి బెదరిపోయినవానిమాదిరి, కృష్ణయ్య, గబగబా బలరాముని వెనుకకు వెళ్ళాడు. అది చూసిన చాణూరుడు పగలబడి నవ్వాడు. అలా నవ్వుతూనే, అతణ్ణి ఉద్దేశించి...

'మహిమతో నుండంగ మధురాపురము గాని
వొలుపారు వైకుంఠపురము గాదు
గర్వంబుతో నుండ గంసుని సభ గాని
సంసార రహితుల సభయు గాదు
ప్రకటించి వినగ నా బాహునాదము గాని
నారదు వీణాస్వనంబు గాదు
చదురు లాడగ మల్లజన విగ్రహము గాని
రమతోడి ప్రణయ విగ్రహము గాదు
వెలసి తిరుగంగ వేదాంత వీధి కాదు
మొఱగిపోవంగ ముని మనోమూల కాదు
సాగి నడవంగ భక్తుల జాడ కాదు
శౌరి నాత్రోల నీ వెందు జనియె దింక !'

అని హేళనపూర్వకంగా అన్నాడు; అంటూనే అతని దిక్కుగా ఉరికాడు.

ఆ తరువాత, శ్రీకృష్ణ చాణూరులకూ బలరామ ముష్టికులకూ మధ్య భీకరమైన మల్లయుద్ధం జరిగింది. వారు చేతులుచఱచినప్పుడు, తొడ లప్పళించినప్పుడు, తలలతోను మోచేతులతోను డీకొన్నప్పుడు, అడచుకొన్నప్పుడు, క్రిందపడ్డప్పుడు కలిగిన శబ్దాలకు రోదోంతరాళం మారుమ్రోగింది. ఆ సమయంలో, ఆ నలుగురూ ప్రళయాగ్నుల మాదిరి ప్రజ్వలించారు. ఒకరికొకరు ఏవిధంగానూ తీసిపోకుండా, తమతమ సామర్థ్యాలను ప్రదర్శించుకున్నారు.

## 75. *ప్రజాభిప్రాయం :*

అదిచూసిన పౌరకాంతలు, బలరామ కృష్ణులమీద తమకు కలిగిన ప్రేమాతిశయంవల్ల, వారికి ఏ ఆపద సంభవిస్తుందో అని భయపడసాగారు. గుంపులుగుంపులుగాచేరి వేడినిట్టూర్పులువిడుస్తూ...

'మంచి కౌమారులం గుసుమమంజు శరీరుల దెచ్చి చెల్లరే
యంచిత వజ్రసారులు మహాద్రి కఠోరులు నైన మల్లురం
గ్రించులబెట్టి రాజు పెనగించుచు చూచుచు నున్నవాడు మే
లించుక లేదు మానుమన డిట్టి దురాత్ముని మున్ను వింటిమే.

చూచెదరు గాని సభికులు
నీ చిన్నికుమారకులకు నీ మల్లురకున్
ఓ చెల్ల యీడుగాదని
సూచింపరు పతికి దమకు శోకము గాదే!'

అని, రాజేంద్రునీ, సభికులనూ తమలోతాము తీవ్రంగా విమర్శించుకున్నారు. వారిలో కొందరు, శ్రీకృష్ణునిపట్ల తమకు జనించిన ప్రేమను ప్రదర్శించుకుంటూ...

"వేణు నాళములమై వెలసిన మాధవు
డధరామృతములిచ్చి యాదరించు
బింఛదామములమై పెరిగిన వెన్నుడు
మస్తకంబున దాల్చి మైత్రి నెఱపు
పీతాంబరములమై బెరసిన గోవిందు
డంసభాగమున బాయక ధరించు
వైజయంతికలమై వాలిన గమలాక్షు
డతి కుతూహలమున నరుత నునుచు

దనరు బృందావనంబున దరులమైన
గృష్ణు డానందమున జేరి క్రీడసల్పు
నెట్టి నోములనయిన ము న్నిట్టి విధము
లేల కామైతి మోయమ్మ యింక నెట్లు"

అని పరస్పరం అనుకుని, తమదైన దురదృష్టానికి వాపోవసాగారు, అంతలో...

ధృతిసెడి లోబడె మల్లుం
డతులిత భవజలధితరికి హతరిపు పురికిన్
జితకరికిన్ ధృతగిరికిన్
తతహరిరవ భరిత శిఖరి దరికిన్ హరికిన్.

ఆ వెంటనే శ్రీకృష్ణుడు అతణ్ణి పట్టుకుని గిరగిర త్రిప్పి నేలకు వేసికొట్టాడు. అది కారణంగా, చాణూరుడు, నెత్తురు కక్కుకుని ప్రాణం వదిలాడు.

అదే సమయంలో, బలరాముడు, ముష్టికుని పడద్రోసి, పాదంతో త్రొక్కి ప్రాణాలుతీయటం జరిగింది. అదిచూసిన ఇతర మల్లురు ఆ వెంటనే, ఒక్కుమ్మడిగా బలరామకృష్ణులతో తలపడ్డారు. వారందరినీ కూడా ఆ అన్నదమ్ములు అవలీలగానే వధించేశారు. ఆ పరిస్థితి నంతనూ అర్థం చేసుకున్న ఇతరవీరులు చెల్లాచెదరై పోయినారు.

ఆవిధంగా మల్లు రందరినీ వధించిన బలరామ కృష్ణులనుచూసి, కంసుడు తప్ప మిగిలినవా రందరూ అమితాశ్చర్యం పొందారు; ఆ చిరంజీవులను విశేషంగా ప్రస్తుతించారు.

పూర్వం, అమరావతీపురంలో, ఉతథ్యుడనే ఒక మహర్షి ఉండేవాడు. ఆయనకు అమితసౌందర్యమూర్తులైన అయిదుగురు కుమారులుండేవారు. వారు పెరిగి పెద్దవారై కూడా, విద్యాబుద్ధులు వృద్ధి చేసుకోకుండా, బలాధిక్యతను మాత్రమే పెంపొందించుకుంటూ, తోమర ముద్గరాదులతో సమరక్రీడ సలుపుతూ కాలం గడిపేవారు. అది చూసిన ఉతథ్యుడు, వారు భ్రష్టులైనారని భావించి అమితంగా విచారపడేవాడు.

బ్రాహ్మణులై జన్మించికూడా, శమ దమాది సంపత్తి లేకుండా, క్షత్రియోచితమైన కర్మలలో మెలుగుతూఉన్న కుమారులకు ధర్మ మార్గాన్ని బోధించాలని ఆ తండ్రి ఎంతగానో ప్రయత్నించాడు.

కాని, అతని ప్రయత్నాలన్నీ విఫలమైపోయినై. వారు ఆయన మాటను ఇసుమంతైనా పాటించకుండా వ్యవహరించసాగారు.

అది గ్రహించిన ఉతథ్యుడు ఒకసారి, అమితమైన వేదనతో, వారిని ఉద్దేశించి, 'మీరు అసురులై పుట్టి, అసురసంపర్కం పొంది, మల్లవిద్యాప్రదర్శకులుగా చరిస్తారు' అని శపించాడు.

తండ్రి వల్ల ఆవిధంగా శపింపబడ్డ సోదరులే, ఆ తరువాత, చాణూరుడు, ముష్టికుడు, శలుడు, తోశాలకుడు, కూటుడు అనే అసురులుగా జన్మించటం, కాలనేమి అయిన కంసుని కొలువులో చేరటం, చివరకు శ్రీకృష్ణుని మూలంగా శాపవిముక్తి పొందటం జరిగింది.

76. *కంస సంహారం :*

ఆ సమయంలో కలిగిన కలకలాన్ని నివారించి, కంసుడు, తన మంత్రుల నుద్దేశించి...

'వల్లవబాలురన్ నగరి వాకిటికిన్ వెడలంగ 'ద్రోయు' డీ
గొల్లల ముట్టికోల్ గొనుడు క్రూరుని నందుని గట్టు డుర్వికిం
దెల్లముగాగ నేడు వసుదేవుని జంపుడు తండ్రిగాడు వీ
డెల్ల విధంబులం బరుల కిష్టుడు గావకు డుగ్రసేనునిన్'

అని ఆజ్ఞాపించాడు. ఆ పలుకులు విన్న శ్రీకృష్ణుడు, పట్టరాని ఆగ్రహంతో, అతని మీదికి ఒక్కసారిగా ఉరికాడు.

అలా, మృత్యువు మాదిరి తనమీదికి ఉరుకుతున్న కృష్ణయ్యను చూసి, కంసుడు, తటాలున తన ఆసనం మీదినుంచి క్రిందికి దుమికాడు. ఒరనుంచి ఖడ్గాన్ని పెరకి అతనితో తలపడ్డాడు అప్పుడు...*[73]

*73 ప్రగృహ్యా కేశేషు చలత్కిరీటం నిపాత్య రంగోపరి తుంగ మంచాత్
తస్యోపరిష్టాత్ స్వయ మబ్జనాభః పపాత విశ్వాశ్రయ ఆత్మతంత్రః.
తం సంపరేతం విచకర్ష భూమౌ హరి ర్యథేభం జగతో విపశ్యతః
హాహేతి శబ్దః సుమహాం స్తదాభూ దుదీరితః సర్వజనై (ర్నరేంద్ర).

పక్షీంద్రుం డురగంబు బట్టువిధ మొప్పం గేశబంధంబు లో
క క్షోభంబుగ బట్టి మౌళిమణు లాకల్పాంత వేళాపత
న్నక్షత్రంబులభంగి రాల రణ సన్నాహంబు రెట్టింప రం
గ క్షోణిం బడద్రోసె గృష్ణుడు వెసం గంసున్ నృపో త్తంసునిన్.

ఆవిధంగా, రంగమధ్యంలో కూలిపోయిన కంసునిపైకి ఉరికి, కృష్ణయ్య, అతని కిరీటాన్ని కాలితో తన్నాడు. అతని ప్రక్కటెముక లన్నీ నుగ్గునుగ్గయేటట్టు మర్దించాడు. అతడు ప్రాణాలు వదిలే వరకూ అలా పీడించి, చివరి, కతణ్ణి ఈడ్చి ఒకమూలకు విసిరివేశాడు. అంతలో, కంసునిలోనుంచి ఒక దివ్యతేజం బయటకు వచ్చి, శ్రీకృష్ణునిలో ప్రవేశించింది.

కంసుడు, రాత్రింబవళ్లు, అనుక్షణం, శ్రీకృష్ణునే చింతిస్తూ ఉండేవాడు. తింటూ, త్రాగుతూ, విహరిస్తూకూడా, అతడు శ్రీకృష్ణునే స్మరించుకునేవాడు. శ్రీకృష్ణునిచేత తాను సంహరింప బడటం తథ్యమని తెలుసుకుని, అతడు సర్వవేళలా, ఉద్విగ్న చిత్తంతో, ఆయననే తలచుకునేవాడు. ప్రతిపదార్థంలోనూ ఆయననే చూసే వాడు. అది కారణంగానే, అతడు మరణానంతరం ఆయనలో లీనమై పోవటం జరిగింది.

కంసుని మరణవార్త కర్ణపుటాల్లో పడగానే, అతని తమ్ములు కంకుడు, న్యగ్రోధకుడు, గహ్వుడు మొదలయినవారు, అన్నఋణం తీర్చుకునే నిమిత్తం, ఒక్కుమ్మడిగా బలరామ కృష్ణులమీదపడ్డారు. కాని, బలరాముడు, వారిలో ఒక్కనికూడా తమ్మునిని కందనీకుండా తనే హతమార్చేశాడు.

కంసానుజులు పూర్వం అలకాపుర నివాసులు. దేవయక్షుడనే వాని కుమారులు. దేవకూట, మహోగిరి, గండ, చండ, ప్రచండ, ఖండ, అఖండ పృథువులనే పేర్లుకలిగి ఉండేవారు.

ఆ అన్నదమ్ము లొకసారి, తమ తండ్రి ఆదేశం ప్రకారం, మానసరోవరానికి వెళ్ళి, మహేశ్వర పూజార్థం అరవిందాలను తీసుకు రావటం జరిగింది. కాని, దారిలో, వాటి సౌరభానికి ముగ్ధులై, వారు, వాటిని ఆఘ్రాణించారు. దానివల్ల, వారికి, ఉచ్ఛిష్టీకృతదోషం సంభవించింది అది కారణంగా, వారు, ఎనిమిది మందీ, వరుసగా మూడు జన్మలలో అసురులై జనించటం జరిగింది. మూడవమారు, వారు ఉగ్రసేన సుతులైనారు; శ్రీకృష్ణ బలరాముల దర్శన స్పర్శ నాదుల ద్వారా పాపవిమోచనం పొందారు.

కంసరాజేంద్రుని మరణవార్త విని అతని పత్నులు అక్కడకు పరుగు పరుగున వచ్చారు. వచ్చి, కూలిపోయిన కంసుని కళేబరంమీద పడి అమితంగా రోదించారు.

## 77. వసుదేవాదుల బంధవిముక్తి :

అలా రోదిస్తున్న రాజపత్నుల నూరడించి, శ్రీకృష్ణుడు, కంసాదులకు దైహిక సంస్కారాలు జరిపించే ఏర్పాట్లన్నీ చేశాడు. అనంతరం, బలునితో సహ బయలుదేరివెళ్ళి, తనతలిదండ్రులను కలుసుకున్నాడు. వారి సంకెలలు విడిపించాడు. వారికి సాష్టాంగనమస్కారం చేశాడు.

అంతకుముందు, అక్కడజరిగినవిశేషాలన్నింటినీ గ్రహించినదేవకీ వసుదేవులకు, తమకు పాదాభివందనంచేస్తున్న చిరంజీవులుజగదీశ్వరులే కాని సామాన్యులు కారన్న అభిప్రాయంతో, వారిని లేవదీయటానికి గాని, ఆలింగనం చేసుకోవటానికి గాని సంకోచించారు. వారిని స్పృశించటంకూడా వారిపట్ల అపచారం చేయటం కావచ్చునని భావించారు. అందుకనే వారివంకచూస్తూ, భక్తితో నిలబడిపోయినారు.

శ్రీకృష్ణుడు అది గ్రహించాడు. తమతల్లిదండ్రులు, తమ్ము ప్రేమించి, సేవించి, దివ్యానుభూతుల ననుభవించకముందే, తమ దివ్యత్వాన్ని గ్రహించటం, వారి ఆనందానికి పరిపూర్ణత్వాన్ని ప్రసాదించ

దని భావించాడు; అది కారణంగానే, *[74] వారికి లభించిన జ్ఞానాన్ని తొలగించే నిమిత్తం తన మాయను వారిమీద ప్రయోగించాడు. వారిని ఉద్దేశించి ఇలా అన్నాడు.

'కారాశాలల మా నిమిత్తము మిముం గంసుండు గారింపగా
వారింపంగ సమర్థతల్ గలిగియున్ వారింపగా రాక ని
ష్కారుణ్యాత్ముల మైన క్రూరుల మహా కౌటిల్య సంచారులన్
సారాతిక్షములార మమ్ము గొఱతల్ సైరించి రక్షింపరే!'

అని బ్రతిమాలుకున్నాడు. ఆ సందర్భంలోనే...

'చెల్లుబడి గలిగి యెవ్వడు
తల్లికి దండ్రికిని దేహ ధనముల వృత్తుల్
చెల్లింప డట్టి కష్టుడు
ప్రల్లదు డామీద నాత్మపలలాశి యగున్.
జననీ జనకుల వృద్ధుల
దనయుల గురు విప్రసాధు దారాదుల నే
జనుడు ఘనుడయ్యు బ్రోవక
వనరును జీవన్మృతుండు వాడు ధరిత్రిన్'

అనికూడా. తనహృదయాన్ని, ఆయన, దేవకీ వసుదేవులకు విశదపరచుకున్నాడు.

మాయామానవుడయిన శ్రీహరి, ఆవిధంగా, తనకు తలిదండ్రులమీద ఉన్న గౌరవాభిమానాలను వ్యక్తపరచుకుని, మాతామహుడైన ఉగ్రసేనుని సమీపించి....

'అనఘ యయాతి శాపమున యాదవ వీరులకున్ నరేశ్వరా
సనమున నుండరాదు నృపసత్తమ రాజవుకమ్ము భూమి కే

---

*74 పితరా వుపలబ్ధార్థౌ విదిత్వా పురుషోత్తమః
మా భూదితి నిజాం మాయాం తతాన జనమోహినీం.

నిను గొలువంగ నిర్జరులు నీకరి బెట్టుదు రన్య రాజులం
బనిగొను టెంత నమ్ము జనపాలనశీలివి గమ్ము వేడ్కతోన్'

అని మన్నించి, ఆయన్ని రాజుగా అభిషేకించాడు. ఆ వెంటనే, పవమానుని పిలిచి, 'సుధర్మ' అని పిలువబడే ఇంద్రసభను ఆయనకు తెచ్చి ఈయవలసిందిగా ఆదేశించాడు.

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, బలరామ సహితుడై, నందునివద్దకు వెళ్ళి, ఆయనకు గౌరవం చూపాడు. ఆ సమయంలోనే, ఆయన్ని ఉద్దేశించి...*75

'తండ్రిం జూడము తల్లి జూడము యశోదాదేవియున్ నీవు మా
తండ్రిం దల్లియు నంచు నుండుదుము సద్ధర్మంబులం దొల్లి యే
తండ్రుల్ బిడ్డల నిట్లు పెంచిరి భవత్స్వజన్యభావంబులం
తండ్రీ యింతటివార మైతిమికదా తత్తద్వయోలీలలన్'

అని ఆ దంపతులపట్ల తమ కృతజ్ఞతను విశదపరచుకున్నాడు. వారిని దివ్యవస్త్రాద్యలంకారాలతో సత్కరించాడు.

అనంతరం, *76 అంతకు పూర్వం, కంసునిబాధ భరించలేక దూరప్రాంతాలకు వెళ్ళిపోయిన తన వారిని, యాదవులను, వృష్ణులను, అంధకులను, మాధవులను, దాశార్హులను, కుకురులు మున్నగు

---

*75 స పితా సా చ జననీ యౌ పుష్ణీతాం స్వపుత్రవత్
శిశూన్ బంధుభి రుత్సృష్టా న కల్పైః పోషరక్షణే.
యాత యూయం వ్రజం తాత వయం చ స్నేహదుఃఖితాన్
జ్ఞాతీన్ వో ద్రష్టు మేష్యామో విధాయ సుహృదాం సుఖం

*76 సర్వాన్ స్వజ్ఞాతి సంబంధాన్ దిగ్భ్యః కంస భయార్దితాన్
యదు వృష్ణ్యంధక మధు దాశార్హ కుకురాదికాన్
సభాజితాన్ సమాశ్వాస్య విదేశావాసకర్శితాన్
న్యవాసయత్ స్వగేహేషు విత్తైః సంతర్ప్య విశ్వకృత్.

వారిని అందరనూ, అక్కడకు రప్పించుకుని, వారు అంతవరకు అనుభవించిన కష్టాలపట్ల తన సానుభూతిని తెలుపుకుని, వారందరికీ విశేష ధనరాసులను సమర్పించి, వారివారి, పూర్వనివాసాలలో వారికి పునరావాసం కల్పించాడు.

## 78. *గురు శుశ్రూష :*

అది జరిగిన కొద్దికాలానికి, వసుదేవుడు, గర్గాచార్యునిద్వారా రామకృష్ణులకు విధ్యుక్తంగా ఉపనయన సంస్కారం జరిపించాడు. ఆ సమయంలో, ఆయన, బ్రహ్మవిదులను యథావిధిగా పూజించాడు. యథోచితంగా సత్కరించాడు. అంతేకాదు. శ్రీకృష్ణబలరాముల జనన సమయంలో, తాను, బ్రాహ్మణోత్తములకు మానసికంగా దానం చేసిన గోవులను, అనంతర కాలంలో కంసుడు అన్యాయంగా స్వాధీన పరచుకున్న వాటిని, తెప్పించి, వాటి కొమ్ములకు బంగారపుతొడుగులు వేయించి, పైడిమెడ త్రాళ్ళతోనూ తదితరమైన ఆభరణాలతోనూ వాటిని అలంకరించి, వాటి వాటి దూడలతోసహా వాటిని స్వయంగా విప్రులకు సమర్పించుకున్నాడు.

ఆ తరువాత, రామ కృష్ణులు, బ్రహ్మచర్యదీక్షాపరులై ...

ఉర్విన్ మానవు లెవ్వరైన గురువాక్యోద్యుక్తులై కాని త
త్పూర్వారంభము సేయబోల దనుచున్ బోధించు చందంబునన్
సర్వజ్ఞత్వముతో జగద్గురువులై సంపూర్ణులై యుండియుం
గుర్వంగీకరణంబు సేయజని రా గోవిందుడున్ రాముడున్.

ఆ సమయంలో, సకల విద్యావిలాసి అయిన సాందీపని మహర్షి వారణాసిలో ఉంటున్నాడు. అది గ్రహించిన బలరామ కృష్ణులు అక్కడికి వెళ్ళారు. వెళ్ళి, ఆయనకు శిష్యులుగా చేరారు. ఆయన్ని సేవించి సంతుష్టిపరచారు.

అది కారణంగా, సాందీపని, వారికి, వేదవేదాంగాలను, ధనుర్వేదాన్ని, ధర్మశాస్త్రాన్ని, తర్కమీమాంసలను, రాజనీతిని, అలాగే అరువదినాలుగు విద్యలనూ నేర్పాడు. వారు నెరవాదులు కావటంవల్ల *77 అరువదినాలుగురోజుల్లోనే వాటినన్నింటినీ సాంగోపాంగంగా గ్రహించారు. ఆ తరువాత, ఆయన్ని అర్చించి, 'మహాత్మా! మీరుకోరిన గురుదక్షిణ నివ్వటానికి మేము సంకల్పించుకున్నాము. మీ అభీష్టమేదో తెలుపవలసింది' అని వినయపూర్వకంగా నివేదించుకున్నారు.

తన ప్రియశిష్యులయిన రామ కృష్ణులు అద్భుతమహిమా సమన్వితులని గ్రహించిన సాందీపని, తన భార్యతో ఆ విషయ మాలోచించాడు. ఆలోచించి...

'అంభోరాశి ప్రభాస తీర్థమున మున్నస్మత్తనూ సంభవుం
డంభోగాహము సేయుచున్ మునిగి లేడయ్యెం గృపాంభోనిధుల్
శుంభద్వీర్యులు మీరు మీ గురునికిన్ జోద్యంబుగా శిష్యతన్
గాంభీర్యంబున బుత్ర దక్షిణ యిడం గర్తవ్య మూహింపరే !'

అన్నాడు. అంతేకాదు.

'శిష్యులు బలాఢ్యులైన వి
శేష్య స్థితి నొంది గురువు జీవించును ని
ర్దూష్య గుణ బలగరిష్టులు
శిష్యులరై గురునికోర్కె సేయందగదే !'

అనికూడా వారిని ప్రోత్సహించాడు. ఆ వెంటనే బలరామకృష్ణులు*78 తమ దివ్య రథాన్ని అధిరోహించి, ప్రభాసతీర్థం చేరుకున్నారు.

---

*77 అహోరాత్రైశ్చతుః షష్ట్యా సంయత్తౌ తావతీః కలాః
గురుదక్షిణయాఽచార్యం ఛందయామాసతు (ర్నృప)

*78 తథే త్యథారుహ్యౌ మహారథౌ రథం ప్రభాస మాసాద్య దురంతవిక్రమౌ
వేలా ముపవ్రజ్య నిషీదతుః క్షణం సింధుర్విదిత్వార్హ్ణ మాహరత్ తయోః.
త మాహ భగవానాశు గురుపుత్రః ప్రదీయతాం
యోఽసావిహ త్వయా గ్రస్తో బాలకో మహతోర్మిణా.

రామకృష్ణులు, తన్ను సమీపించారని తెలుసుకున్న వరుణదేవుడు, వారి మాహాత్మ్యాన్ని గ్రహించినవాడు కావటంవల్ల, అనేకమైన కానికలు తీసుకుని వారిని సందర్శించాడు. ఆ సందర్భంలో, కృష్ణయ్య ఆయన నుద్దేశించి...

'సాగర సుబుద్ధితోడను
మా గురుపుత్రకుని దెమ్ము మాఱాడిన నీ
వాగడ మవుదువు దుస్సహ
వేగ రణాభీల నిశిత విశిఖాగ్నులకుఁ'

అని తన హృదయాన్ని తెలియపరచుకున్నాడు.

ఆమాటలు విన్న సముద్రుడు అడలిపోయినాడు. అది కారణంగానే, అతడు, వారిని ఉద్దేశించి...

'వంచన యింతలేదు యదువల్లభులార ప్రభాస తీర్థమం
దంచితమూర్తి విప్రసుతు డార్యుడు తోయములాడుచుండ న
త్పంచలి తోర్మి యొక్కటి ప్రచండగతిం గొనిపోయె బోవగా
బంచజనుండు మ్రింగె నతి భాసురశీలుని విప్రబాలునిన్.'

అని నివేదించుకున్నాడు. ఆపైన, పంచజనుని నివాసంకూడా వారికి తెలియపరచాడు.

ఆవెంటనే, రామకృష్ణులు, శంఖరూపధారి అయిన పంచజనుని సమీపించి, ఆ అసురుని సంహరించారు. అతని పొట్టఅంతా గాలించి చూశారు. కాని, వారి గురుపుత్రుడు వారి కందులో కనిపించలేదు. ఆవెంటనే వారు, అతని శరీరంలో పుట్టిన పాంచజన్యం అనే శంఖాన్ని తీసుకుని, విప్రబాలుని వెతుక్కుంటూ సంయమనీపురం చేరుకున్నారు.

ఆవిధంగా సంయమనీపురం చేరుకుని, నగరద్వారంలో ఉండే, శ్రీకృష్ణుడు పాంచజన్యం పూరించాడు. అదివిన్న యముడు, ఆ

వెంటనే, ఆ అన్నదమ్ములను సమీపించి భక్తితో పూజించాడు; వారు వచ్చినపనిని తెలుపవలసిందిగా కోరాడు.

యముని వినయ వినమ్రతలకు శ్రీకృష్ణుడు అమితానందం పొందాడు. అది కారణంగానే, ఆయన, అతణ్ణి ఆదరభావంతో చూసి*79 'మా గురుపుత్రుడు తన పూర్వకర్మకు కట్టుబడి అకాల మరణంపాలుకావటం జరిగింది. అతణ్ణి ఇప్పుడు మాకు ఒప్పచెప్ప వలసింది' అన్నాడు.

ఆ పలుకులువిన్న శమనుడు, ఆ వెంటనే, అక్కడ ఉన్న విప్రబాలుని శ్రీకృష్ణునకు అప్పగించాడు. అతణ్ణి తీసుకుని పోయి, రామ కృష్ణులు తమ గురువర్యునకు సమర్పించుకున్నారు; ఆయన ఆశీస్సులందుకుని తిరిగి మథురానగరం చేరుకున్నారు.

శ్రీమన్నారాయణునకు ఉపాంగాలుగా ఉండి ప్రఖ్యాతి పొందిన చక్రాదులలో పాంచజన్యం ఒకటి. ఆ పాంచజన్యాన్ని పూరించటం ద్వారా, శ్రీహరి, శాత్రవానీకంలో భీతిని కల్పిస్తూ ఉండేవాడు; అనంతరం వారిని జయిస్తూ ఉండేవాడు.

పాంచజన్యానికి అది గర్వకారణంగా ఉండేది. శ్రీసతికి కూడా దుర్లభమైన శ్రీహరి అధరసుధారసాన్ని అనవరతం ఆస్వాదిస్తూ ఉండే అదృష్టం, తనకుమాత్రమే లభించినట్టు అది భావించేది. అది కారణంగానే శ్రీహరివైన చక్రాద్యాయుధాలనూ శ్రీసతినీ కూడా చిన్నచూపు చూసేది.

అది గ్రహించిన శ్రీసతి, దాని గర్వాన్ని హరించేనిమిత్తం, అసురజన్మ పొందవలసిందిగా దాన్ని శపించింది. అలా శపింపబడిన

*79 గురుపుత్ర మిహానీతం నిజకర్మనిబంధనం
ఆనయస్వ మహారాజ మచ్ఛాసనపురస్కృతః.

శంఖమే, ఆ తరువాత, పంచజనుడనే పేరుగల అసురుడుగా జనించటం జరిగింది.

79 . . . జరాసంధుడు :

శ్రీకృష్ణుడు కంసుని సంహరించిన తరువాత, కంస భార్యలయిన అస్తి ప్రాప్తి అనేవారు, తమ పుట్టింటికి వెళ్లారు. వెళ్లి, కంసుని దుర్మరణాన్ని గురించీ, తమకు సంభవించిన దురవస్థను గురించీ తమ తండ్రిఅయిన జరాసంధునికి దీనాతిదీనంగా నివేదించుకున్నారు. ఆ సందర్భంలోనే....

'వాండ్రుఁ వీండ్రును రాజులే యనుచు గర్వప్రౌఢితోయాదవుల్
వేండ్రంబైన బలంబుతో మథురకున్ వేవచ్చి నిష్కారణం
బాండ్రున్ బిడ్డలు బంధులున్ వగవ గంసాదిక్షమానాథులం
దండ్రీ చంపిరి; కృష్ణుచేత నిటు వైధవ్యంబు వచ్చెం జుమీ'

అనికూడా వారు విన్నవించుకోవటం జరిగింది.

వారి పలుకులువిన్న జరాసంధుడు ప్రళయకాలానలం మాదిరి ప్రజ్వలించాడు. అది కారణంగానే అతడు...

'ఏమీ కంసుని గృష్ణుడే రణములో హింసించెనో చెల్ల నా
సామర్థ్యంబు దలంప డించుకయు మచ్చండ ప్రతాపానలో
ద్దామార్చుల్ వడి నేడు గాల్చు యదు సంతానాటవీ వాటికన్
భూమిం గ్రుంగిన మింటదాగిన మహాంభోరాశిలో జొచ్చినన్.

యాదవ విరహిత యగు బో
మేదిని నాచేత నేడు మీదు మిగిలి సం
పాదితబలులై హరి రు
ద్రాదులు నింద్రాదు లెవ్వ రడ్డం బైనన్'

అని గర్జించాడు. ఆవెంటనే రణభేరి మ్రోయింపించి, ఇరవైమూడ క్షౌహిణుల బలంతో మథురమీదికి దాడివెళ్లాడు.

మహార్ణవం మాదిరి మథురపై బడ్డ మాగధసైన్యాన్ని చూసి, మాధవుడు చాలాసంతోషించాడు. భూభారాన్ని కొద్దిగాఅయినా తొలగించటానికి, జరాసంధుడు తనకు అవకాశం కల్పించాడుగదా అనుకున్నాడు. ఆ సమయంలో, జరాసంధునిమాత్రం వదలి, అతనికి అండగావచ్చిన రాజు లందరినీ నిర్జించటానికే ఆయన నిశ్చయించుకున్నాడు.*80

అంతలో, ఆకాశమార్గాన, రెండు ఉత్తమరథాలు తన దిక్కుగా రావటం ఆయనచూశాడు. చూసి, వాటినీ, వాటిలో ఉన్న వివిధ యుద్ధోపకరణాలనూ బలరామునకు చూపుతూ...*81

'కంటే రామ రథంబు లాయుధములున్ గాఢ ప్రకాశంబులై
మింటన్ వచ్చెను వీనిగైకొని సురల్ మెచ్చన్ నృపశ్రేణులన్
బంటింపం బనిలేదు చంపుము ధరాభారంబు వారింపు మీ
వెంటన్ నీయవతారమున్ సఫలమౌ వేవేగ తెమ్మాజికిన్'

అని అతణ్ణి ప్రోత్సహించాడు. అతనితోసహా, సమరోన్ముఖుడై బయలుదేరాడు. అప్పుడు జరాసంధుడు శ్రీకృష్ణుని ఉద్దేశించి...

---

*80 హనిష్యామి బలం హ్యేతద్ భువి భారం సమాహితం
మాగధేన సమానీతం వశ్యానాం సర్వభూభుజాం.
అక్షౌహిణీభిః సంఖ్యాతం భటాశ్వ రథ కుంజరైః
మాగధస్తు న హన్తవ్యో భూయః కర్తా బలోద్యమం.
ఏతదర్థోఽవతారోఽయం భూభారహరణాయ మే
సంరక్షణాయ సాధూనాం కృతోఽన్యేషాం వధాయ చ
అన్యోఽపి ధర్మరక్షాయై దేహః సంభ్రియతే మయా
విరామాయాప్యధర్మస్య కాలే ప్రభవతః క్వచిత్.

*81 పశ్యార్య వ్యసనం ప్రాప్తం యదూనాం త్వావతాం ప్రభో
ఏష తే రథ ఆయాతో దయితా న్యాయుధాని చ.
యాన మాస్థాయ జహ్యేతద్ వ్యసనాత్ స్వాన్ సముద్ధర
ఏత దర్థం హి నౌ జన్మ సాధూనా మీశ శర్మకృత్.

'అదలించి రొప్పంగ నాలమందలు గావు
గంధ గజేంద్రసంఘములు గాని
పరికించి వినగ నంభారవంబులు గావు
వాజీంద్ర హేషారవములు గాని
పదహతి గూల్పంగ శాతబం డ్లివి గావు
నగసమాన స్యందనములుగాని
ప్రియము లాడంగ నాభీర లోకము గాదు
కాలాభవైరి వర్గంబుగాని

యార్ప వన వహ్ని గాదు బాణాగ్ని గాని
మఱియ బృందావనముగాదు మొనలుగాని
యమున గాదు నటింప ఘోరాజిగాని
పోరు నీ కేల గోపాల పొమ్ము పొమ్ము!'

అని హేళనపూర్వకంగా అన్నాడు. అంతేకాదు.

'తరుణిం జంపుటయో బకున్ గెడపుటో ధాత్రీజముల్ గూల్చుటో
ఖరముం ద్రుంచుటయో ఫణిం బరపుటో గాలిన్ నిబంధించుటో
గిరి హ_స్తంబున దాల్చుటో లయమహాగ్నిస్ఫార దుర్వార దు
ర్భర బాణాహతి నెట్లు నిల్చెదవు సప్రాణుండవై గోపకా!'

అని ఆయన్ని అవమానించటంకూడా జరిగింది. అదివిన్న శ్రీకృష్ణుడు 'జరాసంధా! ప్రభువులైనవారు పౌరుషాన్ని ప్రదర్శించుకుంటారు గాని ప్రగల్భాలు పలుకరు. ఐనా, అల్లుడు మరణించి ఉండటంవల్లా, ఆసన్న మరణుడవు కావటంవల్లా నువ్వు ఇప్పుడు పలికే పలుకులను మేము పాటించటం అంత సమంజసం కాదు. అది గ్రహించినవారం కావటం వల్లనే మే మిప్పుడు ని న్నేమీ అనలేకుండా ఉన్నాము' అన్నాడు. అదివిన్న జరాసంధుడు పగలబడి నవ్వాడు. నవ్వుతూనే,

తన సైన్యానికి, యాదవ సేనను ముట్టడించవలసిందిగా ఆజ్ఞాపించాడు, ఆ పైన శ్రీకృష్ణుని ఉద్దేశించి...

'బాలుడ వీవు కృష్ణ బలభద్రుని బంపు రణంబుసేయ గో
పాలక బాలుతోడ జనపాల శిఖామణి యైన మాగధుం
డాలము సేసెనంచు జనులాడెడి మాటకు సిగ్గుపుట్టెడిన్
జాలు దొలంగు దివ్యశర జాలుర మమ్ము జయింపవచ్చునే !'

అన్నాడు. ఆ మాటలువిన్న శ్రీకృష్ణునికి అమితమయిన రోషం కలిగింది. అది కారణంగానే, ఆయన...

'గోపాలుడ నని పలికితి
భూపాలక దీన నేమి పోరాడంగా
గోపాల మహీపాల
వ్యాపారాంతరము దెలియవచ్చుం బిదపన్'

అని అతనికి సమాధాన మిచ్చాడు. ఆ వెంటనే అతనితో తలపడ్డాడు.

ఆ పోరు, చూపరులకు అమితమైనభయం కలిగించింది. అందులో, జరాసంధుని పక్షీయులు చాలామంది సంహారింపబడ్డారు. అప్పుడు, బలరాముడు, ఒక్కసారిగా అతనిపై కురికి అతణ్ణి బంధించాడు. తన పిడికిటి పోట్లతో అతణ్ణి అమితంగా పీడించాడు. అతణ్ణి సంహరించటానికి కూడా పూనుకున్నాడు.

అది గ్రహించిన శ్రీకృష్ణుడు, అతణ్ణి అప్పుడు సంహారించటం సమంజసంకాదని తన అన్నగారికి నివేదించుకున్నాడు. ఆపైన, అతనికి బంధవిముక్తి కలిగించి, అతనితో...

'దుఃఖింపం బనిలేదు పొమ్ము బలసందోహంబులం దెమ్ము చే
తః ఖేదం బెడలంగ రమ్ము రిపులం దండింపు కాదేని భూ
స్వః ఖేలజ్జన మెల్లమెచ్చ నృప నీ శౌర్యోన్నతుల్ చూపి మే
దఃఖండంబులు భూతముల్ తిన దనుత్యాగంబు సేయందగున్'

అని పలికాడు; అతణ్ణి, యుద్ధరంగంనుంచి అప్పటికి పంపివేశాడు.

ఆ విధంగా అవమానింపబడి వెళ్ళిన జరాసంధుడు, ఆ తరువాత, పదిహేడుసార్లు మథురానగరంమీద దాడి చేయటం జరిగింది. కాని, ఏఒక్కసారీకూడా అతడు జయించిందిలేదు. అయినా, అతడు నిరాశ చెందకుండా, మరొకసారి ప్రయత్నించదలచాడు; దానికి తగిన సన్నాహాలు చేసుకోసాగాడు.

80. . . . కాలయవనుడు :

అతడలా ఉన్న సమయంలో, ఒకసారి శ్రీకృష్ణునిమీదకు, కాలయవనుడు దాడి వెళ్ళటం జరిగింది. అయినా, ఆ సందర్భంలో వారిరువురి మధ్యా ఏ విధమైన పోరూ జరుగలేదు. కాని, కాలయవనుడు కాలుని వీటికి అతిథి కావటం మాత్రం సంభవించింది.

కాలయవనుడు, ఆజన్మబ్రహ్మచారి యాదవ పురోహితుడూ అయిన గర్గాచార్యునకూ ఒక అప్సరస్త్రీకి జనించిన మహావీరుడు. అతడు యాదవులను అడలచేయటానికే జనించాడు.

వృష్ణ్యంధకాదులకు గురుడైన గర్గుడు, అవివాహితుడై ఉండటం తెలిసిన ఒకడు, ఒకసారి, 'ఇతడు పురుషుడే అయిన పక్షంలో ఇలా ఎందుకు ఉంటాడు?' అని హేళనగా అనటం జరిగింది. అది విన్న గర్గుడు, అమితంగా బాధపడ్డాడు. అతని శిష్యులైన యాదవులు, అది గ్రహించికూడా ఆ వాచాలుని యేమీ అనలేదు.

ఆ పైన గర్గుడు అడవికివెళ్ళి, పన్నెండు సంవత్సరాల పాటు, అమితనిష్ఠతో మహేశ్వరుని గూర్చి తపస్సు చేశాడు. ఆ సమయంలో ఆయన, లోహచూర్ణం మాత్రమే భుజించేవాడు.

గర్గాచార్యుని దీక్షకు మెచ్చి, మహేశ్వరుడు ఆయనకు ప్రత్యక్షమైనాడు. 'వరమేదైనా కోరుకోవలసింది' అన్నాడు. అప్పుడు గర్గుడు, ఆయన్ని ఉద్దేశించి; 'మహాత్మా! వృష్ణ్యంధకులకు భయాన్ని కలిగించే కుమారుని ప్రసాదించవలసింది' అని కోరాడు.

కాలక్రమాన, ఆయనకు, గోపకామినీరూపం ధరించిన ఒక అప్సరతో స్నేహం కలిసింది. ఆయనవల్ల ఆమెకొక కుమారుడు కలిగాడు.అతణ్ణి యవనపతి పెంచుకున్నాడు.

కాలయవనుడు గురుతేజుడు. గర్విష్టి. దుర్దముడు. ఎవ్వరినీ లక్ష్యం చేసే వాడు కాదు. అత డొకసారి నారదమహర్షి ని కలుసుకుని, 'స్వామీ ! ఈ ప్రపంచంలో వీరులనేవారు యెవరైనా ఉన్నారా !' అని అడిగాడు. దానికి సమాధానంగా నారదుడు, యాదవశిరోరత్న మైన శ్రీకృష్ణుని పేర్కొన్నాడు.

నారదుని పలుకులు వినగానే, కాలయవనునిలో మత్సరం జనించింది. ఆ వెంటనే, అతడు తన బలాన్నంతనూ సమకూర్చుకుని, మథురానగరంమీదికి దాడి వెళ్ళాడు.

అది గ్రహించిన శ్రీకృష్ణుడు, అతని దగ్గరకు, ఒక కృష్ణ సర్పాన్ని, మూతికుట్టి కుండలోపెట్టి పంపాడు; కృష్ణుడు కృష్ణసర్పం వంటి వాడని సూచిస్తూ.

కాలయవను డది గ్రహించాడు. గ్రహించి, కొన్ని గండు చీమల నేరి తెప్పించి, వాటిని ఆ కుండలోనే ఉంచి, శ్రీకృష్ణునకు పంపించాడు; ఎవరిమటుకువారు బలహీనులే అయినా, పదిమంది కలిసివస్తే ఎంతటి బలవంతుడైనా లోబడి తీరవలసిందేనని సూచిస్తూ.

శ్రీకృష్ణుడు పరిస్థితినంతనూ అర్థంచేసుకున్నాడు. 'కాలయవనుడు మూడుకోట్లమంది మ్లేచ్ఛులతో మథురానగర పరిసరాల్లో ఒక వంక దిగి ఉన్నాడు. జరాసంధుడు, రేపో మాపో కొన్ని అక్షౌహిణుల సేనతో మరొక దిక్కునుంచి రాబోతున్నాడు. యవన మాగధ సేనలు చేతులుకలుపుకున్న పక్షంలో, యాదవులకు అపాయం తప్పదు. ఆ ఆపదనుంచి వారిని రక్షించటం నా ధర్మం' అనుకున్నాడు. అది కారణంగానే, సాగరుని అడిగి, సముద్ర మధ్యాన, నూరు యోజ

నాల పొడవూ నూరు యోజనాల వెడల్పూ ఉన్న స్థలాన్ని సంపాదించుకున్నాడు అక్కడ ఒక మహాదుర్గాన్ని నిర్మించవలసిందిగా విశ్వకర్మనాదేశించాడు. విశ్వకర్మకూడా ఆ వెంటనే పనిని ప్రారంభించి, అనతికాలంలోనే...

వరుణపురముకంటె వాసవు పురి కంటె
ధనదువీటికంటె దండధరుని
నగరికంటె బ్రహ్మనగరంబుకంటె బ్ర
స్ఫుటముగాగ నొక్క పురము జేసె.

ఆ పురానికి అలంకారంగా, మహేంద్రుడు, తన సుధర్మ అనే సభాభవనాన్నీ, వృక్షరాజమైన పారిజాతాన్నీ పంపించాడు.

ఆవిధంగా పర్పాటయిన ద్వారకానగరానికి, శ్రీకృష్ణుడు, *82 తన యోగమాయాప్రభావం ద్వారా, తనవారి నందరినీ క్షణమాత్రంలో తరలించేశాడు వారి రక్షణభారాన్ని బలరామునకు ఒప్పగించాడు. తను, వనమాలనుమాత్రం ధరించి, నిరస్త్రుడై మథురానగరం దిక్కుగా వెళ్ళసాగాడు.

అలా, నగరంనుంచి తనవేపువస్తున్న శ్రీకృష్ణుని, కాలయవనుడు గుర్తించాడు గుర్తించి, ఎన్నో దినాలుగా తను ఎవరికోసం ఎదురు చూస్తున్నాడో అతడు, ఏకాకిగా, నిరాయుధుడై తనకంటబడ్డందుకు అమితంగా సంతోషించాడు. ఆ వెంటనే, ఆయన్ని బంధించే ఉద్దేశంతో, అమితాట్టహాసంచేస్తూ, ఆయన కెదురు వెళ్ళసాగాడు. అది చూసిన శ్రీకృష్ణుడు, అతనికి భయపడ్డవానిమాదిరిగా, వెనుదిరిగి

---

*82 తత్ర యోగప్రభావేణ నీత్వా సర్వజనం హరిః
ప్రజాపాలేన రామేణ కృష్ణః సమను మన్త్రితః
నిర్జగామ పురద్వారాత్ పద్మమాలీ నిరాయుధః.

పారిపోసాగాడు. ఆయన్ని తరుముకుంటూ, కాలయవనుడు వెళ్ళాడు. అలా వెళ్ళివెళ్ళి, ఒకచోట ఆగి....

'యదువంశోత్తమ పోకు పోకు రణ మీ న ర్హంబు కంసాదులం
గదనక్షోణి జయించితీవని సమిత్కామంబునన్ వచ్చితిన్
విదితఖ్యాతులు వీటిబోవ నరికిన్ వెన్నిచ్చి యిబ్బంగి నే
గుదురే రాజులు రాజమాత్రుడవె వైగుణ్యంబు వచ్చుంజుమీ !

బలిమిన్ మాధవ నేడు నిన్ను భువన ప్రఖ్యాతిగా బట్టుదున్
జలముల్ సొచ్చిన భూమిక్రింద జనినన్ శైలంబుపై నెక్కినన్
బలి దండన్ విలసించినన్ వికృతరూపంబుం బ్రవేశించినన్
జలధిం దాటిన నగ్రజన్మ హాలికాశ్వాటాకృతుల్ దాల్చినన్'

అని హేళనపూర్వకంగా అన్నాడు. అలా, అత డెంత ఉద్రేక పరచినా, శ్రీకృష్ణుడు ఆగలేదు. మందహాసంచేస్తూ, ఆయన, ముందుకు పోతూనే ఉన్నాడు. అది గ్రహించిన కాలయవనుడు, తిరిగి ఆయన్ని తరుముకుంటూ వెళ్ళాడు.

శ్రీకృష్ణుని తరుముకుంటూ వెళ్ళిన కాలయవనుడు, ఒకగుహలో ప్రవేశించటం జరిగింది. అక్కడ, అతనికి, గుఱ్ఱుకొడుతూ నిద్రపోతున్న ఒక మహాపురుషుడు కనిపించాడు. అతణ్ణిచూసి, నిద్రితుల నెవరూ సంహారించరన్న అభిప్రాయంతో, శ్రీకృష్ణుడే అలా నిద్రను నటిస్తూ ఉండిఉంటాడని యవనుడు భావించాడు. ఆ అభిప్రాయంతోనే, అతణ్ణి సమీపించి...

'ఎక్కడ నెవ్వారలకును
జిక్కవనుచు నారదుండు సెప్పెను నాకుం
జిక్కితి వెక్కడబోయెదు
నిక్కముగా నిద్రబుత్తు ని న్నిటకొండన్'

అని అట్టహాసం చేశాడు; అట్టహాసంచేస్తూనే, కాలెత్తి, ఆయన్ని ఒక్క తన్ను తన్నాడు.

81. . . . ముచుకుందుడు :

బహుకాలనిద్రితుడై ఉన్న ఆ మహాపురుషుడు, కాలయవనుని పాదప్రహారంవల్ల లేచాడు. లేచి, అమితమయినకోపంతో తన ప్రక్కనేఉన్న యవనుని వంక చురచురాచూశాడు. ఆయన చూపు వేడిమికి ఆ వెంటనే కాలయవనుడు భస్మమై పోయినాడు.

ఆవిధంగా, కాలయవనుని భస్మం చేసినవాడు, యవనాశ్వుని మనుమడూ, మాంధాత కుమారుడూఅయిన ముచుకుందుడు; ఇక్ష్వాకు వంశీయుడు. అత డెంతటి బలపరాక్రమ సంపన్నుడో అంత భక్తుడు.

ముచుకుందుడు, రాక్షసులకు భయపడిపోయిన దేవతలను కొంత కాలం కాపాడటం జరిగింది. ఆ సమయంలో, వారు అతణ్ణి సమీపించి, ఏదైనా ఒకవరం కోరుకోవలసిందన్నారు. వారికి సమాధానంగా, ముచుకుందుడు, తనకు మోక్షాన్ని ప్రసాదించవలసిందని కోరాడు.

దేవతల కెవరికీ మోక్షాన్ని ప్రసాదించే శక్తిలేదు. ఆ శక్తి శ్రీహరి ఒక్కనికే ఉంది. అదే వారు అతనికి తెలుపుకున్నారు.

అప్పటికి ముచుకుందుడు తనరాజ్యం వదలివచ్చి చాలాకాలమయింది. ఆ సమయంలో, అతని భార్యలూ, బంధువులూ, మిత్రులూ అందరూ కాలధర్మం చెందారు. ఆ విషయం దేవతల ద్వారా తెలుసుకున్న ముచుకుందుడు, ఆ వెంటనే వారికి నమస్కరించి, తనకు మంచి నిద్రకావాలని కోరాడు. అలాకోరి, దాన్ని, వారి నుంచి వరంగా పొంది, ఆ పర్వతగుహలో ప్రవేశించి పడుకున్నాడు. దేవదత్తమయిన ఆ నిద్రను భంగపరచటంవల్లనే, కాలయవనుడు అతని కోపాగ్నికి ఆహుతి కావటం జరిగింది.

కాలయవనుడలా నీరైన తరువాత, శ్రీకృష్ణుడు అతనికి తన నిజరూపంలో ప్రత్యక్షమయినాడు. అనుకోకుండా అలా దర్శనమిచ్చిన శ్రీకృష్ణుని ఉద్దేశించి...

'శశివో యింద్రుడవో విభావసుడవో చండ ప్రభారాశివో
శశి చూడామణివో పితామహుడవో చక్రాంకహస్తుండవో
దిశలున్ భూమియు మిన్ను నిండె నిదె నీ తేజంబు సూడంగ దు
ర్వశమై యెవ్వడ వేల వచ్చి తిచటన్ వర్తించె దేకాకివై'

అని, ముచుకుందుడు అమితాశ్చర్యంతో ప్రశ్నించాడు. అతనికి సమాధానంగా, శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు.

"రాజా! నా గుణాలనుగాని, జన్మ కర్మ నామాలనుగాని గణించేశక్తి నాకే లేదు. నేను. రాక్షసులనునిర్జించేనిమిత్తం, ధర్మాన్ని ప్రతిష్టించే ఉద్దేశంతో, బ్రహ్మదేవుని ప్రార్థనమీద, వసుదేవనందనుడనై పుట్టాను. కంసుడనే పేరుతోఉన్న కాలనేమినీ, ప్రలంబాది రాక్షసులనూ పరిమార్చాను.

పూర్వం, నువ్వు నన్ను సేవించటం కారణంగా, నిన్ననుగ్రహించే ఉద్దేశంతో ఇలా వచ్చాను. నా భక్తులయినవారు, నన్ను దర్శించిన తరువాత, దుఃఖితులుకావటమనేది ఉండదు. ఇక నీకే వరమిష్టమో అది కోరుకోవలసింది."

ఆ విధంగా తనపట్ల ప్రసన్నుడయిన శ్రీకృష్ణుని, ముచుకుందుడిలా ప్రార్థించాడు.

"జగదీశ్వరా! నీ మాయకు మోహమందని ప్రాణి అంటూ లేదు. ఈ ప్రపంచంలోఉండే స్త్రీ పురుషులందరూ నీ మాయకు వశులుకావటంవల్లనే, గృహారామవిత్తాదులపట్ల ఆసక్తిచూపుతూ, పరమార్థస్వరూపుడవైన నిన్నుమాత్రం మరచిపోయి వ్యవహరించటం

జరుగుతూఉంటుంది. అది కారణంగానే, వారికి, సర్వవిధదుఃఖాలూ సంభవిస్తూ ఉంటాయి.

సంసార చక్రంలో పరిభ్రమించేవారు, తమ పూర్వజన్మల పుణ్యాధిక్యంవల్ల, ఈ కర్మ భూమిలో మానవులై జన్మిస్తారు. అప్పుడు కూడా వారు కామవంచితులు కావటం, వెలుగులు జిమ్మే నీ పాదారవిందాలను త్యజించి, గృహాంధకూపంలో పడటం జరుగుతుంది. ఆ విధంగా, వివిధకామ భోగ విషయలాలసులైన వారిని నువ్వు కనిపెట్టి సంహరిస్తూ ఉంటావు.

కాంచనరథాల నధిరోహించి, మత్తమాతంగాల నారోహించి, 'నేను రారాజున'ని విఱ్ఱవీగుతూ, చతురంగ బలసమన్వితులై చరించేవారుకూడా, కాలక్రమాన, ఎందుకూ పనికిరానివారవుతారు. వారి దేహాలుకూడా క్రిమికీటకాదులకు ఆహార మవుతై. దానిని గ్రహించనంతవరకూ వారికి సంసారమోక్షం లభించదు.

మోక్షకాములయినవారికి, మున్ముందుగా, సాధుసమాగమం అలవడుతుంది. దాని ద్వారా, సర్వేశ్వరుడవైన నీపట్ల వారికి భక్తి సిద్ధిస్తుంది; అటువంటి నీ భక్తులకుమాత్రమే ముక్తి లభిస్తుంది.

భగవద్భక్తులయినవారు భగవత్పాద పరిచర్యను అభిలషిస్తారు. భగవత్పరిచర్యద్వారా లభించే ముక్తినే వారు వాంఛిస్తారు. అది వినా మరొక వరమేదీకూడా వారికి రుచించదు.

తండ్రీ! ఇంతకు పూర్వమే నాకు, నీ అనుగ్రహం మూలంగా, రాజ్యబంధ నిర్మూలనం కలిగింది. ఇక నాకు ప్రార్థనీయమైనది నీ సేవాభాగ్యం ఒక్కటే. దానినే నువ్వు నాకు అనుగ్రహించవలసింది."

ఆ విధంగా ప్రార్థించిన ముచుకుందుని చూసి, శ్రీకృష్ణుడు అమితానందం పొందాడు. అతడు కోరిన వరాన్ని ప్రసాదించాడు.

అలా శ్రీకృష్ణుని అనుగ్రహం పొందిన ముచుకుందుడు, ఆ వెంటనే, నరనారాయణస్థానమైన బదరికాశ్రమం చేరుకున్నాడు. అక్కడ శాంత చిత్తంతో హరి నారాధించసాగాడు.

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, తిరిగి నగరం చేరుకుని, అక్కడ విడిసిఉన్న కాలయవనుని సేన న్నింటినీ సంహరించి, వారి ధనరాసులను సంగ్రహించి, తన భృత్యులద్వారా ద్వారావతికి పంపాడు.

అంతలో, జరాసంధుడు, తిరిగి మథుర మీదికి రావటంజరిగింది. అది గ్రహించిన బలరామకృష్ణులు* ఆపదలో చిక్కుకున్న సామాన్య మానవుల మాదిరిగా, అక్కడినుంచి పారిపోసాగారు. అలా పోయిపోయి ప్రవర్షణాద్రిని చేరుకున్నారు. దానిమీదికిపోయి తలదాచుకున్నారు.

మగధేశ్వరుడైన జరాసంధుడు, తన సేనతో ఆ గిరిపైకి పోవటం దుర్ఘటమని తేల్చుకున్నాడు. అది కారణంగానే, అతడు, వారు అక్కడే హతులయే విధంగా, ఆ గిరిచుట్టూ మహాగ్నిని కల్పించాడు. ఆ మంటలనుంచి వారు బయటపడకుండా తగు కట్టుదిట్టం చేశాడు. కాని అతని కళ్ళు కప్పి, బలరామకృష్ణులు బ్రతికి బయట పడటం జరిగింది. అది గ్రహించరాని జరాసంధుడు మాత్రం, వారు హతులై ఉంటారనుకుని, విజయగర్వంతో తన నగరు చేరుకున్నాడు.

---

*83 విలోక్య వేగరభసం రిపుసైన్యస్య మాధవౌ
మనుష్య చేష్టా మాపన్నౌ (రాజన్) దుద్రువతు ర్ద్రుతం
విహాయ విత్తం ప్రచుర మభీతౌ భీరు భీతవత్
పద్భ్యాం పద్మపలాశాభ్యాం చేరతుర్బహుయోజనం.
ప్రద్రుత్యదూరం సంశ్రాంతౌ తుంగ మారుహతాం గిరిం
ప్రవర్షణాఖ్యం భగవాన్ నిత్యదా యత్ర వర్షతి.



82. రుక్మిణీ కృష్ణులు :

శ్రీకృష్ణుని ఆదేశానుసారం, విశ్వకర్మ నిర్మించిన ద్వారావతి, నగరాలలోకల్లా అద్భుతమైన నగరం. ఇంద్ర, వరుణ, కుబేర యమాదుల నగరాలేవీ కూడా దానికి ఈడు కావు. దాన్ని, విశ్వకర్మ, ఒకేఒక రాత్రిలో నిర్మించాడు.

ఆ ద్వారకాపట్టణం వెడల్పు వంద ఆమడలు. చుట్టుకొలత నాలుగువందల ఆమడలు.

ఆ నగర మధ్యంలో, పన్నెండామడల పరిమితిగల ఒక దుర్గం ఉంది. ఆ నగరానికి వెలుపల, తొమ్మిదామడల పరిమితిగల మరొక దుర్గం ఉంది. నగరిలో ఉండే దుర్గంలో, శ్రీకృష్ణుని అంతఃపుర కాంతలకు చెందిన తొమ్మిది లక్షల గృహాలున్నై. అక్కడే, లీలా సరోవరం ఉంది. పదహారువేల నూటఎనిమిది తీర్థాలున్నై. శ్రీకృష్ణుని అష్టమహిషులకు చెందిన సుందర మందిరాలు కూడా అక్కడే ఉన్నై. శ్రీకృష్ణుని ఆదేశంమీద శంఖునిధి, అష్టనిధులనూ ద్వారావతిలో దింపాడు. ద్వారకలో కృశవైభవులూ, సౌఖ్యహీనులూ, ఉండరాదన్న శ్రీకృష్ణుని అభిప్రాయమే దానికి కారణం.

అక్కడి తీర్థాలలో ప్రముఖమైనది జ్ఞాన తీర్థం. ఆ తీర్థం ప్రక్కనే పారిజాత వృక్షం ఉంది. జ్ఞానతీర్థంలో స్నానంచేసి, పారిజాతాన్ని స్పృశించినవారికి, భక్తి జ్ఞాన వైరాగ్యాలు లభించి తీరుతై. వారు శ్రీకృష్ణుని ప్రేమకు పాత్రు లవుతారు.

జ్ఞానతీర్థానికి సమీపంలోనే, శ్రీకృష్ణుని ఆనంద మందిరం ఉంది. దాన్ని చూసిన వారు, కృతార్థులూ జీవన్ముక్తులూ అవుతారు.

ఆ మందిరానికి, అనతిదూరంలో, కృష్ణ తేజోద్భవ అయిన కృష్ణకుండం ఉంది. అందులో స్నానం చేయటం వల్లనే, జాంబవతీ సుతుడైన సాంబుడు జీవన్ముక్తుడు కావటం జరిగింది. ఆ కృష్ణకుండానికి ప్రక్కనే, బలభద్ర సరోవరం ఉంది. అందులో స్నానం చేసినవారి పాతకాలన్నీ హరించిపోతై.

అటువంటి అనేక సరస్సులతోనూ, సుందర మందిరాలతోనూ, దివ్యోద్యానాలతోనూ విరాజిల్లే ఆ ద్వారకానగరం, భూలోక స్వర్గంగా ఉంటుంది. ఆ నగరాన్ని దర్శించటంకూడా అదృష్టమే. ఆ నగరంలో ప్రవేశించిన తరువాతనే, శ్రీకృష్ణుడు, సాక్షాత్తు లక్ష్మీదేవి అయిన రుక్మిణీ కన్యను వివాహం చేసుకోవటం జరిగింది.

విదర్భ దేశాధీశ్వరుడైన భీష్మకునికి, రుక్మి, రుక్మరథుడు, రుక్మబాహుడు, రుక్మకేశుడు, రుక్మనేత్రుడు అనే ఐదుగురు కుమారులూ, రుక్మిణి అనే ఒక కూతురూ ఉన్నారు. వారందరిలోకీ రుక్మిణి కడగొట్టు బిడ్డ.

ఆమె లక్ష్మీదేవి అంశతో జనించింది; మహా గుణవంతురాలనీ, సౌందర్యరాశి అనీ ప్రసిద్ధి పొందింది.

భీష్మకుని ఇంటికి ఎప్పుడూ అనేకమంది అతిథులు వస్తూ ఉండేవారు. వారు, రాజుల ప్రశంస వచ్చినప్పుడల్లా, యాదవ శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుని రూప బల గుణాదులను పేర్కొంటూ ఉండేవారు; వాటిని అభివర్ణిస్తూ ఉండేవారు. అది కారణంగా, రుక్మిణికి, బాల్యంలోనే, శ్రీకృష్ణునిమీద అదో విధమైన అభిమానం ఏర్పడ్డది. అది ఆమె వయసుతోపాటు అభివృద్ధి పొందటం, వివాహోచితమైన వయసు వచ్చే సమయానికి, ఆమె కాయనమీద ప్రేమ జనించటం, ఆయనకు భార్య కావాలని ఆమె నిర్ణయించుకోవటం జరిగినై.

రుక్మిణీదేవి సౌందర్యాన్ని గురించీ, సద్గుణాలను గురించి శ్రీకృష్ణుడు కూడా విన్నాడు. విని, ఆమె నెలాగైనా వివాహం చేసుకుతీరాలని నిర్ణయించుకున్నాడు.

అ దలా ఉండగా, భీష్మక నందనుడైన రుక్మి, తన చెల్లెలిని, చేది రాజైన శిశుపాలునకిచ్చి వివాహం చేయాలని నిశ్చయించుకోవటం జరిగింది. శ్రీకృష్ణునిమీద అతనికి కలిగిన అకారణ వైరమే ఆ విధ మైన అతని మౌఢ్యానికి మూలం.

తన అన్నదైన అభిప్రాయం రుక్మిణీదేవి గ్రహించింది. గ్రహించి, అమితంగా విచారపడ్డది. అది కారణంగానే, ఆమె, ఒకసారి, తనకు పరమాప్తుడైన ఒక బ్రాహ్మణునికి తన హృదయాన్ని విశదపరచు కుంది. దాన్ని, శ్రీకృష్ణునకు తన పక్షాన నివేదించుకోవలసిందిగా ప్రార్థించింది. ఆ వెంటనే, ఆయనకు, అనేకమైన కానికలు సమర్పించు కుని ఆయన్ని ద్వారావతికి పంపింది.

83. *శుభ సందేశం* :

అలా ద్వారావతి చేరుకున్న బ్రాహ్మణుని చూసి, శ్రీకృష్ణుడు*84 తన ఆసనంమీదినుంచి దిగాడు. గౌరవపూర్వకంగా ఆయన్ని సమీ పించాడు. స్వాగతం చెప్పాడు. పూజించాడు. సత్కరించాడు. ఆ తరువాత, భోజనానంతరం, ఆయన విశ్రాంతి తీసుకునే సమయంలో, ఆయన ప్రక్కగా కూర్చుని, స్వయంగా పాదాలు ఒత్తాడు. ఆ సమయంలోనే*85 కుశల ప్రశ్నల అనంతరం, 'మీరు ఎక్కడినుంచి ఏ పని

---

*84 దృష్ట్వా బ్రహ్మణ్యదేవ స్త మవరుహ్య నిజాసనాత్
ఉపవేశ్యార్హయాం చక్రే యథాఽఽత్మానం దివౌకసః.
తం భుక్తవంతం విశ్రాన్త ముపగమ్య సతాంగతిః
పాణి నాభిమృశన్ పాదా వవ్య గ్ర స్త మపృచ్ఛత.

*85 యత స్త్వ మాగతోదుర్గం ని స్తీర్యేహ యదిచ్ఛయా
సర్వం నో బ్రూహ్య గుహ్యంచేత్ కిం కార్యం కరవామ తే.

మీద ఇలా దయచేశారో, అభ్యంతరం లేనిపక్షంలో, సెలవివ్వవలసింది. మేము మీ ఆశయ సిద్ధికి చేయగల దేమైనా ఉన్నట్టయితే ఆజ్ఞాపించ వలసింది' అని వినయపూర్వకంగా అన్నాడు.

శ్రీకృష్ణుడొసగిన ఆతిథ్యానికి అమితంగా సంతుష్టి చెందిన ఆ విప్రుడు, ఆయనకు సమాధానంగా ఇలా అన్నాడు.

"కృష్ణా ! నేను విదర్భవాసిని. నన్ను సునందుడంటారు. అచ్చటి మా రాజపుత్రి అయిన రుక్మిణీదేవి వద్దనుంచి, వివాహ సంబంధమైన ఒక శుభ సందేశాన్ని నీకు తీసుకువచ్చాను. ఆమె, నీ చరణాబ్జాలనే ఆశ్రయించి, నీ సన్నిధి నాకాంక్షిస్తూ, తన హృదయాన్ని నీకు నివే దించుకోవలసిందిగా నన్ను కోరింది. ఆమె పలుకులనే నేను నీకు విన్న వించుకుంటున్నాను; అవధరించవలసింది.

"ఏ నీ గుణములు కర్ణేంద్రియంబులుసోక
　　దేహతాపంబులు దీఱిపోవు
నే నీ శుభాకార మీక్షింప గన్నుల
　　కఖిలార్థలాభంబు గలుగుచుండు
నే నీ చరణసేవ నేప్రొద్దు చేసిన
　　భువనోన్నతత్వంబు బొందగలుగు
నే నీ లసన్నామ మేప్రొద్దు భక్తితో
　　దడవిన బంధసంతతులు వాయు
నట్టి నీయందు నా చిత్త మనవరతము
నచ్చియున్నది నీయాన నాన లేదు
కరుణ జూడుము కంసారి ఖల విదారి
శ్రీయుతాకార మానినీ చిత్తచోర !

కృష్ణా ! నువ్వు అతిలోకసుందరుడవు. కుల రూప శీల విద్యా వయోతేజ స్సంపన్నుడవైన నిన్ను, శ్రీదేవి, తనకు తానై వరించింది.

అదే, నీ త్రిజగన్మోహనత్వానికి నిదర్శనం; నన్ను నీ చరణదాసిగా చేయటానికి మూలం.

శ్రీయుతమూర్తి యో పురుషసింహమ సింహముపాలిసొమ్ము గో
మాయువు కోరుచందమున మత్తుడు చైద్యుడు నీ పదాంబుజ
ధ్యాయినియైన నన్ను వడిదా గొనిపోయెదనంచు నున్నవా
డా యధమాధముండెఱుగ డద్భుతమైన భవత్ప్రతాపమున్.

వ్రతముల్ దేవ గురు ద్విజన్మ బుధసేవల్ దాన ధర్మాదులున్
గత జన్మంబుల నీశ్వరున్ హరి జగత్కల్యాణు గాంక్షించి చే
సితి నేనిన్ వసుదేవ నందనుడు నా చిత్తేశుడౌగాక ని
ర్జితులై పోదురుగాక సంగరములో జైదీశముఖ్యాధముల్.

అంకిలి చెప్పలేదు చతురంగ బలంబులతోడ నెల్లి యో
పంకజనాభ నీవు శిశుపాల జరాసుతులన్ జయించి నా
వంకకువచ్చి రాక్షస వివాహమునన్ భవదీయ శౌర్యమే
యుంకువసేసి కృష్ణ పురుషోత్తమ చేకొనిపొమ్ము వచ్చెదన్.

అంతఃపురంలో ఉండే నన్ను, నా బంధువులకు చేటు వాటిల్లకుండా నిన్ను చేర్చుకునే ఉపాయంకూడా నివేదించుకుంటున్నాను. రేపు వివాహమనగా, ఈ రోజున, నవవధువు, కులదేవతఅయిన సర్వమంగళను కొలవటమనేది మా ఆచారం ఆ కులదేవతా యాత్రార్థం నన్ను మావారు నగరిబయటకు తీసుకువెడతారు. ఆ సమయంలో నువ్వు నన్ను గ్రహించవచ్చు.

ఘను లాత్మీయ తమోనివృత్తికొఱకై గౌరీశు మర్యాద నె
వ్వని పాదాంబుజ తోయమందు మునుగన్ వాంఛింతు రేనట్టి నీ
యనుకంపన్ విలసింపనేని వ్రతచర్యన్ నూరు జన్మంబులన్
నిను జింతించుచు బ్రాణముల్ విడిచెదన్ నిక్కంబు ప్రాణేశ్వరా !"

రుక్మిణీదేవిపైన ఆ పలుకులువిని శ్రీకృష్ణుడు అమితానందం పొందాడు. ఆ సమయంలో ఆ విప్రుడు ఆయన్ని ఉద్దేశించి...

'ఆ యెలనాగ నీకుదగు నంగనకున్ దగు దీవు మా యుపా
ధ్యాయుల యాన పెండ్లియగు దప్పదు జాడ్యములేల నీవు నీ
తోయము వారి గూడుకొని తోయరుహానన దెత్తుగాని వి
చ్చేయుము శత్రులన్ నుఱుము సేయుము సేయుము శోభనం బిలన్'

అని ప్రోత్సహించాడు.

ఆ పలుకులు విన్న శ్రీకృష్ణుడు కడుపుబ్బ నవ్వాడు.*86ఆ సందేశ హారి అయిన బ్రాహ్మణుని చేతిని తన చేతిలోకి తీసుకుని ఇలా అన్నాడు.*87

'కన్నియమీద నా తలపు గాఢము కూరుకురాదు రేయి నా
కెన్నడు నా వివాహము సహింపక రుక్మి తలంచు కీడు నే
మున్నె యెఱుంగుదున్ బరుల మూక వధించి కుమారి దెత్తు వి
ద్వన్నుత మాను దచ్చి నవవహ్నిశిఖన్ వడిదెచ్చు కైవడిన్'

ఆ విధంగా తన హృదయాన్ని ఆయనకు విశదపరచుకుని, ఆ వెంటనే, ఆయననూ, అన్నగారైన బలరామునీ, మరి కొందరు యాదవ ప్రముఖులనూ తీసుకుని, శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, బలాహక అనే దివ్యాశ్వాలు పూన్చిన రథమెక్కి, ఒకేఒక రాత్రిలో విదర్భరాజధానీ నగరమైన కుండినపురం చేరుకున్నాడు.

---

*86 వైదర్భ్యాః స తు సందేశం నిశామ్య యదునందనః
ప్రగృహ్య పాణినా పాణిం ప్రహసన్నిద మబ్రవీత్.

*87 తథాహమపి తచ్చిత్తో నిద్రాం చ న లభే నిశి
వేదాహం రుక్మిణా ద్వేషా న్మమోద్వాహో నివారితః
తామానయిష్య ఉన్మథ్య రాజన్యాపసదాన్మృధే
మత్పరా మనవద్యాంగీ మేధసోఽగ్నిశిఖామివ.

## 84. స్వాయంవర సన్నాహాలు :

కుండిన నగరంలో, రుక్మిణీ కల్యాణానికి సంబంధించిన సర్వ సన్నాహాలూ అప్పటికే పూర్తి అయినై. ముహూర్తం కూడా సమీపించబోతూ ఉంది. భీష్మకుడు, పితృదేవతల నర్చించాడు. విప్రసమారాధన జరిపాడు. వివాహోచితంగా రుక్మిణీదేవి నలంకరింప జేశాడు.

అక్కడ, చేది రాజ్యంలో, రాజైన దమఘోషుడు కూడా, తన కుమారుని అభ్యుదయం కోరి, హోమం చేయించాడు. దాన ధర్మాలాచరించాడు. ఆ తరువాత రథ గజ హయాదులతోనూ, చతురంగ బలాలతోనూ బంధు మిత్రులతోనూ కుండినపురం చేరుకున్నాడు.

శిశుపాలుని మిత్రులైన అనేకమంది రాజులు కూడా వివాహ సందర్శనాపేక్షతో అతణ్ణి అనుసరించారు. ఆ వివాహానికి విఘ్నం కలిగించే ఉద్దేశంతో, బలరామ కృష్ణులు అక్కడికి వచ్చిన పక్షంలో వారిని యెదిరించటానికీ, తరిమివేయటానికీ నిర్ణయించుకుని, వారితో విరోధం పాటించే జరాసంధ దంతవక్త్ర సాల్వ విదూరథ పౌండ్రకాదులుకూడా, శిశుపాలుని పక్షాన, తమతమ సేనలతో తరలి వెళ్ళారు. కుండిననగరమంతటా, ఆ సమయంలో, ఇసుక వేస్తే రాలకుండాఉంది.

అదంతా ఎప్పటికప్పుడు గ్రహిస్తూఉన్న రుక్మిణీదేవి, అంత వరకూ, శ్రీకృష్ణునికి సంబంధించినవార్త ఏదీ తనకు చేరకపోవటం వల్ల, అమితంగా కలవరపడ్డది. అది కారణంగానే...

'లగ్నం బెల్లి వివాహముం గదిసె నేలా రాడు గోవిందుఁడు
ద్విగ్నంబయ్యెడి మానసంబు వినెనో వృత్తాంతమున్ బ్రాహ్మణుం
డగ్నిద్యోతను డేటికిం దడసె నా యత్నంబు సిద్ధించునో
భగ్నంబై చనునో విరించి కృత మెబ్భంగిం బ్రవర్తించునో !
ఘనుఁ డా భూసురు డేగెనో నడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో
విని కృష్ణుం డిది తప్పుగా దలచెనో విచ్చేసెనో యీశ్వరుం

డనుకూలింప దలంచునో తలపడో యార్యామహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో యెఱుగదో నాభాగ్య మెట్లున్నదో !'

అని, తనలో తాను వితర్కించుకోసాగింది.

అంతలోనే సునందుడు అమితానందంతో ఆమెను సమీపించాడు. సమీపిస్తూనే ఆమె నుద్దేశించి...

'మెచ్చె భవద్గుణోన్నతి కమేయ ధనావళు లిచ్చెనాకు దా
వచ్చె సుదర్శనాయుధుడు వాడె సురాసురు లెల్ల నడ్డమై
వచ్చిననైన రాక్షస వివాహమునం గొనిపోవు నిన్ను నీ
సచ్చరితంబు భాగ్యమును సర్వము నేడు ఫలించె గన్యకా !'

అని తెలియపరచాడు.

ఆ బ్రాహ్మణుని పలుకులు రుక్మిణీదేవికి అమృతప్రాయ మైన విగా తోచినై. ఆమె మనసు కుదుట బడ్డది. అందుకనే ఆమె, తనకు అంతటి ఉపకృతిచేసిన ఆ మహానుభావుని ఉద్దేశించి...

'జలజాతేక్షణు దోడితెచ్చితివి నా సందేశముం జెప్పి నన్
నిలువం బెట్టితి నీకృపన్ బ్రతికితిన్ నీయంత పుణ్యాత్ముకుల్
గలరే దీనికి నీకు బ్రత్యుపకృతిం గావింప నేనేర నం
జలి గావించెద భూసురాన్వయమణీ సద్బంధుచింతామణీ !'

అని హృదయపూర్వకంగా ఆయనకు నమస్కరించింది. తన కృతజ్ఞతను తెలుపుకుంది.

బలరామకృష్ణులు, తన కుమార్తె వివాహం చూసే నిమిత్తం రావటం గ్రహించి, భీష్మకుడు, మంగళవాద్యాలతో వారికి ఎదురు వెళ్ళాడు. విధ్యుక్తంగా వారిని పూజించాడు. ఉచితమైన కానిక లిచ్చి, వారినీ వారితో వచ్చినవారినీ శ్రీమంతమైన ఒక విడిదిలో చేర్చాడు.

అలా మహారాజువల్ల పూజింపబడి, విడిదలచేరిన శ్రీకృష్ణుని చూసి, విదర్భపురవాసులందరూ అమితానందం పొందారు. అంతే కాదు.

'తగు నీ చక్రి విదర్భరాజ సుతకుం దథ్యంబు వైదర్భియుం
దగు నీ చక్రికి నింతమంచిదగునే దాంపత్య మీ యిద్దఱం
దగులం గట్టిన బ్రహ్మ నేర్పరిగదా దర్పాహతారాతియై
మగఁడౌ గావుత జక్రి యీ రమణికిన్ మా పుణ్యమూలంబునన్'

అని, తమలో తాము అనుకోసాగారు.

85. *గౌరీ పూజ :*

అంతలో సుముహూర్తం సమీపించింది. ఆ సమయాన...

సన్నద్ధులై బహుశస్త్ర సమేతులై
బలసి చుట్టును వీరభటులు కొలువ
ముందఱ నుపహారములు కానుకలు గొంచు
వర్గంబులై వారవనిత లేగ
బుష్ప గంధాంబర భూషణ కలితలై
పాడుచు భూసురభార్య లరుగ
బణవ మర్దళశంఖ పటహకాహళ వేణు
భేరీధ్వనుల మిన్ను పిక్కటిలగ
దగిలి సఖులుగొలువ దల్లులు బాంధవ
సతులు దోడరాగ సవినయముగ
నగరు వెడలి నడచె నగజాతకును మ్రొక్క
బాల చికురపిహితఫాల యగుచు.

అలా వెళ్ళి, రుక్మిణీదేవి ఆలయం చేరుకుంది. అక్కడ ఉన్న ఆది దంపతులకు ధూపదీపాలూ నానా విధోపహారాలూ సమర్పించు కుంది. ఆపైన, గౌరీదేవిని ఉద్దేశించి...

'నమ్మితి నా మనంబున సనాతనులైన యుమా మహేశులన్
మిమ్ము బురాణ దంపతుల మేలు భజింతుగదమ్మ మేటి పె
ద్దమ్మ దయాంబురాశివిగదమ్మ హరిం బతి జేయుమమ్మ నిన్
నమ్మినవారి కెన్నడును నాశములేదుగదమ్మ యీశ్వరీ !'

అని ప్రార్థించింది. అక్కడ ఉన్న ముత్తైదువులందరకూ నానావిధ ఫలాలనూ అర్పించుకుంది. వారి దీవన అందుకుంది. శ్రీకృష్ణుని మనసులో నిలుపుకుని, రాయంచ మాదిరి ఆలయంనుంచి బయటకు వచ్చింది.

ఆ విధంగా బయటకు వచ్చిన రుక్మిణీదేవికి, ద్వార సమీపంలో, గరుడకేతనాంచితమైఉన్న శ్రీకృష్ణుని దివ్యరథం కనిపించింది. దాన్ని చూసి, ఆమె, అమితానందంతోనూ, లజ్జతోనూ తలవంచుకుని, మెల్లమెల్లగా, అటుగా అడుగులు వేయసాగింది.

అంతలో, శ్రీకృష్ణుడు, తనకు నలువంకలా ఉన్న రాజుల నెవ్వరినీ లక్ష్యం చేయకుండా ముందుకువచ్చి*88 రుక్మిణీదేవి కరగ్రహణం చేసి, ఆమెను దగ్గరకు తీసుకున్నాడు. రథంలో ఎక్కించుకున్నాడు. విజయ శంఖాన్ని పూరించి, ద్వారావతి దిక్కుగా పయనం సాగించాడు.

## 86. *రుక్మిణీ హరణం :*

అది చూసిన జరాసంధాదులకు అమితమైన ఆగ్రహం కలిగింది. వారు శ్రీకృష్ణుని పరాక్రమాన్ని సహించలేకపోయినారు. అందుకనే, రోషపూరిత హృదయాలతో...

---

*88 తాం రాజకన్యాం రథ మారురుక్షతీం జహార కృష్ణో ద్విషతాం సమీక్షతాం
రథం సమారోప్య సుపర్ణలక్షణం రాజన్యచక్రం పరిభూయ మాధవః.

తతో యయౌ రామ పురోగమైః శనైః
సృగాల మధ్యాదివ భాగ హృద్ధరిః.

'ఘన సింహంబుల కీర్తి నీచ మృగముల్ గైకొన్న చందంబునన్
మనకీర్తుల్ గొని బాల దోడ్కొనుచు సున్మాదంబుతో గోపకుల్
సనుచున్నా రదె శౌర్య మెన్నటికి మీ శస్త్రాస్త్రముల్ గాల్పనే
తనుమధ్యన్ విడిపింపమేని నగరే ధాత్రీజనుల్ క్రంతలన్'

అని ఒకరికొకరు తెలుపుకున్నారు. ఆవెంటనే తమతమ అస్త్రాలు తీసుకుని, సైన్యాలను తరలించుకుని, యాదవవీరులను తరుముకుంటూ వెళ్ళారు; వెడుతూనే వారిమీద బాణవర్షం కురిపించసాగారు.

అదిచూసిన రుక్మిణీదేవి అమితంగా లజ్జించింది. తను కారణంగా, యాదవవీరులు బాధలపాలు కావటం ఆమె సహించలేక పోయింది. కాని, చేయగలదేమీలేక, శ్రీకృష్ణునివంక బిత్తరిచూపులు చూడసాగింది. అది గ్రహించిన శ్రీకృష్ణుడు...

'చొచ్చెద రదె యదువీరులు
వచ్చెద రరిసేన లెల్ల వైరులు పెలుచన్
నొచ్చెదరును విచ్చెదరును
జచ్చెదరును నేడు జూడు జలజాతాక్షీ !'

అని ఆమెను ఊరడించాడు; ఉత్సాహపరచాడు.

ఆవెంటనే, గద బలభద్రాదులయిన యదుశూరులు, నిలబడి, జరాసంధాదులతో తలపడ్డారు. వారిమీద, శరవర్షం కురిపించారు. వారి రథాలను కూల్చారు. మత్తగజాలను సంహరించారు. అశ్వాలను వధించారు. సైనికులను చంపేశారు. ఆవిధంగా తమ విక్రమాన్ని ప్రదర్శిస్తూఉన్న కృష్ణానుచరుల సముఖాన నిలువలేక, శిశుపాలుని సహచరు లందరూ చెల్లాచెద రైనారు.

అదంతా చూసిన శిశుపాలుడు, భార్యను కోల్పోయినవాని మాదిరి, అమితంగా విచారపడసాగాడు. అదిగ్రహించిన జరాసంధుడు, అతణ్ణి సమీపించి, ఊరడించే ఉద్దేశంతో ఇలా అన్నాడు.

"దేహధారు లెప్పుడూకూడా స్వతంత్రులు కానేకారు. వారు పరమేశ్వరునికి అధీనులు. ఆ పరమేశ్వరుడు, వారిని, తన ఇచ్ఛవచ్చినట్టు ఆడిస్తూఉంటాడు. సుఖం కలిగించి పొంగజేస్తాడు; దుఃఖం కల్పించి కృంగదీస్తాడు.

జయాపజయాలనేవి ఎప్పుడు ఎవరికి ఏవిధంగా లభించేదీ ఎవరూ చెప్పలేరు. నామటుకు నేను, ఈ కృష్ణుని చేతులో, పదిహేడు సార్లు పరాజయం పొందటం జరిగింది. అయినా, నేను నిరాశచెంద లేదు. తిరిగి ఇరవై మూడు అక్షౌహిణుల సేనతోవెళ్ళి అతడితో తలపడ్డాను; విజయం పొందాను. అదేవిధంగా, నువ్వుకూడా, కాలం కలసివచ్చినప్పుడు, తప్పకుండా అతణ్ణి జయిస్తావు. ఈరోజున అతడు నీకు కల్పించిన అవమానానికి తగిన ప్రతీకారం చేసితీరుతావు. దానికి ఇంతగా విచారపడటం సమంజసం కాదు. ఇంతకూ...

బ్రతుకవచ్చు నొడల బ్రాణంబు లుండిన
బ్రతుకు గలిగెనేని భార్య కలదు
బ్రతికితీవు భార్యపట్టు దయ్యె మెఱుంగు
వగవ వలదు చైద్య వలదు వలదు !"

### 87. రుక్మి పరాభవం :

ఆవిధంగా, శిశుపాలునకు కొద్ది ఊరట కలిగించి, జరాసంధా దులు వెళ్ళిపోయినారు. అదంతా గ్రహించిన రుక్మి, తన చెల్లెలిని కృష్ణుడు అపహరించుకుపోవటం సహించలేక, ఒక అక్షౌహిణిబలంతో యాదవులమీదికి ఉరికాడు. శ్రీకృష్ణుని రథాన్ని సమీపించాడు. ఆయనమీద తీవ్రమైన బాణాలనుకూడా వదిలాడు. ఆసమయంలోనే, ఆయన్ని ఉద్దేశించి....

'మా సరివాడవా మా పాప గొనిపోవ
నేపాటిగలవాడ వేది వంశ

మెందు జన్మించితి వెక్కడ బెరిగితి
వెయ్యది నడవడి యెవ్వ రెఱుగు
మానహీనుడ వీవు మర్యాదలును లేవు
మాయగ్రైకొనిగాని మలయ రావు
నిజరూపమున శత్రు నివహంబుపై బోవు
వసుధేశుడవుగావు వావి లేదు
కొంచ్చ్మె నిమ్ము నీవు గుణ రహితుండవు
విడువు విడువవేని విలయకాల
శిఖిశిఖాసమానశిత శిలీముఖముల
గర్వమెల్ల గొందు గలహమందు'

అని హుంకరించాడు.

రుక్మి పలుకులు విని, శ్రీకృష్ణుడు మందహాసం చేశాడు. ఆ వెంటనే ఆగి, కొన్ని తీవ్రబాణాలను వదలి, అతని కోదండాన్ని ఖండించాడు. రథాన్ని కూల్చాడు. అతణ్ణి గాయపరచాడు.

అప్పటికికూడా, రుక్మికి, శ్రీకృష్ణుని సామర్థ్యం అవగతం కాలేదు. అది కారణంగానే, అతడు ఖడ్గ కవచాలు ధరించి ఆయనతో తలపడ్డాడు. కాని, శ్రీకృష్ణుడు, వాటినికూడా చూర్ణం చేశాడు; అతని శిరాన్ని ఖండించే ఉద్దేశంతో కత్తినెత్తాడు.

రుక్మిణీదేవి ఆ పరిస్థితిని చూసింది. తన అన్న అయిన రుక్మికి సంభవించబోయే ఆపదను అర్థం చేసుకుంది. అమితంగా అడలిపోయింది. అందుకనే శ్రీకృష్ణుని పాదాలమీదపడి....

'నిన్ను నీశ్వరు దేవదేవుని నిర్ణయింపగ లేక యో
సన్నుతామర కీర్తిశోభిత సర్వలోకశరణ్య మా
యన్న యీతడు నేడు సేసె మహాపరాధము నీయెడన్
నన్ను మన్నన సేసి కావు మనాథనాథ దయానిధీ!'

అని వేడుకుంది. అంతేకాదు.

'కల్లలేదని విన్నవించుటకాదు వల్లభ యీతనిం
బ్రల్లదుం దెగజూచితేనియు భాగ్యవంతుల మైతి మే
మల్లుడయ్యె ముకుందు డీశ్వరు డంచు మోదితులైన మా
తల్లిదండ్రులు పుత్రశోకము దాల్చి చిక్కుదు రీశ్వరా!'

అనికూడా మృదుమధురంగా నివేదించుకుంది.

రుక్మిణీదేవి ప్రార్థన విన్న శ్రీకృష్ణుడు, రుక్మిని సంహరించే అభిప్రాయం వదలుకున్నాడు. ఆ వెంటనే అతణ్ణి సమీపించి,*[89]బంధించి, అతని తల గొరిగి, మీసలు కొంతవరకు తీసి విరూపిని చేశాడు.

## 88. *రుక్మిణీదేవి విచారం :*

భీష్మకనందనుడయిన రుక్మిని ఆవిధంగా చూసిన బలరాముసకు జాలివేసింది. అందుకనే ఆయన, అతనికి బంధవిముక్తి కలిగించాడు. ఆ వెంటనే శ్రీకృష్ణుని ఉద్దేశించి...

'తలమనక భీష్మనందను
తలయును మూతియును గొఱుగ దగవే బంధుం
దలయును మూతియు గొఱుగుట
తల దఱుగుటకంటె దుచ్ఛతరము మహాత్మా!

కొందఱు రిపులని కీడును
గొందఱు హితులనుచు మేలు గూర్పవు నిజ మీ
వందఱ యందును సముడవు
పొందగ నేలయ్యె విషమబుద్ధి ననంతా!'

అని మందలిస్తున్నట్టుగా పలికాడు. ఆ తరువాత, రుక్మిణీదేవి నుద్దేశించి ఇలా అన్నాడు

---

*89 చైలేన బధ్వా త మసాధుకారిణం
సశ్మశ్రుకేశం ప్రవపన్ వ్యరూపయత్...

"తోడం బుట్టినవాని భంగమునకున్ దుఃఖించి మా కృష్ణు నె
గ్గాడం జూడకుమమ్మ పూర్వభవకర్మాధీనమై ప్రాణులం
గీడున్ మేలును జెందు లే డొకడు శిక్షింపంగ రక్షింప నీ
తోడంబుట్టువు కర్మశేషపరిభూతుండయ్యె నే డియ్యెడన్.

అంతేకాదు. బంధువైనవాడు వధార్హమయిన దోషం చేసినా వధ్యుడు కాడు. అతణ్ణి వధించటంవల్ల పాపం సంభవిస్తుంది. ఎవరు చేసిన దోషానికి వారు బలి అయితీరుతారు. అందుకనే, దోషిని అతని దోషానికే వదలివేయటం ఉత్తమం. కాని, క్షత్రియ ధర్మం దానికి విరుద్ధంగా ఉంటుంది. క్షత్రియుడయినవాడు, దోషి అయిన సోదరు నయినా శిక్షించి తీరుతాడు.

శ్రీమదాంధులైనవారు, భూమినీ, ధనధాన్యాలనూ, స్త్రీలనూ, భోగాలనూ అభిమానాన్నీ నిమిత్తంగా చేసుకుని, ఇతరులను హింసిస్తూఉంటూరు. అటువంటివారిని దండించటం క్షత్రియులయిన వారి ధర్మం. మా కృష్ణుడుకూడా ఇప్పు డా ధర్మాన్నే పాలించు కున్నాడు. దానికి నువ్వు విచారపడటం సమంజసం కాదు.

అజ్ఞానజ మగు శోకము
విజ్ఞాన విలోకనమున విడువుము నీకుం
బ్రజ్ఞావతికిం దగునే
యజ్ఞానులభంగి వగవ నంభోజముఖీ !"

బలరాముని పలుకులు రుక్మిణీదేవి విచారాన్ని చాలవరకు తొలగించినై. కాని, రుక్మిమాత్రం, తనకు జరిగిన పరాభవానికి అమితంగా విచార పడుతూనే ఉన్నాడు. అది కారణంగా, అతడు, కృష్ణుని గెలిచిగాని కుండిననగరంలో ప్రవేశించనని ప్రతిజ్ఞచేసి, ఆ తరువాత, ఆ సమీపంలో ఉన్న భోజకట మనే పురంలో ఉండిపోవటం జరిగింది.

ఆవిధంగా రాజులందరినీ జయించి, ద్వారకానగరం చేరుకుని...

ధ్రువకీర్తిన్ హరి పెండ్లి యాడె నిజచేతో హారిణిన్ మాన వై
భవ గాంభీర్య విహారిణిన్ నిఖిల సంపత్కారిణిన్ సాధు బాం
ధవ సత్కారిణి బుణ్యచారిణి మహాదారిద్ర్య సంహారిణిన్
సువిభూషాంబరధారిణిన్ గుణవతీ చూడామణిన్ రుక్మిణిన్.

## 89. ప్రద్యుమ్నుడు :

ఆ రుక్మిణీ కృష్ణులకు, పూర్వం మహేశ్వరుని కంటిమంటవల్ల దగ్ధుడయిన మన్మథుడు ప్రద్యుమ్నుడుగా జన్మించాడు. అతని తరువాత, వారికి, చారుధేష్ణుడు, సుధేష్ణుడు, సుషేణుడు, చారుగుప్తుడు, చారువాహనుడు, చారువిందుడు. చారుభద్రుడు, చారుగర్భుడు, చారుడు అనే కుమారులూ, చారుమతి అనే కూతురూ జనించారు.

ప్రద్యుమ్నుడు. రూపురేఖావిలాసాలలోగాని, వీర్యప్రతాపాలలోగాని, ఏ విధంగానూ తండ్రికి తీసిపోయేవాడు కాడు. అతణ్ణి చూసినవా రందరూ అతడు శ్రీకృష్ణుడే అనుకునేవారు. ఒక్కొకప్పుడు, శ్రీకృష్ణుని అంతఃపురకాంతలుకూడా అలాగే పొరబడటం జరుగుతూఉండేది. శ్రీకృష్ణుని వైరివర్గానికిచెందినవారు, ప్రద్యుమ్నుడెదురైనప్పుడు, అతడే శ్రీకృష్ణుడనుకుని భయపడి తొలగిపోతూ ఉండేవారు. అతడు శంబరాసురుని అనాయాసంగా సంహరించాడని తెలిసినవారు, అతనితో విరోధించటం అపాయకరమని నిర్ణయించుకుని అతని చెలిమినే ఆశిస్తూ ఉండేవారు. కాలక్రమాన, మన్మథుని భార్య అయిన రతీదేవి, మాయావతి అనే పేరుతో ప్రద్యుమ్నుని ధర్మపత్ని అయింది.

శ్రీకృష్ణునకూ ప్రద్యుమ్నునకూ ఉన్న భేదమల్లా ఒకటే. కృష్ణునికి, మెడలో కౌస్తుభం హృదయాన శ్రీవత్సం ఉండేవి. ప్రద్యుమ్నునకు అవి మాత్రం ఉండేవికావు. అంతే.

## 90. సత్రాజితుడు-స్యమంతకం :

పూర్వం సత్రాజితుడనే ఒక రాజు ఉండేవాడు. ఆయన ఒకానొక సముద్రతీరాన నిలబడి పదహారు రోజులపాటు సూర్యుని ఆరాధించాడు. అది కారణంగా సూర్యు డాయనకు స్యమంతకమనే ఒక దివ్యమణిని ప్రసాదించాడు.

ఆ స్యమంతకం ఎవరిదగ్గర ఉంచే వారికి దినానికి ఎనిమిది భారాలు-మూడు మణుగుల ఐదు శేర్లు-బంగారం లభిస్తుంది. ఆ మణిని ఏరాజు పూజిస్తే ఆ రాజు రాజ్యంలో దుర్భిక్షంగాని, సర్పభీతిగాని, మానసిక శారీరక బాధలుగాని ఎక్కడా ఉండవు. దుష్టులు ఆ ప్రాంతంలో కలికానికికూడా కనిపించరు.

సత్రాజితు డొకసారి, ఆ మణిని ధరించి ద్వారావతికి వెళ్ళాడు. అతణ్ణి దూరంనుంచి చూసిన ప్రజలు, శ్రీకృష్ణ దర్శనార్థం సూర్యుడే దిగివచ్చా డనుకున్నారు. ఆ అభిప్రాయంతోనే వారు శ్రీకృష్ణుని సమీపించి...

'దివిజాధీశ్వరు లిచ్చయింతురుగదా దేవేశ నిన్ జూడ యా
దవ వంశంబున గూఢమూర్తివి జగత్రాణుండవై యుండగా
భవదీయాకృతి జూడ నే డిదె రుచి ప్రచ్ఛన్న దిగ్భాగుడై
రవియో నీరజగర్భుడో యొకడు సేరన్ వచ్చె మార్గంబునన్'

అని నివేదించుకున్నారు.

సర్వజ్ఞుడయిన శ్రీకృష్ణుడు, వారిమాటలువిని, మందహాసం చేశాడు. వారికి కనిపించినవాడు స్యమంతకమణీ సమేతుడయిన సత్రాజితుడనీ, సూర్యుడుకాడనీ వారికి తెలియపరచాడు.

ఒకసారి, శ్రీకృష్ణుడు, ఆమణిని యాదవ విభుడయిన ఉగ్రసేనున కీయవలసిందిగా సత్రాజితుని కోరటం జరిగింది. కాని. అర్థలోభంవల్ల, సత్రాజితుడు ఆయన కోరికను నిరాకరించాడు.

సత్రాజితునకు ప్రసేనుడనే ఒక సోదరు డున్నాడు. అత డొక రోజున ఆమణిని ధరించి, మృగయావినోదార్థం అడవికి వెళ్ళాడు. అలా వెళ్ళిన ప్రసేనునీ అతని అశ్వాన్నీ కూల్చి, ఒక సింహం, ఆ మణిని తీసుకుని పరుగెత్తసాగింది. జాంబవంతుడు అది చూశాడు. చూసి, సింహాన్ని వధించి, మణిని గ్రహించి, తన గుహ చేరు కున్నాడు; అక్కడ, దాన్ని, తన కుమారుడైన సుకుమారుని తొట్టెకు ఆటవస్తువుగా అమర్చాడు.

వనానికి వెళ్ళిన ప్రసేనుడు తిరిగి రాకపోవటంవల్ల, సత్రా జితుడు అమితంగా ఆవేదనపడ్డాడు. ఆ సమయంలో అతను, ఆమణిని కోరిన కృష్ణుడే. దానికోసం, ప్రసేనుని వధించి ఉండవచ్చునని కూడా అనుకోవటం జరిగింది. ఆ అభిప్రాయం ఆనోటా ఆనోటా శ్రీకృష్ణుని చేరింది. ఆ వృథాపవాదును తొలగించుకునే ఉద్దేశంతో, ఆ వెంటనే, ఆయన, కొందరు నగరవాసులను వెంటబెట్టుకుని ప్రసేనుని వెదుకుతూ అరణ్యంలో ప్రవేశించాడు.

ఆవిధంగా అరణ్యంలో ప్రవేశించిన కృష్ణునకు, మున్ముందుగా, సింహంచేత చంపబడ్డ ప్రసేనుని అశ్వం కనిపించింది. ఆ తరువాత, మరి కొంతదూరంలో, ప్రసేనుని శవం దొరికింది. ఆపైన, జాంబవంతునివల్ల సంహారింపబడ్డ మృగేంద్రం, ఆ జాంబవంతుడు ప్రవేశించిన గుహ గోచ రించినై.

## 90. *జాంబవంతుడు :*

శ్రీకృష్ణుడు అక్కడ ఆగాడు. ఆగి, ఆ గుహబయటనే ఉండవలసిందిగా తనవారిని ఆదేశించాడు. తనుమాత్రం, ఒంటరిగా ఆ గుహలో ప్రవేశించాడు.

అలా ప్రవేశించిన శ్రీకృష్ణుడు, అంధకారబంధురంగానూ, అతి భయంకరంగానూ ఉన్న ఆ గుహలోపలికి వెళ్ళాడు. వెళ్ళి, అక్కడ ఒక

ఊయెలకు ఆటవస్తువుమాదిరి అమర్చబడిఉన్న మణిని చూశాడు. చూసి*90దాన్ని ఎలాగైనా అపహరించుకుపోవాలని ఆ ఊయెలను సమీపించాడు. అక్కడే ఓ ప్రక్కగా నిలబడ్డాడు. జాంబవంతుని పరిచారిక ఒకర్తు అది చూసింది. చూసి, భయపడి ఒక్క కేక పెట్టింది. ఆ కేకవిని గుహాంతర్భాగంలోఉన్న జాంబవంతుడు పరుగుపరుగున అక్కడికివచ్చాడు. వచ్చి, ఆయన ఎవరో ఒక సామాన్యమానవుడై ఉంటాడన్న భావంతో ఆయనతో తలపడ్డాడు.

అప్పుడు, శ్రీకృష్ణునకూ జాంబవంతునకూమధ్య తీవ్రమైన పోరాటం జరిగింది. ఆ సమయంలో, వారు, ఒకరిమీదఒకరు పెద్దపెద్ద పాషాణాలనూ వృక్షాలనూ విసరివేసుకున్నారు. బాహాబాహీ పోట్లాడుకున్నారు. పిడుగుపాట్లవంటి పిడికిటి పోట్లతో పరస్పరం పీడించుకున్నారు. ఆ పోరు అలా ఇరవైయెనిమిదిరోజులపాటు సాగింది.

అప్పటికి, శ్రీకృష్ణుని ముష్టిప్రహారణలవల్ల జాంబవంతుని అంగ సంధిబంధాలన్నీ చెదరిపోయినై. అతని శరీరమంతా నుగ్గునుగ్గయి పోయింది. అతడు ప్రాణావశిష్టుడయినాడు. అప్పు డతనికి, తను అంతవరకూ పోట్లాడుతున్నది, సామాన్యమానవునితో కాదన్న జ్ఞానం కలిగింది. అది కారణంగానే అతను శ్రీకృష్ణుని ఉద్దేశించి...

'తండ్రీ! నువ్వు పురాణపురుషుడవు. జగదధీశ్వరుడవు; సర్గ స్థితి లయ కారణుడయిన ఈశ్వరుడవు. సర్వజీవరాసులకు ప్రాణానివీ ధైర్యానివీ, బలానివీకూడా నువ్వే.

బాణాగ్ని నెవ్వడు పఱపి పయోరాశి
నింకించి బంధించి యేపుమాపె
బరగ నెవ్వడు ప్రతాప ప్రభారాశిచే
దానవ గర్వాంధ తమస మడచె

---

*90 తత్ర దృష్ట్వా మణిశ్రేష్ఠం బాలక్రీడనకం కృతం
హర్తుం కృతమతి స్తస్మి న్నవత స్తేఽర్భ కాన్తి కే.

గంజాతములు ద్రెంచు కరిభంగి నెవ్వడు
దశకంఠు కంఠబృందముల ద్రుంచె
నా చంద్ర సూర్యమై యలరు లంకారాజ్య
మునకు నెవ్వడు విభీషణుని నిలిపె

నన్ను నేలిన లోకాధినాథు డెవ్వ
డంచితోదార కరుణారసాబ్ధి యెవ్వ
డాతడవు నీవకావె మహాత్మ నేమి
మాఱుపడి యెగ్గు సేసితి మఱవవలయు'

అని ఆయన్ని వినుతించాడు. వేడుకున్నాడు.

ఆవిధంగా, తనకు పరమభక్తుడయిన జాంబవంతుడు తన పశ్చాత్తాపాన్ని తెలుపుకోవటంవల్ల, శ్రీకృష్ణుడు అతనిపట్ల ప్రసన్నుడయినాడు. తన అభయ హస్తంతో అతని శరీరాన్ని నిమిరాడు; ఆ మీద అతణ్ణి ఉద్దేశించి...*91

'ఈమణి మాచే బడెనని
తామసు లొనరించు నింద దప్పెడు కొఱకై
నీ మందిర మగు బిలమున
కే మరుదెంచితిమి భల్లుకేశ్వర వింటే!'

అని ఆదరపూర్వకంగా తెలియపరచాడు.

శ్రీకృష్ణుని పలుకులు విని, జాంబవంతుడు అమితంగా సంతోషించాడు; అలా తనకు ఆనందాన్ని ప్రసాదించిన ఆయనకు, కృతజ్ఞతాసూచకంగా, ఆమణినీ, తన కుమార్తె అయిన జాంబవతినీ కానుకగా సమర్పించుకున్నాడు.

---

*91 మణిహేతో రిహ ప్రాప్తా వయ మృక్షపతే బిలం
మిథ్యాభిశాపం ప్రముజ న్నాత్మనో మణి నామునా.

బిలంలో ప్రవేశించిన శ్రీకృష్ణునికోసం, ఆయన వెంటవచ్చిన వారు, పన్నెండురోజులవరకూ బిలద్వారంవద్దనే వేచిఉన్నారు. అంత వరకూ ఆయన బయటకు రాకపోవటంవల్ల, ఆయన కక్కడ ఏదో అపాయం సంభవించి ఉంటుందని నిశ్చయించుకున్నారు. ఆతరువాత, అమిత విచారంతో, పురానికివెళ్ళి, దేవకీ వసుదేవాదులకూ రుక్మిణీ దేవికీ తమ అభిప్రాయాన్ని విన్నవించుకున్నారు.

ఆ వార్త చేరగానే, ద్వారకావాసులు, ఆబాలగోపాలం, అమితంగా దుఃఖించారు. ఆవెంటనే, వారు, ఆయన క్షేమంగా తిరిగి రావాలని కోరుతూ, మహామాయ అనీ, చంద్రభాగ అనీ పేర్కొనబడే దుర్గాదేవిని దీక్షతో పూజించసాగారు.

అలా, దీనంగా, తన్ను ఆశ్రయించిన ప్రజలపట్ల, దుర్గ ప్రసన్ను రాలయింది. అది కారణంగానే, ఆమె వారిని, ఉద్దేశించి, 'మీకు త్వర లోనే ఆనందం కలుగుతుంది. మాధవుడు స్యమంతకమణితోనూ మరొక బాలామణితోనూ మీకు దర్శన మీయబోతున్నాడు; అని పలి కింది. అదివిన్న ద్వారకావాసులు ఆనందతాండవం చేయసాగారు. అంతలో,*92 శ్రీకృష్ణుడు వారిఎదుట ప్రత్యక్షమయినాడు. అప్పుడు...

మృతుడైనవాడు పునరా
గతుడైన క్రియం దలంచి కన్యామణి సం
యుతుడై వచ్చిన హరి గని
వితతోత్సవ కౌతుకముల వెలసిరి పౌరుల్.

ఆ విధంగా నగర ప్రవేశం చేసిన శ్రీకృష్ణుడు, ఒకపెద్ద సభచేసి, ఆ సభకు సత్రాజితుని ఆహ్వానించి, స్యమంతకమణి తనకు లభించిన

*92 తేషాంతు దే వ్యుప స్థానాత్ ప్రత్యాదిష్టాశిషా స చ
ప్రాదు ర్బభూవ సిద్ధార్థః సదారో హర్షయన్ హరిః.

వృత్తాంతాన్ని అంతనూ అతనికి విశదపరచాడు; ఆ మణిని అతనికి అందజేశాడు.

## 91. ... సాత్రాజితి :

అలా, తన మణిని తిరిగి పొందిన సత్రాజితుడు, అంతకుముందు తను శ్రీకృష్ణునిగురించి పలికిన పలుకులకు అమితంగా పశ్చాత్తాప పడ్డాడు. అది కారణంగానే...

'పాపాత్ముల పాపములం
బాపంగానోపునట్టి పద్మాక్షునిపై
బాపము గలదని నొడివిన
పాపాత్ముని పాపమునకు బారముగలదే!

మితభాషిత్వము మాని యేల హరిపై మిథ్యాభియోగంబు చే
సితి బాపాత్ముడ నర్థలోభుడను దుశ్చిత్తుండ మత్తుండ దు
ర్మతి నీదేహము గాల్పనే దురిత మే మార్గంబునం బాయు నే
గతి గంసారి ప్రసన్నుడై మనుచు నన్ గారుణ్య భావంబునన్'

అని ఎంతగానో విచారపడ్డాడు. అంతేకాదు. తన మణిని తన కిచ్చినా, శ్రీకృష్ణుడు, తన దోషానికి తన్ను ఏనాటికైనా శిక్షించితీరుతాడన్న అభిప్రాయంతో కుమిలిపోసాగాడు. 'అనవసరంగా బలవద్విరోధం కల్పించుకున్నానే' అని బాధపడటం మొదలుపెట్టాడు. అంతలో అత నికి ఒక చక్కని అభిప్రాయం కలిగింది. ఆవెంటనే, అతను...

'మణిని గూతు నిచ్చి మాధవు పదములు
పట్టుకొంటినేని బ్రతుకు కలదు
సంతసించు నతడు సదుపాయ మగు నది
సత్య మితర వృత్తి జక్కబడదు'

అని నిర్ణయించుకున్నాడు. ఆ నిర్ణయం ప్రకారం, ఆ రత్నాన్నీ, కన్యారత్నమయిన తన కుమార్తైను సత్యభామనూ ఆయనకు సమర్పించుకున్నాడు. కాని, శ్రీకృష్ణుడు*93తన కామణితో అవసరంలేదనీ, సూర్యభక్తుడైన అతనివద్దనే అది ఉండటం సమంజసమనీ చెప్పి, ఆ మణిద్వారా అనుదినం లభించే సువర్ణంలో కొంత భాగాన్నిమాత్రం తీసుకోవటానికి అంగీకరించాడు. కన్యామణిని హృదయపూర్వకంగా స్వీకరించాడు. ఆ విధంగా...

తామరసాక్షు డచ్యుతు డుదారయశోనిధి పెండ్లియాడె నా
నా మనుజేంద్ర నందిత గుణస్థితి లక్షణ సత్యభామ ను
ద్దామ పతివ్రతాత్వ నయధర్మ విచక్షణతా దయా యశః
కామను సత్యభామను ముఖద్యుతి నిర్జిత సోమ నయ్యెడన్.

92. *శతధన్వుడు-అక్రూర కృతవర్మలు :*

సత్యభామను తన మిత్రుడైన శతధన్వునకిచ్చి వివాహం చేయాలని సత్రాజితుడు మొదట్లో అనుకున్నాడు. కాని, కారణాంతరాలవల్ల ఆమెను శ్రీకృష్ణునకీయటం జరిగింది. అది కారణంగా, శతధన్వుడు సత్రాజిత్తుమీద పగబట్టాడు; అతణ్ణి ఎలాగయినా సాధించి తీరాలనుకున్నాడు.

అది గ్రహించిన అక్రూర కృతవర్మలు, శ్రీకృష్ణుని అపనింద పాల్చేసిన సత్రాజిత్తును దండించటానికి అదే మంచి తరుణ మనుకున్నారు. ఆ వెంటనే వారు, శతధన్వుని సమీపించి, సత్రాజిత్తునుండి సత్యభామను కాకపోయినా స్యమంతకాన్నయినా పొందటం సమంజసమని అతనికి బోధించారు; అతణ్ణి ఉద్రేకపరచారు.

---

*93 భగవా నాహ న మణిం ప్రతీచ్ఛామో వయం నృప
తవా స్తాం దేవభక్త స్య వయం చ ఫల భాగినః.

అది కారణంగానే, శతధన్వుడు, ఒకసారి, అవకాశం చూసుకుని, గాఢ నిద్రాపరవశుడై ఉన్న సత్రాజితుని సంహరించి, స్యమంతకాన్ని అపహరించటం జరిగింది.

సత్రాజిత్తు సంహరింపబడిన సమయంలో, శ్రీకృష్ణుడు హస్తినాపురంలో ఉన్నాడు. ఆయన్ని కలుసుకుని, ఆ వార్త నందజేసి, శతధన్వునకు తగిన శాస్తి చేయించే ఉద్దేశంతో, సత్యభామ, ఆ వెంటనే అక్కడకు వెళ్లింది.

అలా తన్ను సమీపించిన సత్యభామలోని ఆవేదనను శ్రీకృష్ణుడు గ్రహించాడు. గ్రహించి*94 ఆమె చెప్పినదంతా సానుభూతితో విన్నాడు. మానవసహజమైన ఆచారాన్ననుసరించి, కన్నీరు పెట్టుకున్నాడు. 'ఈ దుఃఖసముద్రాన్ని ఎలా తరించగలం?' అంటూ ఎంతగానో వాపోయినాడు. అలా కొంతసేపు దుఃఖించి, సత్యభామకు ఊరట కలిగించే ఉద్దేశంతో సాంత్వనవచనా లెన్నో పలికాడు. 'శతధన్వుని వధించి, నీకు శాంతి చేకూర్చి తీరుతాను' అని ఆమె చేతిలో చేయివేశాడు. ఆ సమయంలో, బలరాముడు కూడా, 'నేను పరాయివాణ్ణి కాను' అన్నట్టుగా, తమ్ముడు వ్యవహరించినట్టుగానే తనూ వ్యవహరించాడు. శతధన్వుని సంహరించటానికి తనుకూడా శాయశక్తులా కృష్ణునకు సాయపడటానికి మాట యిచ్చాడు.

రామకృష్ణుల నిర్ణయం గ్రహించిన శతధన్వుడు, ఆ వెంటనే, యాదవ వీరుడైన కృతవర్మను కలుసుకుని, వారితో సంభవించబోయే పోరులో తనకు సాయపడవలసిందిగా కోరాడు. కాని, కృతవర్మ అందుకు అంగీకరించలేదు. అంగీకరించక పోవటమే కాదు;

---

*94 తదాకర్ణ్యేశ్వరౌ (రాజన్) అనుసృత్య నృలోకతాం
అహో నః పరమం కష్ట మిత్యస్రాక్షౌ విలేపతుః,

'అక్కట రామ కృష్ణులు మహాత్ములు వారల కెగ్గు సేయగా
నిక్కడ నెవ్వడోపు విను మేర్పడ కంసుడు బంధుయుక్తుడై
చిక్కడె మున్ను మాగధుడు సేనలతో బదియేడు తోయముల్
దిక్కుల బారడే మనకు దృష్టము వారల లావు వింతయే!'

అని, తనకు బలరామ కృష్ణుల శక్తిసామర్థ్యాలమీద ఉన్న విశ్వాసాన్ని కూడా చాటుకున్నాడు.

అతని పలుకులు విన్న శతధన్వుడు, అమితంగా నిరాశచెంది, ఆపైన, అక్రూరుని సందర్శించాడు. అతణ్ణికూడా, కృతవర్మను కోరి నట్టే కోరాడు. కాని, అక్కడకూడా అతనికి సహాయం లభించలేదు. అక్రూరుడు అతణ్ణి ఉద్దేశించి...

'ఎవ్వడు విశ్వంబు నెల్ల సలీలుడై
పుట్టించు రక్షించు బొలియజేయు
నెవ్వనిచేష్టల నెఱుగరు బ్రహ్మాదు
లెవ్వని మాయ మోహించు భువన
మేడేండ్ల పాపడై యేవిభు డొకచేత
గోరక్షణమునకై కొండ నెత్తె
నెవడు కూటస్థు డీశ్వరు డమ్బుత
కర్ము డనంతుండు కర్మసాక్షి
యట్టి ఘనునకు శౌరికి ననవరతము
మ్రొక్కెదము గాక విద్వేషమునకు నేము
వెఱతు మొల్లము నీవొండు వెంటబొమ్ము
చాలు బదివేలు వచ్చె నీ సఖ్యమునకు'

అని, తన హృదయాన్ని విశదపరచుకుంటూ, అతణ్ణి మందలించాడు.

అప్పుడు,చేయగలదేమీలేక, శతధన్వుడు, ఆ మణిని, అక్రూరునకు తెలుపకుండానే, అతని యింట్లో ఒకచోట దాచి ఉంచాడు. ఆ పైన స్వప్రాణ రక్షణార్థం మిథిలానగరం దిక్కుగా పారిపోసాగాడు.

అలా పారిపోతున్న శతధన్వుని, రామకృష్ణులు తరుముకుంటూ వెళ్లారు. వెళ్లి వెళ్లి, అతణ్ణి, ఆ నగర పరిసరాల్లో కలుసుకున్నారు. ఆ వెంటనే, శ్రీకృష్ణుడు, తన చక్రాయుధాన్ని అతనిమీద వదిలాడు. ఆ మరుక్షణంలోనే, అది అతని తలను నరికివేసింది.

ఆవిధంగా కూలిపోయిన శతధన్వునివద్ద, ఎంతగా వెదకినా, వారికి స్యమంతకం కనిపించలేదు. అది గ్రహించిన బలరాముడు, శతధన్వుడు, దాన్ని, తన మిత్రు లెవరివద్దనో దాచి ఉంటాడనీ, ద్వారావతికివెళ్ళి, వా రందరి నివాసాలూ వెదుకవలసిందనీ కృష్ణునకు సలహాఇచ్చాడు; తనుమాత్రం, మిథిలేశ్వరుడయిన జనకుని సందర్శించుకునే నిమిత్తం, నగరంలో ప్రవేశించాడు.

బలరాముడు తన నగరానికి అలా విచ్చేయటం, జనకునకు అమితానందం కలిగించింది. ఆవెంటనే, ఆయన అతనికి ఎదురువెళ్ళి, అర్ఘ్యపాద్యాదు లర్పించుకుని, కానిక లిచ్చి సత్కరించాడు. తన వద్ద కొంతకాలం ఉండవలసిందిగా అతణ్ణి అభ్యర్థించాడు.

జనకుని కోరికమీద బలరాముడు అక్కడ కొన్ని సంవత్సరాలు ఉన్నాడు. ఆ సమయంలోనే, దుర్యోధనుడు అక్కడికివెళ్ళి, ఆయన వద్ద గదాయుద్ధ కౌశలం గ్రహించటం జరిగింది.

శతధన్వుని మరణవార్త చేరగానే, ద్వారావతిలోఉన్న అతని మిత్రులందరూ అడలిపోయినారు. అంతలో, స్యమంతక మణికోసం, శతధన్వుని మిత్రుల నివాసాలను శ్రీకృష్ణుడు వెదుకదలచాడనికూడా వారు [illegible] జరిగింది. అది కారణంగా, శ్రీకృష్ణుని చేతులో తమ బ్రతు కేమౌతుందో అన్న భయం వారినందరినీ ఆవరించింది.

అదే సమయంలో, తనఇంట్లోఉన్న స్యమంతకం అక్రూరుని కంటపడ్డది. దాన్ని చూడగానే, అతడు కంపించిపోయినాడు. మణి తనవద్ద ఉన్నదని మాధవుడు గ్రహించిన పక్షంలో తన మర్యాద

అలా పారిపోతున్న శతధన్వుని, రామకృష్ణులు తరుముకుంటూ వెళ్లారు. వెళ్లి వెళ్లి, అతణ్ణి, ఆ నగర పరిసరాల్లో కలునుకున్నారు. ఆ వెంటనే, శ్రీకృష్ణుడు, తన చక్రాయుధాన్ని అతనిమీద వదిలాడు. ఆ మరుక్షణంలోనే, అది అతని తలను నరికివేసింది.

ఆవిధంగా కూలిపోయిన శతధన్వునివద్ద, ఎంతగా వెదకినా, వారికి స్యమంతకం కనిపించలేదు. అది గ్రహించిన బలరాముడు, శతధన్వుడు, దాన్ని, తన మిత్రు లెవరివద్దనో దాచి ఉంటాడనీ, ద్వారావతికివెళ్ళి, వా రందరి నివాసాలూ వెదుకవలసిందనీ కృష్ణునకు సలహాఇచ్చాడు; తనుమాత్రం, మిథిలేశ్వరుడయిన జనకుని సందర్శించుకునే నిమిత్తం, నగరంలో ప్రవేశించాడు.

బలరాముడు తన నగరానికి అలా విచ్చేయటం, జనకునకు అమితానందం కలిగించింది. ఆ వెంటనే, ఆయన అతనికి ఎదురువెళ్ళి, అర్ఘ్యపాద్యాదు లర్పించుకుని, కానిక లిచ్చి సత్కరించాడు. తన వద్ద కొంతకాలం ఉండవలసిందిగా అతణ్ణి అభ్యర్థించాడు.

జనకుని కోరికమీద బలరాముడు అక్కడ కొన్ని సంవత్సరాలు ఉన్నాడు. ఆ సమయంలోనే, దుర్యోధనుడు అక్కడికివెళ్ళి, ఆయన వద్ద గదాయుద్ధ కౌశలం గ్రహించటం జరిగింది.

శతధన్వుని మరణవార్త చేరగానే, ద్వారావతిలోఉన్న అతని మిత్రులందరూ అడలిపోయినారు. అంతలో, స్యమంతక మణికోసం, శతధన్వుని మిత్రుల నివాసాలను శ్రీకృష్ణుడు వెదుకదలచాడనికూడా వారు [illegible] జరిగింది. అది కారణంగా, శ్రీకృష్ణుని చేతులో తమ బ్రతు కేమౌతుందో అన్న భయం వారినందరినీ ఆవరించింది.

అదే సమయంలో, తనఇంట్లోఉన్న స్యమంతకం అక్రూరుని కంటపడ్డది. దాన్ని చూడగానే, అతడు కంపించిపోయినాడు. మణి తనవద్ద ఉన్నదని మాధవుడు గ్రహించిన పక్షంలో తన మర్యాద



నిలువదని అతడు భావించాడు. ఆ భయంతోనే అతడు కృతవర్మతో సహా అక్కడినుంచి పారిపోయినాడు.

తన భక్తుడైన అక్రూరుడు, ఆవిధంగా దేశాంతరగతుడు కావటం శ్రీకృష్ణునకు బాధ కలిగించింది. అందుకనే, ఆయన తిరిగి అతణ్ణి రప్పించి గౌరవ పురస్సరంగా అతనితో ఇలా అన్నాడు.

"అక్రూరా!*95 శతధన్వుడు, స్యమంతకాన్ని నీకు తెలియకుండా మీయింట్లోఉంచి వెళ్ళిన సంగతి మాకు తెలిసింది. అది కారణంగా, ఇక దాని విషయంలో నువ్వు యేవిధంగానూ భయపడవలసిన పనిలేదు."

ఇక ప్రకృతానికి వద్దాం. సత్రాజితునకు పుత్ర సంతానం లేదు. అతనికి పిండప్రదానం చేయవలసినవారూ, అతని ఋణాలను తీర్చవలసినవారూ ఇక అతని దౌహిత్రులేనన్న విషయం నీకూ తెలుసు. యథార్థానికి, ఆ పని చేసేవారికే, మృతులదైన ఆస్తి సంక్రమించటం ధర్మం. అయినప్పటికీ, ఆ స్యమంతకాన్ని మేము కోరటంలేదు. దాన్ని నీ వద్దనే ఉంచటానికి మేము నిశ్చయించుకున్నాము. కాని, మా అన్నగారైన బలరాముడు ఆ మణి విషయంలో నన్నే నమ్మలేకుండా ఉన్నాడు. అది కారణంగా, నువ్వు దయ ఉంచి, ఆ మణిని

---

*95 నను దానపతే న్యస్త స్త్వయ్యాస్తే శతధన్వనా
స్యమంతకో మణిః శ్రీమాన్ విదితః పూర్వమేవ నః.
సత్రాజితోఽనపత్యత్వాద్ గృహ్ణీయు ర్దుహితుః సుతాః
దాయం నినీయాపః పిండాన్ విముచ్యర్ణం చ శేషితం.
తథాపి దుర్ధర స్త్వన్యై స్త్వయ్యాస్తాం సువ్రతే మణిః
కింతు మా మగ్రజః సమ్యగ్ న ప్రత్యేతి మణిం ప్రతి.
దర్శయస్వ మహాభాగ బంధూనాం శాంతి మావహ
అవ్యుచ్ఛిన్నా మఖా స్తేఽద్య వర్తన్తే రుక్మవేదయః.

ఒక్కసారి మన వారికందరికీ చూపించవలసింది. మన బంధు వర్గానికి అంతటికీ మనశ్శాంతి కలిగించవలసింది. ఆ పైన, దాన్ని సువ్రతుడ వైన నీ వద్దనే ఉంచుకుని, నీవు ఇటీవల అనుదినం స్వర్ణ వేదికలమీద చేస్తూ ఉన్న యజ్ఞయాగాదికాలకు దాని ఫలితాన్ని వినియోగించవలసింది."

ఆ విధంగా పలికి, అక్రూరునివద్ద ఉన్న స్యమంతకాన్ని తన వారి కందరికీ చూపించి, శ్రీకృష్ణుడు మనశ్శాంతి పొందాడు. ఆ తరువాతనే, ఆ మణిప్రభావంవల్ల తనకు లభ్యమైన సిరి నంతనూ దానం చేసి, అక్రూరుడు 'దానపతి' అనిపించుకోవటం జరిగింది.

అనంతరం, శ్రీకృష్ణుడు,*96 మరణించిన తన మామగారికి పరలోకంలో మేలు చేకూరే నిమిత్తం, జరుపవలసిన కర్మలన్నింటినీ యథావిధిగా, బంధు మిత్రుల సమక్షాన జరిపించాడు.

## 93. *ఇంద్రప్రస్థంలో శ్రీకృష్ణుడు :*

ఆ తరువాత ఒకసారి, శ్రీకృష్ణుడు, సాత్యకి ప్రభృతులైన యాదవ ప్రముఖులతో సహా, పాండవులను చూసి వచ్చే నిమిత్తం ఇంద్రప్రస్థానికి వెళ్లటం జరిగింది. అలా వెళ్లిన యాదవ వీరులనూ, శ్రీకృష్ణునీ యుధిష్ఠిరాదులు విధ్యుక్తంగా పూజించారు. ఆలింగనం చేసుకున్నారు. తమ పూర్వ పాపాలనన్నింటినీ ఆయన స్పర్శద్వారా తొలగించుకున్నారు. మందహాసాన్ని వెదజల్లే ఆయన ముఖారవిందాన్ని దర్శిస్తూ మహదానందం పొందారు. ఆ సమయంలో శ్రీకృష్ణుడు కుంతీదేవిని కలుసుకుని....

'అత్తా కొడుకులు గోడలు
చిత్తానందముగ బనులు సేయగ నాత్మా

---

*96 తతః స కారయామాస క్రియా బంధోర్హతస్య వై
నాకం సుహృద్భి ర్భగవాన్ యా యాః స్యుః సాంపరాయికాః.

ఒక్కసారి మన వారికందరికీ చూపించవలసింది. మన బంధు వర్గానికి అంతటికీ మనశ్శాంతి కలిగించవలసింది. ఆ పైన, దాన్ని సుబ్రతుడవైన నీ వద్దనే ఉంచుకుని, నీవు ఇటీవల అనుదినం స్వర్ణ వేదికలమీద చేస్తూ ఉన్న యజ్ఞయాగాదికాలకు దాని ఫలితాన్ని వినియోగించవలసింది."

ఆ విధంగా పలికి, అక్రూరునివద్ద ఉన్న స్యమంతకాన్ని తన వారి కందరికీ చూపించి, శ్రీకృష్ణుడు మనశ్శాంతి పొందాడు. ఆ తరువాతనే, ఆ మణిప్రభావంవల్ల తనకు లభ్యమైన సిరి నంతనూ దానం చేసి, అక్రూరుడు 'దానపతి' అనిపించుకోవటం జరిగింది.

అనంతరం, శ్రీకృష్ణుడు,*96 మరణించిన తన మామగారికి పరలోకంలో మేలు చేకూరే నిమిత్తం, జరువవలసిన కర్మలన్నింటినీ యథావిధిగా, బంధు మిత్రుల సమక్షాన జరిపించాడు.

## 93. ఇంద్రప్రస్థంలో శ్రీకృష్ణుడు :

ఆ తరువాత ఒకసారి, శ్రీకృష్ణుడు, సాత్యకి ప్రభృతులైన యాదవ ప్రముఖులతో సహా, పాండవులను చూసి వచ్చే నిమిత్తం ఇంద్రప్రస్థానికి వెళ్లటం జరిగింది. అలా వెళ్లిన యాదవ వీరులనూ, శ్రీకృష్ణునీ యుధిష్ఠిరాదులు విధ్యుక్తంగా పూజించారు. ఆలింగనం చేసుకున్నారు. తమ పూర్వ పాపాలనన్నింటినీ ఆయన స్పర్శద్వారా తొలగించుకున్నారు. మందహాసాన్ని వెదజల్లే ఆయన ముఖారవిందాన్ని దర్శిస్తూ మహదానందం పొందారు. ఆ సమయంలో శ్రీకృష్ణుడు కుంతీదేవిని కలుసుకుని....

'అత్తా కొడుకులు గోడలు
చిత్తానందముగ బనులు సేయగ నాత్మా

*96 తతః స కారయామాస క్రియా బంధోర్హతస్య వై
నాకం సుహృద్భి ర్భగవాన్ యా యాః స్యుః సాంపరాయికాః.



యత్తానుగవై యాజ్ఞా
సత్తాదులు కలిగి మనుదె సమ్మోదమునన్'

అని ప్రేమపూర్వకంగా పలుకరించాడు.

శ్రీకృష్ణుడే తనకు తానై వచ్చి, తన్ను అలా పలుకరించినందుకు కుంతీదేవి ఎంతగానో సంతోషించింది. ఆనందాశ్రులు రాల్చింది. గద్గద భాషణలతో ఆయన కిలా విన్నవించుకుంది :

'కృష్ణా! నీదయవల్ల మే మందరం క్షేమంగానే ఉన్నాము. నువ్వు సర్వలోక సుహృదుడవు. నిన్నాశ్రయించిన వారి క్లేశాలను నిర్మూలించటంలో నీకు నువ్వేసాటి. యథార్థానికి, నాకూ నా పిల్లలకూ నువ్వే దిక్కు. మా అదృష్టంవల్లనే, నువ్వు, మమ్మల్ని మరచిపోకుండా. సర్వవేళలా మమ్మల్ని కాపాడుతూ, మా కష్టాలు తొలగిస్తూ ఉండటం జరుగుతోంది."

కుంతీదేవి, ఆవిధంగా తన హృదయాన్ని నివేదించుకున్న తరువాత, యుధిష్ఠిరుడు శ్రీకృష్ణుని ఉద్దేశించి....

'పట్టగలేరు నిన్ను దమ భావములందు సనందనాదు లే
పట్టుననైన నట్టి గుణ భద్ర చరిత్రుడ వీవు నేడు మా
చుట్టమవంచు వచ్చెదవు చూచెద వల్పులమైన మమ్ము నే
మెట్టి తపంబు సేసితి మధీశ్వర పూర్వశరీర వేళలన్'

అని ప్రస్తుతిపూర్వకంగా తన కృతజ్ఞతను తెలుపుకున్నాడు.

## 94. సూర్యపుత్రి; కాళింది :

ఆ తరువాత, ధర్మరాజాదుల అభ్యర్థనమీద, శ్రీకృష్ణుడు, ఇంద్రప్రస్థంలో కొన్ని నెల లున్నాడు. ఆ సమయంలో, ఒకసారి, ఆయన, అర్జునునితో, మృగయావినోదార్థం యమునాతీరంలో ఉన్న అరణ్యానికి వెళ్ళటం జరిగింది. అక్కడ వారు కొద్దిసేపు మృగాలను

వేటాడి, అనంతరం, బడలికను తొలగించుకునే నిమిత్తం, కాళిందిలో స్నానం చేయటానికి వెళ్లారు. అలా వెళ్ళిన కృష్ణార్జునులకు ఆ ప్రాంతంలో విహరిస్తున్న ఒక సుందరాంగి కనిపించింది. అప్పుడు, అర్జును డామెను సమీపించి...

"సుదతీ యెవ్వరిదాన వేమికొఱ కిచ్చోటం బ్రవర్తించె దె
య్యది నీ నామము గోర్కి యెట్టిది వివాహాకాంక్షతో గూడి యీ
నదికిన్ వచ్చిన జాడ గానబడె ధన్యంబయ్యె నీ రాక నీ
యుదయాది స్థితులెల్ల జెప్పు మబలా యుద్యత్కురంగేక్షణా"

అని పలుకరించాడు. ఆయనకు సమాధానంగా, ఆ కన్య...

"నరవీరోత్తమ యేను సూర్యుని సుతన్ నా పేరు కాళింది భా
స్కర సంకల్పిత గేహమందు నదిలో గంజాక్షు విష్ణున్ బ్రభున్
వరుగా గోరి తపంబు సేయుదు నొరున్ వాంఛింప గృష్ణుండు వ
న్యరతిన్ వచ్చి వరించు నంచు బలికెన్ నా తండ్రి నా తోడుతన్"

అని తన విషయమంతా తెలుపుకుంది.

ఆమె పలుకులు విన్న అర్జునుడు కృష్ణుని సమీపించి, ఆమె విషయం ఆయనకు విన్నవించుకున్నాడు. అది విన్న శ్రీకృష్ణుడు అమితానందంతో ఆమెను స్వీకరించాడు.

## 95. .... నాగ్నజితి :

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, తన మేనత్త అయిన రాజాధిదేవి కుమార్తెను, తనకై తపిస్తున్న కన్యను, మిత్రవిందను, ఆమె సోదరులైన విందానువిందుల అభీప్సితానికి భిన్నంగా, స్వయంవర మంటపం నుంచి అపహరించుకు వెళ్లాడు. అనంతరం, కోసల దేశాధిపతి అయిన నగ్నజిత్తు కుమార్తెను. 'సత్య' అని పిలువబడే కన్యను, నాగ్నజితిని వివాహం చేసుకోవటం జరిగింది.

వేటాడి, అనంతరం, బడలికను తొలగించుకునే నిమిత్తం, కాళిందిలో స్నానం చేయటానికి వెళ్లారు. అలా వెళ్ళిన కృష్ణార్జునులకు ఆ ప్రాంతంలో విహరిస్తున్న ఒక సుందరాంగి కనిపించింది. అప్పుడు, అర్జును డామెను సమీపించి...

"సుదతీ యెవ్వరిదాన వేమిటికొఱ కిచ్చోటం బ్రవర్తించె దె
య్యది నీ నామము గోర్కియెట్టిది వివాహోకాంక్షతో గూడి యీ
నదికిన్ వచ్చిన జాడ గానబడె ధన్యంబయ్యె నీ రాక నీ
యుదయాది స్థితులెల్ల జెప్పు మబలా యుద్యత్కురంగేక్షణా"

అని పలుకరించాడు. ఆయనకు సమాధానంగా, ఆ కన్య...

"నరవీరోత్తమ యేను సూర్యుని సుతన్ నా పేరు కాళింది భా
స్కర సంకల్పిత గేహమందు నదిలో గంజాతు విష్ణున్ బ్రభున్
వరుగా గోరి తపంబు నేయుదు నొరున్ వాంఛింప గృష్ణుండు వ
న్యరతిన్ వచ్చి వరించు నంచు బలికెన్ నా తండ్రి నా తోడుతన్"

అని తన విషయమంతా తెలుపుకుంది

ఆమె పలుకులు విన్న అర్జునుడు కృష్ణుని సమీపించి, ఆమె విషయం ఆయనకు విన్నవించుకున్నాడు. అది విన్న శ్రీకృష్ణుడు అమితానందంతో ఆమెను స్వీకరించాడు.

95. .... నాగ్నజితి :

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, తన మేనత్త అయిన రాజాధిదేవి కుమార్తెను, తనకై తపిస్తున్న కన్యను, మిత్రవిందను, ఆమె సోదరులైన విందానువిందుల అభీప్సితానికి భిన్నంగా, స్వయంవర మంటపం నుంచి అపహరించుకు వెళ్లాడు. అనంతరం, కోసల దేశాధిపతి అయిన నగ్నజిత్తు కుమార్తెను 'సత్య' అని పిలువబడే కన్యను, నాగ్నజితిని వివాహం చేసుకోవటం జరిగింది.



నగ్నజిత్తువద్ద ఏడు ఆబోతులుండేవి. అవి వీరుల వాసనను సహించేవి కావు. వాటిని దమింపగల వానికే తన కుమార్తె నిచ్చి వివాహం చేస్తానని నగ్నజిత్తు శపథం చేశాడు. శ్రీకృష్ణుడు*97 అది గ్రహించి, అక్కడికి వెళ్లి, ఆ ఏడు ఆబోతులనూ ఏకకాలంలో ఏడు రూపాలలో సమీపించి, అవలీలగా వాటిని నిగ్రహించాడు. వాటికి ముక్కుత్రాళ్లు పోశాడు. వాటి దర్పాన్ని హరించాడు. ఆ విధంగా వాటి శక్తిని అదుపులోకి తీసుకువచ్చి, బంధించి, పిల్లలు ఎడ్లరూపంలో ఉన్న కొయ్య బొమ్మలను ఈడ్చుకు పోయేటట్టుగా, వాటిని సభాస్థలానికి ఈడ్చుకు పోయినాడు. అది చూసిన నగ్నజిత్తు అమితంగా ఆనందించి, తను చేసిన శపథం ప్రకారం, తన కుమార్తెను ఆయన కిచ్చి వివాహం చేశాడు. ఆ విధంగా, నాగ్నజితి శ్రీకృష్ణునకు భార్య కావటం జరిగింది.

96. . . . మద్ర రాజపుత్రి; లక్షణ :

అనంతరం, శ్రీకృష్ణుడు, కేకయ రాజపుత్రి, తన మేనత్త, శ్రుతకీర్తి, కూతురూ అయిన భద్రను, ఆమె సోదరులు సంతర్దనాదుల ద్వారా గ్రహించాడు. మద్ర రాజపుత్రి లక్షణను కూడా వివాహం చేసుకున్నాడు.

శ్రీకృష్ణుని అస్త్రప్రయోగ పాటవానికి, లక్షణా కరగ్రహణం ప్రత్యక్ష నిదర్శనం. అస్త్రవిద్యా విశారదులందరిలోనూ ఆయనదే అగ్ర తాంబూల మనటానికి అదొక తార్కాణం.

---

*97 ఏవం సమయ మాకర్ణ్య బద్ధ్వా పరికరం ప్రభుః
ఆత్మానం సప్తధా కృత్వా న్యగృహ్ణా ల్లీలయైవ తాన్.
బద్ధ్వా తాన్ దామభిః శౌరి ర్భగ్నదర్పాన్ హతౌజసః
వ్యకర్ష ల్లీలయా బద్ధాన్ బాలో దారుమయాన్ యథా.

మద్ర దేశాధీశ్వరుడైన బృహత్సేనుని ఇంటికి దేవర్షి అయిన నారదుడు తరుచుగా వచ్చిపోతూ ఉండేవాడు. ఆయన వచ్చినప్పు డల్లా, అక్కడివారికి, శ్రీకృష్ణుని లీలా విలాసాలను అత్యుత్సాహంతో అభివర్ణిస్తూ ఉండేవాడు.

వాటిని విన్న లక్షణకు, శ్రీకృష్ణుని పట్ల అభిమానం దినదినాభి వృద్ధి పొందసాగింది. కాలక్రమాన, ఆమెకు ఆయనమీద ప్రేమ జనించింది. 'ఆయన్ని తప్ప అన్యుని వివాహం చేసుకోరాదు' అని ఆమె నిర్ణయించుకోవటం కూడా జరిగింది.

బృహత్సేనుడు అది గ్రహించాడు. ఆమెను, తన ప్రాణానికి ప్రాణంగా చూచుకునేవాడు కావటంవల్ల, ఆమె కోరికను తీర్చటానికి నిశ్చయించుకున్నాడు.

అది కారణంగానే, ద్రౌపదికి, అర్జునుని భర్తగా సంపాదించే నిమిత్తం, విదర్భదేశాధీశ్వరుడు మత్స్య యంత్రాన్ని కల్పించినట్టుగా, ఆయనకూడా అటువంటిదాన్నే మరొకదాన్ని సృష్టించాడు. కాని, ఆవిషయంలో, ఆయన మరొక అడుగు ముందుకు వెళ్లటం జరిగింది. ఆయన కల్పించిన యంత్రంలో, మత్స్యం కనిపించేదికాదు; దాని నీడ మాత్రమే నీటిలో ద్యోతమయేది.

అది గ్రహించిన అస్త్రవిద్యా విశారదులైన రాజు లెందరో తమతమ అధ్యాపకులతోసహా మద్ర దేశానికి వెళ్లారు. ఆ మత్స్యాన్ని పడగొట్టడానికి ఎంతగానో ప్రయత్నించారు. కాని, ఏ ఒక్కరికీకూడా అది సాధ్యం కాకపోయింది. జరాసంధ, శిశుపాల, భీమ, దుర్యోధన కర్ణాది వీరులు అక్కడ ఉంచిన వింటికి నారిని సంధించటంవరకు విజ యాన్ని సాధిస్తూవచ్చారు. కాని, మత్స్యం ఎక్కడ ఉన్నదీ తెలుసుకో లేక, ఆ వింటిని అక్కడే వదలి వెళ్ళిపోతూ వచ్చారు.

అంతలో అర్జునుడు ముందుకు వచ్చాడు. నీటిలో కనిపించే నీడనుచూసి, ఆ మత్స్యం ఉన్న స్థలాన్ని గ్రహించాడు. దాన్ని మనసులో ఉంచుకుని, వింటికి బాణాన్ని సంధించాడు. అతిజాగ్రత్తగా దాన్ని వదిలాడు. కాని, అది, ఆ మత్స్యాన్ని కూలగొట్టలేకపోయింది; దానికి తగిలి క్రింద పడిపోయింది.

ఆవిధంగా విలుకాండ్రందరి గర్వమూ హరించిపోయిన తరువాత, శ్రీకృష్ణుడు రంగంలో ప్రవేశించాడు. ఒకే ఒకసారి, ఆ మత్స్యం నీడను నీటిలో చూశాడు. వింటికి నారిని బిగించి, బాణాన్ని సంధించి, అవలీలగా వదిలాడు. దాంతో, ఆ మత్స్యం నేలకు కూలిపోయింది; లక్షణ ఆయన ధర్మపత్ని అయింది.

ఆ విధంగా, ఆ మహానుభావునకు రుక్మిణి,జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, భద్ర, నాగ్నజితి, లక్షణ అనే అష్టపత్నులేర్పడ్డారు. వారు కాక, మరి పదహారువేలమంది రాజసుందరులు కూడా ఆయనను సేవించటం జరిగింది.

## 97. ప్రేమస్వరూపిణి రాధాదేవి :

శ్రీకృష్ణుని ధర్మపత్నులందరూ ఒక యెత్తు; రాధాదేవి ఒకర్తూ ఒక యెత్తు. ఆమెకూ శ్రీకృష్ణునకూ యేవిధమైన భేదమూ లేదు. శ్రీకృష్ణుడే రాధ. రాధే శ్రీకృష్ణుడు. వారిద్దరినీ వైవాహిక బంధంతో ఏకీకృతం చేసినవాడు చతుర్ముఖుడు.

రాధాదేవి కన్యాకుబ్జ రాజకుమారి. వృషభానుని కుమార్తె. ఆ వృషభానుడు, పూర్వజన్మలో, నృగమహారాజు కుమారుడైన సుచంద్రుడు.

సుచంద్రుని భార్య కళావతి. ఆ కళావతీ సహితుడై, సుచంద్రుడు, గోమతీ తీరానికి వెళ్ళి, ఒక ఆశ్రమం ఏర్పరచుకుని,

చతుర్ముఖుని గూర్చి పన్నెండు దివ్యవత్సరాలు తీవ్రమైన తపస్సు చేశాడు. అతని తపస్సుకు మెచ్చి, చతుర్ముఖుడు ప్రత్యక్షమై, 'నీ కోరిక యేమిటి?' అని అతణ్ణి అడిగాడు.

సుచంద్రుడు, ఏవిధమైన ఆలోచనా లేకుండా, 'నాకు మోక్షం కావాలి' అన్నాడు. అది విన్న చతుర్ముఖుడు, అతని కోరిక నెరవేరే టట్లుగా వరమిచ్చాడు. కాని, అది గ్రహించిన కళావతి, ఆ విధమైన వరప్రదానంవల్ల తనకు భర్తృవియోగం సంభవిస్తుందనీ, తన కా విధమైన అన్యాయం జరుగకుండా చూడవలసిందనీ చతుర్ముఖునకు నివేదించుకుంది.

ఆమె పలుకులు విన్న చతుర్ముఖుడు, వారు, ద్వాపరయుగాంతాన తిరిగి దంపతులయేటట్టూ, ఒక కుమార్తె కలగగానే వారికి మోక్షం లభించేటట్టూ, తన వరాన్ని కొద్దిగా సవరించుకున్నాడు; అదృశ్యుడైనాడు.

అనంతర కాలంలో ఆ కళావతి, కన్యాకుబ్జ దేశాధీశ్వరుడైన భలందన మహారాజుకు కుమార్తెగా యజ్ఞకుండంలో ఉద్భవించింది. సుచంద్రుడు గోపవరుడైన సురభానునకు వృషభానుడనే కుమారుడుగా జన్మించాడు.

అయోనిజ అయిన ఆ రాజపుత్రీ, వృషభానుడూ, చతుర్ముఖుని నిర్ణయం ప్రకారం భార్యా భర్త లయినారు. వారికి, కాలక్రమాన ఒక కుమార్తె జనించింది. వా రామెకు రాధ అని నామకరణం చేశారు.

నారదమహర్షి, ఒకసారి, వృషభానుని కలుసుకుని, ఆయన కుమార్తెకు తగిన భర్త ఒకే ఒక డున్నాడనీ, ఆయనే నందనందనుడైన శ్రీకృష్ణుడనీ తెలియపరచాడు. అలాగే, ఆయన, నందునితో, 'మీ నల్లనయ్యకు తగిన భార్య వృషభానుని ఇంట్లో రాధగా పెరుగుతోంది' అని చెప్పటంకూడా సంభవించింది.

కాలక్రమాన, ఒకసారి, వృషభానుడు రాధను తీసుకుని, నారదుని సూచన ప్రకారం, భాండీరవనానికి వెళ్లాడు. ఆ సమయంలో నందాదులు, బాలకృష్ణ సహితులై అక్కడ ఉన్నారు.

రాధ ఆ వనంలో ప్రవేశించగానే, కృష్ణయ్య గుక్కపట్టి ఏడవటం మొదలుపెట్టాడు. అతణ్ణి శాంతింప చేయటం అక్కడ ఉన్న వారికి ఎవరికీ సాధ్యం కాకపోయింది.

అంతలో రాధాదేవి వారిని సమీపించి, కృష్ణయ్యను తన చేతుల్లోకి తీసుకుంది. ఆ వెంటనే, కృష్ణయ్య రోదనం మాని, ముసిముసి నవ్వులు నవ్వటం మొదలుపెట్టాడు. అది గ్రహించిన నందుడు, 'వీరిద్దరికీ యేదో పూర్వజన్మ సంబంధం ఉండి ఉంటుంది' అనుకున్నాడు. నారదుని పలుకులు స్ఫురణకు తెచ్చుకుని, ఆశ్చర్యంతో వారి వంకనే చూస్తూ అలాగే నిలబడి పోయినాడు.

అంతలో, భూదేవీ చతుర్ముఖుడూ అక్కడ ప్రత్యక్షమైనారు. ఆ రాధాకృష్ణులను సభక్తికంగా ప్రస్తుతించారు. వారిద్దరికీ ప్రణామం చేశారు. ఆ పైన, చతుర్ముఖుడు, అక్కడే ఒక మంటపాన్ని ఏర్పాటు చేయించి, వారిద్దరికీ వేదోక్తంగా వివాహం చేయటం కూడా జరిగింది.

రాధాదేవి ప్రేమ స్వరూపిణి; మూర్తిదాల్చిన మధుర భక్తి. ఆమెకు, ఆవిధమైన విశిష్టస్థానాన్ని ప్రసాదించింది, శ్రీహరి చరణాబ్జాలనే సర్వదా ఆశ్రయించి ఉండే తులసి.

రాధాదేవిని, గోలోకంలో లీలావతి అనీ, వైకుంఠంలో శ్రీ మహాలక్ష్మి అనీ పేర్కొనటం జరుగుతుంది. శ్రీహరి సృష్టికర్తగా వ్యవహరించే సమయంలో, ఆమె ప్రకృతిగా ఉండి సృజన కార్యానికి ఆయనకు దోహద మిస్తూ ఉంటుంది.

రాధాదేవిది అనన్యమైన భక్తి. శ్రీకృష్ణుని విడిచి ఆమె ఉండలేదు. శ్రీకృష్ణుని మరచి ఆమె బ్రదుకలేదు. శ్రీకృష్ణుని పట్ల

ఆమె ఏ విధమైన ఉపచారాన్నీ తలపెట్టలేదు. ఇతరులు తలపెట్టిన పక్షంలో తను సహించలేదు; అదీ ఆమె విశిష్టత.

పరా భక్తికి రాధాదేవిని మించిన నిదర్శనం మరొకటి లభించదు. పరా భక్తికి మారురూపమే రాధాదేవి. శ్రీకృష్ణుని సేవ ద్వారా ఆమె పొందదలచేది యేమీలేదు. శ్రీకృష్ణుని సంతుష్టి పరచటమే, ఆయనదైన ఆనందాన్ని, క్షణ క్షణం అతిశయింప చేస్తూ ఉండటమే ఆమె పరమాశయం. అది కారణంగానే, ఆమె శ్రీకృష్ణునితో తాదాత్మ్యం పొందగలిగింది. శ్రీకృష్ణుని పత్ను లందరి ప్రశంసలకూ పాత్రురాలు కాగలిగింది. శ్రీకృష్ణుని, 'రాధాకృష్ణుని' చేసుకోగలిగింది.

అటువంటి రాధాదేవిని పరీక్షించాలన్న అభిప్రాయం, ఒకసారి మాధవునకు కలిగింది. ఆ వెంటనే, ఆయన, ఒక గోపాంగన రూపం ధరించి, రాధాదేవిని కలుసుకున్నాడు.

ఆ మాయా గోపికను చూడగానే, రాధాదేవికి. ఆమె మీద అదో విధమైన అభిమానం కలిగింది. ఆ గోపిక నామె శ్రీకృష్ణునకు ప్రతిబింబంగా భావించటం జరిగింది. అది కారణంగానే ఆమెను విధ్యుక్తంగా పూజించింది; సత్కరించింది. ఆ రోజంతా ఆమెతోనే గడిపింది.

మాటల సందర్భంలో, రాధాదేవి, ఆ గోపిక నడిగింది; 'మీ పే రేమిటి ?' 'మీ రెక్కడ ఉంటారు?' అని. ఆమెకు సమాధానంగా, ఆ మాయా గోపిక, తను ఉండేది నందపురి అనీ, తన్ను అక్కడివారు, గోపదేవి అంటారనీ తెలియపరచింది. అనంతరం, చీకటి పడబోయే ముందు, అతి బలవంతంమీద ఆమె సెలవు తీసుకుంది. 'మళ్లీ రేపు తప్పకుండా వస్తాను' అని ఆమెకు మాట యిచ్చి, ఆమెకు కొంత మనశ్శాంతిని కలిగించి, అక్కడినుంచి వెళ్లిపోయింది.

అన్న ప్రకారం, ఆ మాయాగోపిక, మర్నాడు మళ్ళీ వచ్చింది. వచ్చి, మాట్లాడకుండా, ఓ మూల మౌనంగా కూర్చుంది. అది చూసిన రాధాదేవి, ఆమెను సమీపించి, ఆమె అలా ఉండటానికి గల కారణ మేమిటో తెలుపవలసిందని బ్రతిమాలుకుంది. దానిమీద, ఆ మాయా గోపిక యిలా చెప్పింది.

"ఉదయాన నేను గోవర్ధనగిరి సమీపంలో పెరుగమ్ముకునే నిమిత్తం వెడుతూ ఉండగా, నందనందనుడైన ఆ నల్లనయ్య నా యెదుట ప్రత్యక్షమైనాడు. నా చెయ్యి పట్టుకున్నాడు. 'నన్ను పెళ్లి చేసుకోవలసింది' అని యెంతగానో బలవంతం చేశాడు.

దాంతో, నాకు ఎక్కడలేని కోపం వచ్చింది. ఆ కోపంలో, ఆయన్ని, నోటికి వచ్చినట్లల్లా తిట్టేశాను. 'చేసుకోగా చేసుకోగా నీ బోటి నల్లవాణ్ణి, నవనీతచోరుణ్ణి, గొల్లవాణ్ణి చేసుకోవాలా!' అని కూడా అన్నాను.

నేనలా అనగానే, ఆయన, కోపంతో, నా పెరుగు కుండను పగులకొట్టాడు. పెరుగంతా త్రాగేశాడు. వెకిలిగా నవ్వుకుంటూ వెళ్లిపోయినాడు.

నిజానికి, అతనివంటి అల్లరివాడు ఇంతవరకు పుట్టలేదు; ఇక ముందు పుట్టబోడు. అతణ్ణి నమ్ముకున్నవాళ్లు, అతణ్ణి ఆశ్రయించిన వాళ్లు, అతణ్ణి పెళ్లి చేసుకున్న వాళ్లు చివరకు ఏమౌతారో నాకు మాత్రం తెలియకుండా ఉంది."

ఆ మాటలు విన్న రాధాదేవి అమితంగా బాధపడ్డది. ఐనా, ఆ బాధను బయట పడనీకుండా, ఆ మాయా గోపికతో ఇలా అన్నది.

"అమ్మా! నువ్వు ఆ మహానుభావుణ్ణి ఎందుకు ఇంతగా తూలనాడుతున్నావో నేను గ్రహించ లేకుండా ఉన్నాను. ఎవని దర్శనం

కోసం, బ్రహ్మరుద్రాదులు తపిస్తూ ఉంటారో, ఎవని పాదధూళి పొందటంకోసం భక్త శిఖామణు లందరూ ప్రయత్నిస్తూ ఉంటారో ఆ పవిత్రతమమూర్తిని అనరానిమాటలంటున్నావు. అది ఏ మాత్రమూ భావ్యంగా లేదు.

ధర్మ సంస్థాపన కోసం, అధర్మాన్ని నశింపజేసే నిమిత్తం, శిష్టులను రక్షించటానికి, దుష్టులను శిక్షించటానికి ఉద్భవించిన ఆ శ్రియఃపతిని నిందించటం న్యాయంకాదు.

అతడు నల్లవా డన్నావు. కాని, ఆ నల్లనయ్య అనుగ్రహం వల్లనే, మహర్షులుసయితం, తమలో ఉన్న చీకటి తెరలను తొలగించుకో గలుగుతున్నారు. అది నువ్వు గ్రహించినట్టులేదు.

అతడు వెన్నదొంగ కావచ్చు. కాని, ఆ వెన్నతోపాటు, అతడెన్ని పవిత్ర హృదయాలనో ఆకర్షిస్తున్నాడు; గ్రహిస్తున్నాడు. అది నువ్వు గ్రహించ లేకుండా ఉన్నావు. అసలు కృష్ణుడంటే యేమిటో తెలిస్తే, ను వ్విలా అని ఉండేదానివి కాదు.

గొల్లలంటే, నువ్వు యేమనుకుంటున్నావో యేమో! ఎల్లప్పుడూ గోసేవ చేస్తూ. గోరజాన్ని ఎప్పుడూ శిరస్సున ధరిస్తూ ఉండే అదృష్టం, గోపాలుడుగా, గోవిందుడుగా వ్యవహరించే ఆ మాధవుణ్ణి అనుక్షణం దర్శించుకుంటూ, ఆయన లీలలను వీక్షిస్తూ, ఆయనతో క్రీడిస్తూ ఉండే భాగ్యం ఆ గొల్లలకే ఉంది గాని ఇతరుల కెవరికైనా ఉందా! లేదు. ఎవ్వరికీ లేదు. ఆ లీలామానుష విగ్రహుడు, ఆ శిఖిపింఛ విభూషణుడు, ఆ శ్రీవత్సాంచితుడు, ఆ వనమాలా విరాజితుడు, ఆ మురళీ మనోహరుడు, ఆ పీతాంబర సుశోభితుడు. ఆ మహానుభావుడు జన్మించటమే ఆ వంశానికి ఉన్న విశిష్టతనూ, శ్రేష్టత్వాన్నీ విశద పరుస్తోంది. అది గ్రహించిన పక్షంలో, నువ్వు ఆయన్ని అంతగా తూలనాడటం జరగదు.

శ్రీసతిని హృదయాన నిలుపుకున్న ఆ పరిపూర్ణుడు, ఆశ్రితుల కొంగు బంగారమై చరించే ఆ మహానుభావుడు, తనకుతానై కోరి, చేరి, ప్రణయభిక్ష నర్థించటం అనుచితచర్యగా భావిస్తున్నట్టున్నావు. అందులో ఆయనదైన అనుగ్రహబుద్ధి, అతినిగూఢంగా, అవధిలేనంతగా ఉన్నదని అర్థం చేసుకోలేకుండా ఉన్నావు. యథార్థానికి, ఆ అనుగ్రహాన్ని పొందే అదృష్టం అందరికీ లభిస్తుందా ? లభించదు. సామాన్యులెవరికీ లభించదు. ఎన్నివేల జన్మల తపస్సో పండిన వారికి మాత్రమే అది లభిస్తుంది...యథార్థానికి...ఎన్నివేల జన్మల తపస్సో....!ఎన్ని వేల జన్మల తపస్సో...!

ఆ మాట అంటూ ఉండగానే, రాధాదేవి కళ్లు కన్నీటి కాలువ లయినై. కంఠం కంపించి పోయింది. ఆవెంటనే ఆమె, చెప్పరాని వేదనతో శిరస్సు వంచుకుంది. అరచేతులలో ముఖాన్ని కప్పుకుని, వెక్కి వెక్కి యేడవటం మొదలుపెట్టింది.

అది చూసిన మాయాగోపిక మందహాసం చేసింది. ఆమెను దగ్గరకు తీసుకుంది. హృదయానికి హత్తుకుంది. ఆమె కన్నీటిని తన పైట కొంగుతో అద్దుతూ, ఆమె చుబుకాన్ని మెల్లగా పైకి ఎత్తింది. ఆమె ముఖానికి తన ముఖాన్ని ఆనించి అలాగే నిలబడ్డది.

అంతలో, రాధాదేవి ఒళ్లు పులకరించినట్టయింది. ఆమె కదో విధమైన దివ్యానుభూతి కలిగింది. అది కారణంగానే, అతి కష్టంమీద, ఆమె కళ్లు తెరచి చూసింది. అనిర్వచనీయమైన ఆనందాన్ననుభవించింది. తన్ను తాను మరచిపోయింది. 'కృష్ణా ! కృష్ణా !!' అంటూ, తన్ను ఆవరించి ఉన్న ఆ నల్లనయ్య మెడను చుట్టేసుకుంది. ఆయన చేతుల్లోకి ఒరిగి పోయింది.

రాధా కృష్ణుల ప్రణయజీవితానికి, ఆ ముహూర్తమే నాంది అయింది. ఆ క్షణంనుంచీ, గోపికలతో శ్రీకృష్ణుడు సలిపిన క్రీడ లన్నిటిలోనూ రాధికదే అగ్రతాంబూలమయింది,

98 . . . నరకాసురుడు :

పూర్వం, నరకుడనే ఒక రాక్షసుడు, ప్రాగ్జ్యోతిషపురాన్ని పాలిస్తూ ఉండేవాడు. అత డొకసారి, దేవలోకంమీదికి దండెత్తివెళ్లి, సురానీకాన్ని అమితంగా చికాకుపరచటం జరిగింది. ఆ సమయంలో, అతను, మహేంద్రుని, అమరావతినుంచి తరిమికొట్టి, అమర భవనా లన్నిటిలోనూ తన విజయాన్ని చాటించాడు. అతని సింహాసన మధి ష్ఠించాడు. అతని నివాసం దోచుకున్నాడు. సురతనువుల నున్మూ లించాడు. దేవకాంతలను చెరబట్టాడు. విశ్వకర్మ కుమార్తెను కూడా బంధించాడు. ఎవరికీ కనబడనివీ, కోరరానివీ అయిన అదితి కుండలాలను అపహరించాడు. వరుణచ్ఛత్రాన్ని వశపరచుకున్నాడు. మణి పర్వ తాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఆ పైన, తన్ను లోకేశ్వరునిగా ప్రకటించుకున్నాడు. పధ్నాలుగు లోకాలలోనూ విశిష్టమైనది యేది ఉన్నా, అది తనకు దత్తం కావాలని దానవానీకానికి ఆదేశించాడు. ఆ ఆదేశాన్ననుసరించి, అతని భటులు, పదహారువేల ఒకవందమంది గంధర్వకన్యలనూ, లక్షమంది యక్ష కాంతలనూ, మరెందరినో కిన్నర సిద్ధ సాధ్య విద్యాధర సుందరులనూ అతని కోసం బంధించి తెచ్చారు.

నరకుడు, ప్రాగ్జ్యోతిషపురం పొలిమేరలలో, నాలుగు దిక్కులా నలుగురు వీరులను, మురాసురుడు, హయగ్రీవుడు, నిశుంభుడు, పంచ జనుడు అనేవారిని, రక్షకులుగా నియమించాడు.

ఆ నరకు డొకసారి బదరీవనానికి వెళ్లటం జరిగింది. వెళ్లి, అక్కడ యజ్ఞయాగాదులు నిర్వహిస్తున్న మునులను సమీపించి, 'ఇక పైన ఇవన్నీ నా పేరట నిర్వహింపబడాలి' అని తెలియపరచాడు. కాని, వారు, అతని పలుకులను లక్ష్యంచేయలేదు. లక్ష్యం చేయకపోవ టమేకాదు; అవహేళన చేశారుకూడా. దానిమీద, అతడు, ఆగ్రహావేశ పరవశుడై, వారి యజ్ఞశాలలను తగుల బెట్టించాడు. యజ్ఞవేదికలను

నేల మట్టం చేయించాడు. యజ్ఞకుండాలను పూడిపించాడు. యూపాలు విరిపించాడు. ఉద్గాతలను సదస్యులను బాధలపాలు చేశాడు. అన్నరాసులను అపవిత్రమైనవిగా చేయించి, వాటిని నలు మూలలా విరజిమ్మించాడు, మునిపత్నులనుకూడా అమితంగా అవ మాన పరచాడు,

అదంతా చూసిన వసిష్ట, వామదేవ, కపిల, కశ్యప, ధౌమ్య, భరద్వాజాదులు, ఆ వెంటనే ద్వారావతికి వెళ్ళి, శ్రీకృష్ణుని దర్శనం చేసుకుని, ఆయనకు, నరకుని దౌష్ట్యాన్ని విశదపరచుకున్నారు. అతని బారినుండి తమ్ము రక్షించవలసిందిగా వేడుకున్నారు. ఆ తరువాత, మహేంద్రుడుకూడా, ఒకసారి శ్రీకృష్ణుని కలుసుకుని, దేవతలవైన పాట్లు ఆయనకు విన్నవించుకున్నాడు. అది కారణంగానే, శ్రీకృష్ణుడు, నరక సంహారానికి నిశ్చయించుకోవటం జరిగింది.

ఆ వెంటనే, ఆయన, గరుడ వాహనారూఢుడై బయలు దేరాడు. అది గ్రహించిన సత్యభామ, ఆయన్ని సమీపించి...

'దేవా నీవు నిశాట సంఘముల నుద్దీపించి చెండాడ నీ
ప్రావీణ్యంబులు సూడగోరెదుగదా ప్రాణేశ మన్నించి న
న్నీ వెంటం గొనిపొమ్ము నేడు కరుణన్ నే జూచి యేతెంచి నీ
దేవీ సంహతికెల్ల జెప్పుదు భవద్దీప్త ప్రతాపోన్నతుల్'

అని మనవి చేసుకుంది.

సత్యభామ సమరరంగంలో ప్రవేశించాలనుకోవటం, శ్రీకృష్ణునకు హాస్యాస్పదం మనిపించింది. అందుకనే ఆయన ఆమె నా ప్రయత్నం విరమించుకోవలసిందిగా కోరాడు. సమరభూమి రాజోద్యానం వంటిది కాదనీ, మహాభయంకరంగా ఉంటుందనీకూడా తెలియపరచాడు. కాని సత్యభామ తన అభిప్రాయాన్ని మార్చుకోలేదు.

అది గ్రహించిన శ్రీకృష్ణుడు, ఆమెతో సహా బయలుదేరి, ప్రాగ్జ్యోతిషపురం చేరుకున్నాడు. చేరుకుని,*98 అక్కడి ప్రాకారాలను తన కౌమోదకితో పిండి పిండి చేశాడు. తన సుదర్శనంతో, అక్కడి అగ్ని వరుణ ప్రాకారాలను ధ్వంసం చేశాడు. తన ఖడ్గంతో, మురాసురుని మాయాజాలాన్ని తొలగించాడు. పాంచజన్యాన్ని మ్రోయించి, కోట బురుజుల మీది శతఘ్నులనూ, వాటి కాపలి వారినీ కూల్చివేశాడు.

ఆ పాంచజన్యం ధ్వని విని, మురాసురుడు అదలిపోయినాడు. అంతవరకూ, అతడు శయనించి ఉన్న వరుణ ప్రాసాదం నుంచి, తన త్రిశూలంతో, బయటకు వచ్చాడు. ఆ వెంటనే, సూర్యప్రభతో శ్రీకృష్ణుని మీదకు ఉరికాడు.

అప్పుడు జరిగిన యుద్ధంలో, శ్రీకృష్ణుడు, ఆ త్రిశూలాన్ని రెండు బాణాలతో మూడు ముక్కలు చేశాడు. అతని గదను తునాతునకలు చేశాడు. చక్రాయుధంతో అతని తల లైదింటినీ నరికి వేశాడు.

ఆవిధంగా మురాసురుడు కూలటంచూసి, అతని కుమారులు తామ్రుడు, అంతరిక్షుడు, శ్రవణుడు, విభావసుడు, వసుడు, నభస్వంతుడు, అరుణుడు అనేవారు, నరకుని సేనాపతి అయిన పీఠుని పుర

---

*98 తదాపతద్ వై త్రిశిఖం గరుత్మతే
హరిః శరాభ్యామభి నత్రిధౌజసా
ముఖేషు తం చాపి శరై రతాడయ
త్తస్మై గదాం సోఽపి రుషా వ్యముంచత.

తా మాపతన్తీం గదయా గదాం మృధే
గదాగ్రజో నిర్బిభిదే సహస్రధా
ఉద్యమ్య బాహూనభిధావతోఽజితః
శిరాంసి చక్రేణ జహార లీలయా.

స్కరించుకుని, శ్రీకృష్ణుని ఎదిరించారు; అనతికాలంలోనే, యమాల యానికి అతిథులుగా వెళ్లారు.

తనవారలా నిహతులు కావటం తెలుసుకుని, నరకుడు అమితంగా భయపడిపోయినాడు; మార్గాంతరం తోచక, ఐరావత కులానికి చెందిన తన హస్తియూథంతో, సమరరంగ ప్రవేశం చేశాడు.

నరకుని చూడగానే, సత్యభామలో తీవ్రమైన రోషం ప్రజ్వలించింది. అది కారణంగానే...

వేణిన్ జొల్లెము వెట్టి సంఘటిత నీవీబంధ యై భూషణ
శ్రేణిందాల్చి ముఖేందుమండల మరీచీజాలముల్ పర్వగా
బాణిం బయ్యెద జక్కగా దురిమి శుంభద్వీర సంరంభయై
యేణీలోచన లేచినిల్చె దన ప్రాణేశాగ్ర భాగంబునన్.

సత్యభామను ఆవిధంగా చూసిన శ్రీకృష్ణునకు, సంభ్రమాశ్చర్యాలు కలిగినై. అందుకనే, ఆయన ఆమె నుద్దేశించి...

'లేమా దనుజుల గెలువగ
లేమా నీవేల కడగి లేచితి విటు రా
లే మాను మానవే నా
లే మా విల్లందికొనుము లీలం గేలన్'

అంటూ, తన బాణాసనాన్ని ఆమెకు అందించాడు.

శ్రీకృష్ణుడందించిన ఆ విల్లు నందుకోగానే, సత్యభామ, అదోవిధమైన అపూర్వ తేజంతో ప్రకాశించింది. వీర, శృంగార, భయ, రౌద్ర రసాలన్నీ అప్పు డామె నాశ్రయించినై. ఆ సమయంలో...

'వీణె జక్కగబట్టి వెరవెఱుంగని కొమ్మ
బాణాసనం బెట్టు పట్టనేర్చె
మ్రాకున దీగె గూర్పంగ నేరని లేమ
గుణము నేక్రియ్య ధనుఃకోటి గూర్చె

సరవి ముత్యము గ్రుచ్చుజాలని యబల యే
నిపుణత సంధించె నిశితశరము
జిలుకకు బద్యంబు చెప్పనేరని తన్వి
యస్త్రమంత్రములెన్న డభ్యసించె
బలుకుమనిన బెక్కు పలుకని ముగుద యే
గతి నొనర్చె సింహగర్జనముల'
ననగ మెఱసె ద్రిజగదభిరామ గుణధామ
చారు సత్యభామ సత్యభామ.

అప్పుడు జరిగిన ఘోరసమరంలో, నరకుని సైన్యం అమితంగా నష్టమైపోయింది. మిగిలినవారు చెల్లాచెదరు కాజొచ్చారు. అది గ్రహించిన శ్రీకృష్ణుడు...

'కొమ్మా దానవనాథుని
కొమ్మాహవమునకు దొలగె గురువిజయము గై
కొమ్మా మెచ్చితి నిచ్చెద
గొమ్మాభరణములు నీవు కోరిన వెల్లన్'

అని బహుమాన పురస్సరంగా అన్నాడు. ఆ పలుకులు విన్న నరకుడు శ్రీకృష్ణుని ఉద్దేశించి...

'మగువ మగవారి ముందఱ
మగతనములు సూప రణముమానుట నీకున్
మగతనము కాదు దనుజులు
మగువల దెస జనరు మగల మగలగుట హరీ'!

అంటూనే, అతడు, శతఘ్ని అనే శస్త్రాన్ని కృష్ణుని మీదకు విసిరాడు. ఆయన్ని అమితంగా ఉద్రేకపరచాడు. అలా ఉద్రేకపరచిన నరకుని మీదా, అతని యోధులమీదా, శ్రీకృష్ణుడు, ఆవెంటనే తన దివ్యాస్త్రాలను ప్రయోగించాడు. ఆ అస్త్రాల మూలంగా, వారందరూ అమి

తంగా పీడితులైనారు. అదే సమయంలో, గరుడుడు, నరకుని హస్తి చయాన్ని తీవ్రంగా గాయపరచాడు. అవి పారిపోయేటట్లు చేశాడు. ఆ సమయంలో, ఎనభై నాలుగు వేలమంది రాక్షసులు హతులు కావటం జరిగింది.

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, నరకుడు ప్రయోగించిన శస్త్రాస్త్రాల నన్నింటినీ ఖండించి, తన చక్రాయుధాన్ని అతని మీదకు పంపాడు. అది కారణంగా, ఆ మరుక్షణంలోనే, నరకుని తల నేలకు వ్రాలిపోవటం జరిగింది.

నరకు డలా కూలిపోగానే, భూదేవి, తన మనుమడైన భగదత్తునితో, శ్రీకృష్ణుని సమీపించి...

'దయసిటు చూడుమా నరకదైత్యుని బిడ్డడు వీడు నీ దెసన్
భయమున నున్నవాడు గడు బాలు డనన్య శరణ్యు డార్తు డా
శ్రయ రహితుండు తండ్రి క్రియ శౌర్యము నేరడు నీ పదాంబుజ
ద్వయి బొడగాంచె భక్త పరతంత్ర సువీక్షణ దీనరక్షణా!'

అని నివేదించుకుంది. ఆయనను, వైజయంతీమాలతో అలంకరించింది. అదితివైన కుండలాలనూ, వరుణచ్ఛత్రాన్నీ ఆయనకు సమర్పించుకుంది.

అనంతరం, భూదేవి ప్రార్థన నంగీకరించి, శ్రీకృష్ణుడు, భగదత్తున కభయమిచ్చాడు. ఆపైన నరకాసురభవనంలో ప్రవేశించాడు.

అక్కడ, నరకుని ఉద్యోగులు, నరకుని ఆస్తి అయిన ఇరవై వేల ఏనుగులనూ అన్ని కరేణువులనూ, సులక్షణాశ్వాలనూ, ఒకలక్ష ఎనిమిదివేల గోవులనూ శ్రీకృష్ణునకు సమర్పించుకున్నారు.

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, అంతకుపూర్వం నరకుడు అక్కడ బంధించి ఉంచిన పదారువేల రాజపుత్రికలను చూశాడు. చూసి, వారి పట్ల ప్రసన్నుడై, వారికి విముక్తి కలిగించాడు.

అలా, శ్రీకృష్ణునిద్వారా విముక్తినందిన రాజకన్యలు, శుభాకారుడూ, మనోహరుడూ అయిన ఆయన్ని కన్నుల కరవుదీర దర్శించుకుంటూ...

'పాపపు రక్కసుండు చెఱపట్టెనటంచు దలంతు మెప్పుడుం
బాపుడుగాడు వీనికత బద్మదళాక్షుని గంటిమమ్మ ము
న్నీ పురుషోత్తముం గదియ నేమివ్రతంబులు సేసినారమో
యాపరమేష్టి పుణ్యుడు గదమ్మ హరిన్ మము గూర్చె నిచ్చటన్'

అని, తమ అదృష్టానికి ఎంతగానో మురిసిపోయినారు. అంతేకాదు.

'వనజాక్షి నే గన్న వైజయంతిక నైన
గదసి వ్రేలుదు గదా కంఠమందు
బింబోష్ఠి నే గన్న బీతాంబరమ నైన
మెఱసియుండుదు గదా మేనునిండ
గన్నియ నేగన్న గౌస్తుభమణినైన
నొప్పుచూపుదుగదా యురమునందు
బాలిక నేగన్న బాంచజన్యమ నైన
మొనసి చొక్కుదుగదా మోవిగ్రోలి

పద్మగంధి నేను బర్హదామమ నైన
జిత్రరుచుల నుందు శిరమునందు,'
ననుచు బెక్కు గతుల నాడిరి కన్యలు
గములుగట్టి గరుడగమను జూచి.

ఆవిధంగా తన్ను ప్రేమించిన రాచకన్నియలందరినీ, వారి కోరికమీద, శ్రీకృష్ణుడు, ద్వారావతిలోని తన అంతిపురానికి చేర్చటం జరిగింది.*[99]

---

*99. తాః ప్రాహిణోద్ ద్వారవతీం సుమృష్ట విరజోఽంబరాః
నరయానై ర్మహాకోశాన్ రథాశ్వాన్ ద్రవిణం మహత్.
ఐరావత కులేభాంశ్చ చతుర్దంతాం స్తరస్వినః
పాండురాం శ్చ చతుః షష్టిం ప్రేషయామాస కేశవః.

ఆ తరువాత, సత్యభామాసమేతుడై, శ్రీకృష్ణుడు, ఇంద్రలోకానికివెళ్ళి, భూదేవి ఇచ్చిన కుండలాలను అదితికి సమర్పించుకున్నాడు. ఆ సమయంలో, అదితి, శ్రీకృష్ణుని, సర్వవిజేతగా దీవించింది. కృష్ణుడు భూలోకంలోఉన్నన్నాళ్లూ, సత్యభామకు నిత్యయౌవనం నిలచి ఉండేటట్టు వరం ప్రసాదించింది. అనంతరం, శచీసమేతుడైన మహేంద్రుడు, శ్రీకృష్ణుని పూజించాడు. ఆపైన శ్రీకృష్ణుడు*100 నందనోద్యానంలో ప్రవేశించి, సత్యభామ కోరికమీద, అక్కడఉన్న పారిజాతవృక్షాన్ని పెకలించి తీసుకుని, ద్వారావతి చేరుకున్నాడు. ఆతరువాత, దాన్ని సత్యభామా ప్రాసాదానికి చేరువలో ఉన్న ఉద్యానవనంలో నాటించాడు. ఆ పారిజాత సుమ సౌరభాన్ని విడిచి ఉండలేక, అమరావతిలోఉండే తేనెటీగ లన్నీ, ఆ ఉద్యానవనంలోనే నివాస మేర్పరచుకోవటం జరిగింది. అనంతరం...*101

అమిత విహారు డీశ్వరు డనంతుడు దా నొకనాడు మంచి ల
గ్నమున బదారువేల భవనంబులలోన బదారువేల రూ
పముల బదారువేల నృపజాలల బ్రీతి బదారువేల చం
దముల విభూతి నొందుచు యథావిధితో వరియించె 'నాదృతిన్'.

## 99. రుక్మిణీ హృదయం :

అలా, పదహారువేలమంది పడుచులను భార్యలుగా స్వీకరించినా, శ్రీకృష్ణుడు, ఒకేఒక విధమైన ప్రేమను వారందరిపట్లా ప్రదర్శిస్తూ ఉండేవాడు. అయినా...*102

---

*100 చోదితో భార్యయోత్పాట్య పారిజాతం గరుత్మతి
ఆరోప్య సేన్ద్రాన్ విబుధాన్ నిర్జిత్యోపానయత్ పురం.

*101 అథో ముహూర్త ఏకస్మిన్ నానాగారేషు తాః స్త్రియః
యథోపయేమే భగవాం స్తావద్రూప ధరోఽవ్యయః.

*102 గృహేషు తాసా మనపాయ్య తర్క్య కృ
న్నిరస్త సామ్యాతిశయే ష్వవస్థితః
రేమే రమాభి ర్నిజకామ సంప్లుతో
యథేతరో గార్హకమే ధికాంశ్చరన్.

'నన్నే ప్రాయడు రాత్రులన్ దినములన్ నన్నే కృపంజెందెడిన్
నన్నే దొడ్డగజూచు వల్లభలలో నాథుండు నాయింటనే
యున్నాడంచు బదారువేలు దమలో నూహించి 'సేవింతు' రా
యన్నుల్ గాఢ పతివ్రతాత్వ పరిచర్యా భక్తి యోగంబులన్'.

అదేవిధమైన అభిప్రాయం రుక్మిణీ సత్యభామాదులైన దేవేరులకు కూడా ఉండేది. కాని, 'నేను పట్టమహిషిని' అన్న భావం, రుక్మిణీ దేవిలో కించిన్మాత్రంగా కూడా ఉండరాదన్న ఉద్దేశంతో, శ్రీకృష్ణు డొకసారి, ఆమె, తన్ను సేవిస్తూ, అమితానందంతో ఉన్న సమయంలో, ఆమె, నుద్దేశించి, సవిలాసంగా ఇలా అన్నాడు.

"దేవీ! నిన్ను చూసినప్పుడల్లా నాకదోవిధమైన విచారం కలుగుతూఉంటుంది. నువ్వు, నిన్నుకోరిన, శ్రీమంతులూ, రూప వంతులూ, బలపరాక్రమసంపన్నులూ అయిన రాజాధిరాజుల నెందరినో కాదని, నన్ను కోరి వరించావు. దానికి ఫలితంగా, బలవంతులైన రాజులకు భయపడి సముద్రంలో దాక్కున్న మమ్మల్ని నువ్వు సేవించటం జరుగుతోంది. యథార్థానికి మేము...

లోకుల నడవడిలోనివారము గాము
పరులకు మాజాడ బయలుపడదు
బలమదోపేతులు పగగొంద్రు మాతోడ
రాజపీఠములకు రాము తఱుచు
శరణంబు మాకు నీ జలరాశి సతతంబు
నిష్కించనుల మేము నిధులు లేవు
కలవారు చుట్టాలుగారు నిష్కించన
జనబంధులము ముక్తసంగ్రహులము
గూఢవర్తనులము గుణహీనులము భిక్షు
లైనవారిగాని యాశ్రయింప
మింపుముఖులు దగుల రిటువంటి మముబోటి
వారి నేలదగుల వారిజాక్షి!"

శ్రీకృష్ణుడు, ఆవిధంగా అప్రియవచనాలు పలకటంవల్ల, రుక్మిణీ దేవి అమితంగా వ్యాకులపడ్డది. వేడి నిట్టూర్పులు విడిచింది. కన్నీరు మున్నీరుగా రోదించింది. మూర్ఛపోయింది.

అది చూసిన శ్రీకృష్ణుడు అమితంగా జాలిపడ్డాడు. ఆమెను ఒళ్లోకి తీసుకున్నాడు. ఆమె ముంగురులు సరిచేశాడు. కన్నీటిని తన ఉత్తరీయంతో అద్దాడు. వివిధోపచారాలూ చేశాడు. మృదు మధుర మైన పలుకులతో; ఆమె నుద్దేశించి ఇలా అన్నాడు.*[103]

'వైదర్భీ! నీకు నా మీద ఉన్న ప్రేమ నాకు తెలియక పోలేదు. నేను, నవ్వుతూ, హాస్యానికి అన్నమాటలకు నువ్వింతగా బాధపడటం భావ్యంకాదు. నేనలా అన్నప్పుడు నువ్వేమంటావో వినాలని, నాకు సమాధాన మిచ్చేటప్పుడు కోపంతో జేవురించిపోయే నీ ముఖాన్నీ, ఒణికిపోయే నీ పెదిమలనూ, బాణాలమాదిరి వచ్చిపడే నీ ఓరచూపులనూ, ముడివడిపోయే కనుబొమలనూచూడాలని మాత్రమే నేనలా అనటం జరిగింది. యథార్థానికి, గృహకృత్యాలలో సతమత మవుతూ ఉండే గృహస్థులకు తమ ప్రియురాండ్రతో, ఇలా కొంత కాలంగడపటానికి మించిన ఆనందం మరొకటి యేముంటుంది? అది గ్రహించి అయినా, నువ్వు శాంతిని పొందాలనీ, నా మీద జనించిన కోపాన్ని తొలగించుకోవాలనీ కోరుతున్నాను.

---

*103 మా మా వైదర్భ్యసూయేథా జానే త్వాం మత్పరాయణాం
త్వ ద్వచః శ్రోతుకామేన క్ష్వేల్యాఽఽచరిత మంగనే.

ముఖం చ ప్రేమ సంరంభ స్ఫురితాధర మీక్షితుం
కటాక్షేపారుణాపాంగం సుందర భ్రుకుటీతటం.

అయం హి పరమోలాభో గృహేషు గృహమేధినాం
యన్నర్మైరీయతే యామః ప్రియయా భీరు భామిని

ఆ విధమైన మృదుమధుర వచనాలతో తాపోప శమనం పొందిన రుక్మిణీదేవి, ఆతరువాత, తన మనోవల్లభుడైన మాధవుని ఇలా ప్రస్తుతించింది.

"మాధవా! నువ్వు పురుషోత్తముడవు. విమలతేజోమూర్తివి. భక్తవత్సలుడవు.

జ్ఞాన సుఖ బలైశ్వర్యాదులు నీ అధీనంలోనివి. నువ్వు సచ్చిదానందమూర్తివి. సర్వలోకేశ్వరుడవు.

నువ్వు దివ్యసుందర విగ్రహుడవు. అజ్ఞానాంధకారనివారకమైనది నీరూపం. నీ పాదారవిందాలు యోగీంద్రులకుకూడా గోచరంకావు. కాని, నా అదృష్టవశాన అవి నాకు లభించినై. అర్చనీయమైనవయినై.

నువ్వు విజ్ఞానప్రదుడవు. దురితదూరుడవు. నీ మాయకు వశులైన మూఢులు నిర్వాణరూపుడవైన నిన్ను గ్రహించలేక, సంసారచక్రంలోపడి పరిభ్రమిస్తూ ఉంటారు. భార్యాపుత్రాదుల పట్లా, గృహారామ విత్తాదులపట్ల ఆసక్తి పెంచుకుని, జీవితాలను వ్యర్థం చేసుకుంటారు. ఖర సూకర మార్జాలాలమాదిరి అజ్ఞానాంధకారంలోపడి దిక్కుతోచక అటమటిస్తూ ఉంటారు.

జలజనాభ సకల జగదంతరాత్మవై
నట్టి దేవ నీ పదారవింద
యుగళి సానురాగ యుక్తమై నామది.
గలుగునట్లుగాగ దలపుమనఘ !"

ఆవిధంగా, తనహృదయాన్ని నివేదించుకున్న రుక్మిణీదేవిని చూసి, శ్రీకృష్ణుడు, అమితానందం పొందాడు. ఆమెమనస్సు నప్పుడంతగా వ్యాకులపరచినందుకు విచారపడ్డాడు. అది కారణంగానే....

'నీవు పతివ్రతామణివి నిర్మల ధర్మవివేకశీల స
ద్భావవు నీ మనోగతుల బాయక యెప్పుడు నస్మదీయ సం
సేవయకాని యన్యము భజింపవు పుట్టిన నాటినుండి నీ
భావ మెఱింగియుండినను బల్కిన తప్పు సహింపు మానినీ'

అని సామాన్య గృహస్థుని మాదిరిగా, ఆమెను బ్రతిమాలుకున్నాడు. ఆమెకు ఊరట కలిగించాడు.

## 100. *శ్రీకృష్ణుని సంసారం :*

ఇదే విధంగా, శ్రీకృష్ణుడు, తన, మిగిలిన పదహారు వేల పడుగురు భార్యలతోనూకూడా వ్యవహరిస్తూ ఉండేవాడు. ఆయన ఎప్పుడూ వారి సముఖాననే ఉండేవాడు. వారి ప్రాసాదాలలో, వారితో క్రీడిస్తూ ఉండేవాడు. వారితో ముచ్చటిస్తూ ఉండేవాడు. అది కారణంగానే, వారిలో ప్రతి ఒక్కరూ, తమపట్లమాత్రమే శ్రీకృష్ణునకు ప్రేమ ఉన్నదని భావించి, ఆయన హృదయాన్ని ఆవిధంగా చూరగొన గలిగిన తమ అదృష్టాన్ని తాము అమితంగా అభినందించుకునేవారు.

అంతేకాదు. ప్రతిప్రాసాదంలోనూ, వందలాదిగా దాసీజనం ఉన్నా, ఆ ఇల్లాండ్రు, శ్రీకృష్ణునకు సంబంధించిన పరిచర్యలన్నీ తామే స్వయంగా చేసేవారు. ఆయనకు ఆసనాన్ని అమర్చటం, అర్ఘ్య పాద్యాదులు సమర్పించుకోవటం, పూజ చేయటం, అన్ని విధాలైన సుగంధద్రవ్యాలతోనూ తాంబూలమివ్వటం, శ్రమాపనోదార్థం చందనాదులు పూయటం, విసరటం, సుగంధాన్ని వెదజల్లే పూలమాలలతో అలంకరించటం, కురులుదువ్వటం, శయ్యాదుల నేర్పరచటం, స్నానం చేయించటం, పంచభక్ష్య పరమాన్నాలతోనూ భోజనంపెట్టడం మొదలైన పనులన్నీ ఆయా పడుచులే చూసుకునేవారు.

పదహారువేలమందికిపైగాఉన్న శ్రీకృష్ణుని పత్నులకు, ఒక్కొక్కరికి పదిమంది కొడుకుల చొప్పున పుట్టారు. వారందరిలోనూ రుక్మిణీ

దేవికుమారుడైన ప్రద్యుమ్నుడూ, జాంబవతి కుమారుడైన సాంబుడూ మాత్రమే ప్రసిద్ధులు.

శ్రీకృష్ణుని కుటుంబంలో తల్లులే పదహారు వేలమందికిపైగా ఉన్నారు. ఆయన కుమారులూ, మనుమలూ, మునిమనుమలూ, కోట్ల కొలదిగా జనించారు. వారికి విద్యాదానంచేసిన గురువులసంఖ్య, మూడుకోట్ల ఎనభై ఎనిమిది లక్షలని తెలుస్తుంది.

రుక్మిణీదేవి సోదరుడైన రుక్మికి, రుక్మవతి అనే ఒక కుమార్తె ఉంది. ఆమె ప్రద్యుమ్నుని వరించి వివాహం చేసుకుంది. ఆ రుక్మవతీ ప్రద్యుమ్నులకు అనిరుద్ధు డుదయించాడు. అతనికి రుక్మి, తన మనుమరాలైన రోచన నిచ్చి వివాహం చేశాడు. ఆ రోచనా అనిరుద్ధులకు వజ్రుడు జన్మించాడు. యాదవ వినాశనం తరువాత ఆ వంశంలో మిగిలినవాడు ఆ వజ్రుడు ఒక్కడే.

## 101. *నృగమహారాజు :*

పూర్వం, నృగుడనే మహారాజు ఉండేవాడు. ఆయన దానశీలి. గోవులనూ, భూములనూ, రత్నరాసులనూ, గృహాలనూ, కాంచన రజత శయ్యాదులనూ, ఇదీ అదీ అని లేకుండా, బహువిధదానాలు చేశాడు. వాపీకూప తటాకాది నిర్మాణాలు చేయించాడు. పంచమహా యజ్ఞా లాచరించాడు.

ఆ మహారాజు, ఒకసారి, కశ్యపుడనే బ్రాహ్మణునికి, నిష్కల్మష హృదయంతో ఇచ్చిన ఒకగోవు, తిరిగివచ్చి, ఆయన మందలో కలిసిపోయింది. అది తెలియక, ఆయన ఆ గోవునే మరొక బ్రాహ్మణునకు దానంచేశాడు.

తిరిగి దానంపొందిన బ్రాహ్మణుడు, ఆ గోవును తోలుకుపోతూ ఉండగా, కశ్యపుడు చూశాడు. చూసి, తనగోవును ఆయన అపహ

రించుకుపోతున్నాడని భావించాడు. ఆయన్ని అమితంగా దూషించాడు.

కళ్యపుని పలుకులు, ఆ బ్రాహ్మణునకు ఆశ్చర్యం కలిగించినై. అందుకనే ఆయన, ఆ గోవును, మహారాజు తనకు దానంగా ఇచ్చాడనీ, తా నెవరి గోవునూ అపహరించుకుపోవటంలేదనీ, కళ్యపునకు తెలియ పరచుకున్నాడు. కాని, కళ్యపు డా పలుకులను లక్ష్యం చేయలేదు. చేయకపోవటమే కాదు; ఆయనతో కలహానికి కూడా దిగాడు.

ఆ కలహం తీవ్రరూపం ధరించింది. చివరకు, వా రిద్దరూ, తమ వివాదాన్ని పరిష్కరించవలసిందిగా కోరుతూ, నృగ మహారాజును సమీపించారు; తమ కలహకారణాన్ని ఆయనకు నివేదించుకున్నారు.

వారి మాటలువిన్న నృగ మహారాజుకు, తన తప్పిద మేమిటో అప్పు డర్థమయింది. అందుకనే, ఆయన కళ్యపుని ఉద్దేశించి, తను తెలియక చేసిన తప్పిదాన్ని క్షమించవలసిందనీ, అతనికి తొలుదొల్త ఇవ్వబడిన గోవుకు మారుగా ఒకలక్ష గోధనాన్ని స్వీకరించవలసిందనీ బ్రతిమాలుకున్నాడు. కాని, కళ్యపుడు అందుకు అంగీకరించలేదు. న్యాయసమ్మతంగా తనదైన గోవుమాత్రమే తనకు కావాలనికోరాడు; అక్కడినుంచి అమితక్రోధంతో వెళ్ళిపోయినాడు.

ఆ వెంటనే, నృగమహారాజు, ద్వితీయ పరిగ్రాహిఅయిన బ్రాహ్మణుని ఉద్దేశించి, 'స్వామీ! నా రాజ్యాన్నంతనూ గ్రహించి అయినా ఈ గోవును కళ్యపునకు ఇవ్వవలసింది. నాదోషానికి నిష్కృతి కలిగించవలసింది' అని ప్రాధేయపడ్డాడు; కాని, కోరిన ఫలితం లభించలేదు. ఆ బ్రాహ్మణుడుకూడా, ఆ గోవును అక్కడే వదలి వెళ్ళిపోయినాడు ఆ పాపఫలాన్ని అనుభవించే నిమిత్తం, నృగమహారాజు, అనంతర కాలంలో, ఊసరవెల్లిరూపంధరించి, ఒక పాడుపడ్డ నూతిలో ప్రవేశించటం జరిగింది.

ఒకరోజున, యదుకుమారులయిన ప్రద్యుమ్న సాంబ సారణ గదాదులు ఆ ఊసరవెల్లిని చూశారు. చూసి, కొండమాదిరిఉన్న దాన్నెలాగయినా బయటకుతీయా లనుకున్నారు. తమ బలాన్నంతనూ వినియోగించి ఎంతగానో ప్రయత్నించారు; విఫలులైనారు.

అది గ్రహించిన శ్రీకృష్ణుడు, వారి కోరికమీద అక్కడికి వెళ్లాడు. వెళ్ళి,*104 గడ్డిపరకను మాదిరిగా దాన్ని తన ఎడమచేతితో ఎత్తి బయటపడేశాడు.

శ్రీకృష్ణుని కరస్పర్శమూలంగా నృగ మహారాజుదైన పాపం పటాపంచలైపోయింది. ఆ వెంటనే ఆయన, తన ఊసరవెల్లి రూపాన్ని త్యజించి, నిజరూపంలో, శ్రీకృష్ణునకు సాష్టాంగప్రణామం చేశాడు. ఆయన్ని అమితంగా ప్రస్తుతించాడు. ఆ తరువాత, 'తండ్రీ! నీ పాదారవిందాలను సర్వవేళలా అర్చించుకునే జ్ఞానాన్ని నాకు ప్రసాదించవలసింది' అని ఆయన్ని ప్రార్థించాడు. ఆయన అనుగ్రహాన్ని పొంది, అక్కడికివచ్చిన ఒక దివ్య విమాన మెక్కి, తన పూర్వ పుణ్యఫలాన్ని అనుభవించే నిమిత్తం దేవలోకానికి వెళ్ళిపోయినాడు.

## 102 . . . *ఘంటాకర్ణుడు* :

ప్రద్యుమ్న జననానంతరం, ఓ సారి, శ్రీకృష్ణుడు, తన పూర్వ తపస్థానమైన బదరీ వనానికి వెళ్ళటం సంభవించింది. అక్కడికి వెళ్ళిన ఆ మహానుభావుని సందర్శించుకునే నిమిత్తం, భరద్వాజ వాల్మీకి వ్యాస గౌతమ కశ్యప కణ్వ పులహ రైభ్య పరాశరాది మును లెందరో

---

*104 తత్రాగత్యారవిందాక్షో భగవాన్ విశ్వభావనః
వీక్ష్యోజ్జహార వామేన తం కరేణ స లీలయా.

స ఉత్తమ శ్లోక కరాభిమృష్టో విహాయ సద్యః కృకలాస రూపం
సంతప్త చామీకరచారు వర్ణః స్వర్గ్యద్భుతాలంకరణాంబరస్రక్.

అక్కడ సమావేశమైనారు. శ్రీకృష్ణుడు వారితో ఆ రోజంతా గడిపాడు.

ఆ తరువాత వారందరూ విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో, అర్ధరాత్రివేళ బయలుదేరి, శ్రీకృష్ణుడు వనాంతరంలో ప్రవేశించాడు. గంగకు ఉత్తరంగా వెళ్ళి, అక్కడ కొంతసేపు సమాధిస్థితుడై కూర్చున్నాడు. తిరిగి వనసందర్శనకు బయలుదేరాడు.

ఆ సమయంలో, ఆయనకు కొన్ని మృగాల కలకలం వినిపించింది. అవన్నీ 'జై జయ గోపాల! హారే! జై జయ గోవింద! హారే!!' అని అరుస్తున్నై. అంతలో బాణాలు గుచ్చుకున్న పులులూ దుప్పులూ అడవిపందులూ అటుగా పరుగుపరుగున పోతూ ఉండటం ఆయనకు కనిపించింది. ఆ వెంటనే ఆయన, వాటిని తరుముకుంటూ వస్తున్న చాపహస్తులను, వికృతాకారులను, పిశాచరూపులను కొందరిని చూశాడు. వారుకూడా శ్రీహరినామ సంకీర్తన చేస్తూ ఉండటం ఆయనకు ఆశ్చర్యం కలిగించింది.

అంతలో పిశాచ నాయకుడైన ఘంటాకర్ణుడు, శ్రీకృష్ణుని సమీపించాడు. శ్రీకృష్ణుడు అతణ్ణి ఉద్దేశించి, 'మీరెవరు ? ఎక్కడికిలా వెడుతున్నారు ?' అని ప్రశ్నించాడు. దానికి సమాధానంగా, ఘంటాకర్ణుడు, తమ వృత్తాంతమంతా తెలియబరచి, 'మేమిప్పుడు దేవకీ పుత్రుడైన మాధవుని సందర్శించుకునే నిమిత్తం, ఆయన నివాసమైన మథురా నగరానికి వెడుతున్నాము' అనికూడా నివేదించుకున్నాడు. అంతేకాదు; 'మహానుభావా! నువ్వు ఎవరివోఅయితే నాకు తెలియదు. కాని, నీ రూపం, నీ తేజం నన్ను ఆకర్షించుకున్నై. దయ ఉంచి నా ఆతిథ్యాన్ని స్వీకరించవలసింది' అని విన్నవించుకున్నాడు. అలా విన్నవించుకుంటూనే, ఒక బాణానికి గుచ్చి ఉన్న మాంసఖండాన్ని ఆయనకు అందించాడు.

శ్రీకృష్ణుడు దాన్ని స్వీకరిస్తూ, 'నువ్వు హింసావృత్తి నవలంబిస్తున్నావా ! అన్నట్టు ఘంటాకర్ణునివంక చూశాడు. అది గ్రహించిన ఘంటాకర్ణుడు ఆయన కిలా నివేదించుకున్నాడు.

'స్వామీ ! ఏదో పాతకం ద్వారా మా కీ జన్మ లభించింది. ఈ జన్మనుంచి తొలగిపోవాలనే మేము కోరుతున్నాము. దానికి సంబంధించిన సాధనలన్నీ చేస్తూనే ఉన్నాము.

ఇప్పుడు మేము సలిపే మృగయా విహారం కూడా విష్ణుపూజా విధి ననుసరించే జరుగుతోంది. మేము మా మనసులో మాధవుని నిలుపుకున్నాము. మాధవుని నివాసమైన మథురానగరాన్ని సర్వవేళలా స్మరించుకుంటూ ఉన్నాము. మాధవుని బహువిధాల భూషిస్తున్నాము. ఆయన దర్శనార్థమే ఇప్పుడు ప్రయాణిస్తున్నాము.

వేదాధ్యయనం చేసినంత మాత్రాన, తర్క మీమాంసాది శాస్త్రాలలో ప్రావీణ్యత పొందినంత మాత్రాన, మునివృత్తి నవలంబించినంత మాత్రాన, యజ్ఞయాగాదులు నిర్వహించినంతమాత్రాన దర్శనీయుడుకాని ఆ మాధవుడు భక్తసులభుడని మాకు తెలుసు. అందుకనే మే మాయన్ని భక్తిమార్గాన చేరుకోదలచాము; సాక్షాత్కరింపజేసుకోదలచాము. ఇలా జీవిస్తూ ఉన్న మేము మా జన్మకు అనుగుణమైన వృత్తిని అవలంబిస్తూ ఉన్నా దోషం కాదనుకుంటాను".

ఆ మాటలు విన్న శ్రీకృష్ణుడు విస్మితుడైనాడు. అంతలో, ఘంటాకరునకు, అతడు నియమపూర్వకంగా అనుదినం జరిపే కార్యక్రమానికి సమయమయింది. ఆ వెంటనే, అతడు అక్కడే సమాధిస్థితుడైనాడు. పరమ పురుషుని, ఆ శ్రీహరిని ప్రార్థించసాగాడు. తన పిశాచజన్మను తొలగించవలసిందనీ, తన్ను భక్తునిగా స్వీకరించవలసిందనీ వేడుకున్నాడు.

అది గ్రహించిన శ్రీకృష్ణుడు ఆశ్చర్యం పొందాడు. ఆ వెంటనే, అతణ్ణి అనుగ్రహించే ఉద్దేశంతో, అతని చిత్తాబ్జంలో తనదైన

దివ్యరూపంలో దర్శన మిచ్చాడు. అతనికి పరమానందాన్ని ప్రసాదించాడు.

ఆ విధంగా శ్రీ మహావిష్ణువును సందర్శించుకున్న ఘంటాకర్ణుడు ఆ తరువాత కళ్లు తెరచాడు. తన చిత్తాబ్జంలో వీక్షించుకున్న దివ్యరూపాన్ని తన సముఖాన ఉన్న శ్రీకృష్ణునిలో దర్శించుకున్నాడు. అమితానందంతో ఆయన్ని స్తుతించాడు. తన్ను అనుగ్రహించవలసిందిగా ప్రార్థించాడు.

ఆపైన, శ్రీకృష్ణుడు అతని శరీరాన్ని స్పృశించాడు. అది కారణంగా, అతనికి దివ్యదేహం లభించింది. ఆ తరువాత, అతని కోరిక మీద, శ్రీకృష్ణుడు, అతనికి నితాంత భక్తిని ప్రసాదించటం జరిగింది.

## 102. *పౌండ్రక వాసుదేవుడు :*

కరూశదేశాధిపతి అయిన పౌండ్రకుడు ఉట్టి గర్విష్ఠి. అతని సహచరులైన కొందరు మూఢులు, అతణ్ణి సంతోషపరచే ఉద్దేశంతో, 'నువ్వు వాసుదేవుడవు. ప్రపంచాన్ని ఉద్ధరించటానికే నువ్వు అవతరించావు' అని పదేపదే పొగడటం మొదలు పెట్టారు.

వారి పలుకులు విన్న పౌండ్రకుడు, యథార్థానికి తనే వాసుదేవుడైనట్టు భావించాడు. ఆ అభిప్రాయంతోనే, అతడొక దూతను పిలిచి, ఇలా ఆదేశించాడు.

"నేను పృథ్వీపతిని. ధరణిని రక్షించే ఉద్దేశంతోనే, నేను అవతరించాను. అందుకనే, నన్ను అందరూ వాసుదేవుడని పిలవటం జరుగుతోంది.

కాని, వ్రేపల్లెలో పుట్టి పెరిగిన ఒకయాదవుడు, నా పేరునూ, నాచిహ్నాలనూ ధరించి తిరుగుతున్నట్టు తెలియవస్తోంది. అది అతనికి శ్రేయస్కరం కాకపోగా, నాకు అవమానకరంగాకూడా ఉంది. అతడు ఇప్పుడైనా, తనతప్పును తెలుసుకోవటం, నా పేరున్నూ

శంఖచక్రాదులైన నాచిహ్నాలనూ త్యజించటం, నన్నాశ్రయించటం సమంజసం. అతడు వాటిని పాటించిన పక్షంలో, నే నతణ్ణి క్షమించ టానికి సిద్ధంగా ఉన్నాను. అది కాదని అతడు పంతానికి దిగటమే, జరిగితే, నే నతనితో యుద్ధం చేయటం, అందులో అతణ్ణి వధించటం, తథ్యం. ఇది నా నిశ్చితాభిప్రాయం. నువ్వతణ్ణి కలుసుకుని, నామాట లుగా అతని కీవిషయమంతా చెప్పవలసింది".

తన ప్రభువైన పౌండ్రకుని ఆదేశాన్ని శిరసావహించి, ఆ దూత, ద్వారావతి చేరుకున్నాడు. నందాదులైన యాదవప్రముఖు లతో కొలువుదీరిఉన్న శ్రీకృష్ణుని సమీపించాడు. ఉచితానుచితా లనుకూడా ఆలోచించకుండా, అందరిసముఖానా, తన విభుని సందే శాన్ని ఆయనకు అందచేశాడు.

పౌండ్రకుని గర్వోక్తులు విన్న శ్రీకృష్ణుడు ఆ దూత నుద్దేశించి...

'వినరా మీ నృపుడన్న చిహ్నములు నే వే వచ్చి ఘోరాజిలో
దనమీదన్ వెసవైవ గంకముఖ గృధ్రవ్రాతముల్ మూగగా
ననిలో దర్పముదూలి కూలి వికలంబై సారమేయాలికి
న్ననయంబున్ శరణంబవయ్యెదను మే నన్నట్లుగా వానితోన్'

అని అత్యుద్రేకంతో అన్నాడు.

ఆ వెంటనే ఆ దూత, శ్రీకృష్ణునివద్ద సెలవు తీసుకుని, తిరిగివెళ్ళి పౌండ్రకుని కలుసుకున్నాడు. అతని కా ప్రతిసందేశాన్ని అందచేశాడు.

ఆతరువాత, శ్రీకృష్ణుడు వివిధాయుధాలను ధరించి, తన అద్భుత స్యందనాన్నధిరోహించి, రణోత్సాహంతో కాశీకానగరం చేరు కున్నాడు. శ్రీకృష్ణు డలా రావటం గ్రహించిన పౌండ్రకుడు, రెండ క్షౌహిణుల బలంతో శ్రీకృష్ణునిమీదికి వెళ్లాడు. ఆసమయంలో,

అతని మిత్రుడైన కాశీరాజు, తన మూడక్షౌహిణుల బలంతోనూ, అతనికి అండగా నిలబడటం జరిగింది.

ఆవిధంగా, ఐదక్షౌహిణుల బలంతోనూ, కృత్రిమాలైన శంఖచక్ర గదాఖడ్గ శార్ఙ్గాదులతోనూ, శ్రీవత్సంతోనూ, కౌస్తుభమణితోనూ వనమాలికతోనూ, గరుడధ్వజమెత్తిన రథంమీద, తనమీదికి వస్తున్న పీతాంబరధారిని శ్రీకృష్ణుడు చూశాడు. చూసి, పకపకలాడాడు.

అంతలో, పౌండ్రకుడు, శ్రీకృష్ణునిమీద వివిధాయుధాలనూ ప్రయోగించటం జరిగింది. అది గ్రహించి, శ్రీకృష్ణుడు ఉగ్రుడైనాడు. ఆవెంటనే, ఆయన, పాంచజన్యాన్ని పూరించాడు. దివ్యాస్త్రాలను సంధించి వదిలాడు. అతని సేననంతనూ కలవరపరచాడు. రణరంగాన్ని రుధిరవాహిని చేశాడు. ఆతరువాత పౌండ్రకుని ఉద్దేశించి....*105

'మనుజేంద్రాధమ పౌండ్రభూపసుత నీ మానంబు బీరంబు నే
డనిలో మాపుదు నెద్దు క్రొవ్వివెలుచ న్నాబోతుపై అంకెవై
చినచందంబున దూతచేత నను నాక్షేపించి వద్దన్న పే
రును జిహ్వాంబులు నీపయిన్ విడుతు నర్చుల్ పర్వ నేడాజిలోన్'

అని భీకరంగా గర్జించాడు. గర్జిస్తూనే*106 తీవ్రమైన బాణాలను పౌండ్రకుని మీద వదిలాడు. అలా విడువబడిన బాణాలు, పౌండ్రకుని కేతనాన్ని కూల్చినై. రథాన్ని నుగ్గునుగ్గు చేసినై. కాశీపతిని

---

*105 అథాహ పౌండ్రకం శౌరి ర్భో భోః పౌండ్రక యద్భవాన్
దూతవాక్యేన మామాహ తా న్యస్త్రా ణ్యుత్సృజామి తే.

*106 ఇతి ఉక్త్వా శితై ర్బాణై ర్విరథీ కృత్య పౌండ్రకం
శిరోఽవృశ్చద్ రథాంగేన వజ్రేణేంద్రో యథా గిరేః.
తథా కాశిపతేః కాయా చ్ఛిర ఉత్కృత్య పత్రిభిః
న్యపాతయత్ కాశిపుర్యాం పద్మకోశ మివానిలః.

సంహారించినై. ఆ తరువాత ఆయన ప్రయోగించిన చక్రాయుధం, నిర్వక్రపరాక్రమంతో వెళ్ళి, పౌండ్రకుని తలను నరికింది.

ఆ విధంగా, శ్రీకృష్ణునితో విరోధించిన పౌండ్రకవాసుదేవుడు కూలిపోయినాడు. అయినా అతనికి ముక్తి లభించింది. మాత్సర్యంతో అయినా అతడు శ్రీకృష్ణుని చిహ్నాలను ధరించి, అనవరతం ఆయనను స్మరించుకుంటూ ఉండటమే దానికి మూలం.

### 103 . . . సుదర్శనం :

పౌండ్రకవాసుదేవుని కుమారుడైన సుదక్షిణుడు, తన తండ్రిని సంహారించిన శ్రీకృష్ణుని సాధించే నిమిత్తం, మహేశ్వరుని ఆరాధించాడు. ఆయన్ని ప్రసన్నుని చేసుకుని, ఆయన సూచన మీద అగ్నిదేవుని ఉపాసించి, భీకర రౌద్రాకారిణి అయిన ఒక కృత్యను కల్పించి ద్వారకాపురం పైకి పంపాడు.

అలా ప్రయోగింపబడిన కృత్యను చూసి, వ్రజవాసులు భయంతో కంపించిపోయినారు. ఆవెంటనే శ్రీకృష్ణుని ఆశ్రయించారు.

సర్వరక్షకుడైన శ్రీకృష్ణుడు, ప్రాణభీతితో తన్ను ఆశ్రయించిన తనవారికి అభయమిచ్చాడు. ఆవెంటనే, దవానలం మాదిరి తన దిక్కుగావస్తున్న కృత్యను నిగ్రహించే నిమిత్తం, తన చక్రాయుధాన్ని వదిలాడు.

ఆ చక్రాయుధం, అనంత తేజంతో రోదసీకుహారాన్నంతనీ వెలిగిస్తూ, విస్ఫులింగాలను విరజిమ్ముకుంటూ వెళ్ళి, కృత్యతో తల పడ్డది. దాని శక్తిని క్షీణింపజేసింది. ఆ విధంగా చక్రాయుధం ద్వారా నిగ్రహింపబడిన కృత్య, ఆ వెంటనే, వారణాసికి పోయి, తన్ను సృజించిన సుదక్షిణునీ, అతని పురోహితులనూ మ్రింగివేసింది.ఆ కృత్యను తరుముకుంటూ వెళ్ళిన సుదర్శనం కూడా, కాశీనగరంలో ప్రవేశించి

ఆ నగరాన్ని అంతనూ భస్మం చేసింది. తిరిగి ద్వారావతి చేరుకుని, శ్రీకృష్ణుని ఆశ్రయించింది.

## 104. *సాంసారిక జీవితం :*

శ్రీకృష్ణుడు నరకాసురుని సంహారించి, అతడు చెరపట్టి ఉంచిన పదహారువేలమంది రాజకన్యలనూ విడిపించి, వివాహం చేసుకున్నాడని విని, నారదమహర్షి ఒకసారి, ఆయన విభవం చూసే ఉద్దేశంతో ద్వారావతికి వెళ్లాడు. వెళ్ళి, శ్రీకృష్ణుని పట్టపుదేవి అయిన రుక్మిణీదేవి మందిరం చేరుకున్నాడు.

ఆ సమయంలో, శ్రీకృష్ణుడు, అక్కడ, రుక్మిణీదేవి సేవ లందుకుంటున్నాడు. కాని, నారదుని ఆగమనవార్త తెలియగానే ఆయన *107 ఆమెతోసహా బయటకు వచ్చాడు. వచ్చి, మహర్షికి స్వాగతం చెప్పాడు. ఆయనను లోపలకు తీసుకు వెళ్లాడు. విధ్యుక్తంగా ఆయనకు అర్ఘ్యపాద్యాదులు సమర్పించుకున్నాడు. తనదైన ఆసనంమీద ఆయన్ని ఉపవిష్టుని చేశాడు. ఆయన పాదాలను కడిగాడు. ఆ పాదతీర్థం తన శిరస్సున చల్లుకున్నాడు; రుక్మిణీదేవి శిరాన చల్లాడు. అనంతరం, ఆ మహర్షి నుద్దేశించి, 'స్వామీ! ఈ దాసుడు మీకు చేయగల సేవ యేదైనా ఉంటే సెలవివ్వవలసింది' అన్నాడు.

ఆ పలుకులు విన్న నారదుడు, ఆయనదైన భక్తవాత్సల్యాన్ని ప్రశంసించాడు. ఆయన మాహాత్మ్యాన్ని స్తుతించాడు. 'మహానుభావా! సంసారసముద్రాన్ని తరింపజేసే మహానౌకను, నీ పాదద్వయాన్ని నేను

---

*107 తం సంనిరీక్ష్య భగవాన్ సహసోత్థితః శ్రీ
పర్యంకతః సకలధర్మ భృతాం వరిష్ఠః
ఆనమ్య పాదయుగలం శిరసా కిరీట
జుష్టేనసాంజలి రవీవిశదాసనే స్వే

సర్వదా ఆశ్రయించి ఉండేటట్టు అనుగ్రహించవలసింది' అని ప్రార్థించాడు. ఆయనవద్ద సెలవు తీసుకుని, అక్కడినుంచి వెళ్ళిపోయినాడు.

ఆ తరువాత. ఆ మహానుభావుని యోగ మాయా ప్రభావాన్ని దర్శించుకునే ఉద్దేశంతో, ఆ మహర్షి, శ్రీకృష్ణునిదైన మరొక మందిరంలో ప్రవేశించాడు. అక్కడ, ఆయనకు, శ్రీకృష్ణుడు *108 సత్యభామతోనూ, ఉద్ధవునితోనూ పాచికలాడుతూ కనిపించాడు.

అక్కడకూడా, ఆయనకు అన్నివిధాలైన పూజలూ జరిగినై. శ్రీకృష్ణుడు, ఆయన్ని కలుసుకుని ఎంతోకాలమైనట్టుగా ఆయన్ని పలుకరించాడు. 'మహానుభావులైన మీ రాకతో మా భవనం పవిత్రమయింది. మమ్మల్ని ఆశీర్వదించి, మా జీవితాలకు ధన్యత్వం చేకూర్చవలసింది' అని ఆయనకు నివేదించుకున్నాడు.

శ్రీకృష్ణుని పలుకులు నారదునకు అమితాశ్చర్యం కలిగించినై. ఆ వెంటనే ఆయన, శ్రీకృష్ణునకు నమస్కరించి, ఆయన వద్ద సెలవు తీసుకుని, మాట్లాడకుండా బయటకు వెళ్ళాడు; మరో మందిరంలో ప్రవేశించాడు.

అక్కడ నారదునకు, *109 తన చిన్నారి బిడ్డలను ఎత్తుకుని ఆడిస్తూఉన్న కృష్ణయ్య కనిపించాడు. అలాగే, మరొక మందిరంలో, స్నానానికి సిద్ధమవుతూఉన్న నల్లనయ్య దర్శన మివ్వటం జరిగింది.

ఒకే ఒక సమయంలో, విభిన్నరూపాలతో, అనేక మందిరాలలో వివిధక్రీడలు సలుపుతూ ఉండటం మహాద్భుతంగా భావిస్తూ, నారద

---

*108 దీవ్యంత మక్షై స్తత్రాపి ప్రియయా చోద్ధవేన చ
పూజితః పరయా భక్త్యా ప్రత్యుత్థానాసనాదిభిః.
పృష్టశ్చా విదుషే వాసౌ కదాఽయాతో భవానితి
క్రియతే కిం ను పూర్ణానా మపూర్ణై రస్మదాదిభిః.

*109 తత్రాప్యచష్ట గోవిందం లాలయంతం సుతాచ్ఛిశూన్
తతోఽన్యస్మిన్ గృహేఽపశ్యన్మజ్జనాయ కృతోద్యమం.

మహర్షి, ఆతరువాత, ఎన్నో మందిరాలను దర్శించుకున్నాడు. అన్ని మందిరాలలోనూ కూడా, ఆయనకు, శ్రీకృష్ణదర్శన మయింది. కాని, ఏ మందిరంలో ఆయన్ని కలుసుకున్నా, ఆయన, ఆ మహర్షి ని అప్పుడే దర్శించినట్టుగా పలుకరించేవాడు. ప్రవర్తించేవాడు. పూజాదికాలు సలిపేవాడు. తన్ను ఆశీర్వదించవలసిందిగా ప్రార్థించేవాడు.

ఆ మహానుభావుడు, *[110]ఒకచోట, అగ్నికార్యం జరుపుతూ ఉండేవాడు. ఒకచోట నిత్య కర్మానుష్టానంలో ఉండేవాడు. ఒకచోట

---

*110 జుహ్వాన్తం చ వితానాగ్నీన్ యజన్తం పంచభిర్మఖైః
భోజయన్తం ద్విజాన్ క్వాపి భుంజాన మవశేషితం
క్వాపి సంధ్యాముపాసీనం జపన్తం బ్రహ్మ వాగ్యతం
ఏకత్ర చాసి చర్మభ్యాం చరన్త మసి వర్త్మసు.
అశ్వై ర్గజై రథైః క్వాపి విచరన్తం గదాగ్రజం
క్వచి చ్ఛయానం పర్యంకే స్తూయమానం చ వందిభిః.
మంత్రయన్తం చ కస్మింశ్చి న్మంత్రిభి శ్చోద్ధవాదిభిః
జలక్రీడారతం క్వాపి వారముఖ్యాబలావృతం.
కుత్ర చిద్ ద్విజ ముఖ్యేభ్యో దదతం గాః స్వలం కృతాః
ఇతిహాస పురాణాని శృణ్వన్తం మంగలాని చ
హసన్తం హాస్య కథయా కదాచిత్ ప్రియయా గృహే
క్వాపి ధర్మం సేవమాన మర్థకామౌ చ కుత్రచిత్
ధ్యాయంత మేక మాసీనం పురుషం ప్రకృతేః పరం
శుశ్రూషంతం గురూన్ క్వాపి కామై ర్భోగైః సపర్యయా.
కుర్వన్తం విగ్రహం కైశ్చిత్ సంధిం చాన్యత్ర కేశవం
కుత్రాపి సహ రామేణ చిన్తయన్తం సతాం శివం.
పుత్రాణాం దుహితౄణాం చ కాలే విధ్యుపయాపనం
దారైర్వరై స్తత్సదృశైః కల్పయన్తం విభూతిభిః
ప్రస్థాపనోపానయనై రపత్యానాం మహోత్సవాన్
వీక్ష్య యోగేశ్వరే శస్య యేషాం లోకా విసిస్మిరే
యజన్తం స్వకలాన్ దేవాన్ క్వాపి క్రతుభి రూర్జితైః
పూర్తయన్తం క్వచిద్ ధర్మం కూపారామ మఠాదిభిః

బ్రహ్మవిదులకు సంతర్పణ చేస్తూ ఉండేవాడు. ఒకచోట, వారి ఉచ్ఛి ష్టాన్ని భుజిస్తూ ఉండేవాడు.

అల్లాగే, ఒకచోట, సంధ్యావందనం సలుపుతూ, ఒకచోట, గాయత్రీజపం చేసుకుంటూ, ఒకచోట, కవచంధరించి తనకున్న ఖడ్గ ప్రయోగ పాటవాన్ని ప్రదర్శిస్తూ, ఒకచోట, రథ గజా శ్వాదుల నారోహించి చరిస్తూ, ఒక చోట, విశ్రాంతి తీసుకుంటూ, ఒకచోట, వందిమాగధుల స్తోత్రపాఠాలువింటూ, ఒకచోట, యుద్ధవుడు మొదలైన వారితో సంప్రదింపులు జరుపుతూ, ఒకచోట జలక్రీడ సలుపుతూ, ఒక చోట, గోవులను దానమిస్తూ, ఒకచోట, ప్రముఖ పురాణేతి హాసాలను శ్రద్ధతోవింటూ, ఒకచోట దేవేరులతో సరస సల్లాపాలాడుతూ, ఒకచోట, తనదైన విధ్యుక్త ధర్మాన్ని నిర్వహిస్తూ, ఒకచోట, అర్థ సంగ్రహానికి సంబంధించిన ఆలోచనలుచేస్తూ, ఒకచోట, గృహస్థాశ్రమ ధర్మాలను పాలిస్తూ, ఒకచోట, యుద్ధ యత్నాలుచేస్తూ, మరొకచోట, సంధికి చర్చలుజరుపుతూ, ఒకచోట బలరామునితో సాధు సంరక్షణకు సంబంధించిన విషయాలు చర్చిస్తూ, మరొకచోట, పిల్లలపెళ్ళిళ్ళు జరుపుతూ, ఒకచోట, క్రొత్తగాపెళ్ళి అయిన కుమార్తెలను అత్తవారి యిళ్ళకు పంపుతూ, మరొకచోట, అప్పుడేవచ్చిన కూతుళ్లనూ అల్లుళ్లనూ పలుకరిస్తూ, ఒకచోట యజ్ఞయాగాదులు జరుపుతూ, వేరొక చోట దేవాలయాదులు నిర్మిస్తూ, ఏక కాలంలో విభిన్నరూపాలతో వివిధ విధాల దర్శనమిస్తూవచ్చిన ఆ శ్రీకృష్ణభగవానుని యోగ మాయా ప్రభావాన్ని ప్రత్యక్షంగా వీక్షించి, నారదమహర్షి అంతులేని ఆనందా న్ననుభవించాడు.

అది కారణంగానే, ఆయన, శ్రీకృష్ణుని ఉద్దేశించి, 'దేవా! నీ పాద పరిచర్యా మహిమ మూలంగా, యోగమాయా విలాసాన్ని నే డీ విధంగా దర్శించగలిగాను. ధన్యుడనైనాను. ఇక నీ లీలా విశే

పాలను కీర్తిస్తూ, ముల్లోకాలలోనూ సంచరిస్తూ ఉండటానికి నాకు అనుజ్ఞ నివ్వవలసింది,' అని విన్నవించుకున్నాడు. ఆయన వద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయినాడు.

## 105. *దినచర్య :*

శ్రీకృష్ణుడు బ్రహ్మ ముహూర్తంలో నిద్ర లేచేవాడు. ఆ వెంటనే, కాళ్లూ చేతులూ ముఖం కడుక్కుని, ప్రశాంత చిత్తంతో, పరమాత్మని ధ్యానించుకునేవాడు. ఆ తరువాత, స్నానంచేసి, శుభ్ర వస్త్రాలు ధరించి, సంధ్యావందనాది కర్మానుష్ఠానం జరిపేవాడు. అనంతరం, గాయత్రీ మంత్ర జపం సలిపేవాడు. సూర్యునకూ పితరులకూ, మహర్షులకూ అర్ఘ్య మర్పించుకునేవాడు. ఆ పైన, తన కుటుంబంలోని పెద్దలనూ, బ్రహ్మవిదులనూ యథావిధిగా అర్చించి, దాన ధర్మా లాచరించేవాడు. గోవులకూ, విప్రులకూ, దేవతలకూ, గురువులకూ నమస్కరించేవాడు. ఆ తరువాత, తాను స్వయంగా శృంగారించుకునేవాడు. నేతిలోనూ అద్దంలోనూ ముఖం చూసుకునే వాడు. అనంతరం, తన్ను ఆశ్రయించినవారందరినీ అనుగ్రహించే వాడు.

ఆ విధమైన కార్యక్రమం పూర్తి అయేసమయానికి, దారుకుడు దివ్య రథాన్ని తెచ్చి సిద్ధంగా ఉంచేవాడు. ఆ రథమెక్కి, సాత్యకి తోనూ ఉద్ధవునితోనూ బయలుదేరి, సభాభవనానికి వెళ్లేవాడు.

అలా, సుధర్మ అనే సభాభవనంలో ప్రవేశించి, సింహాసనా న్నధిష్టించేవాడు. ఆయన చుట్టూ యదువీరు లందరూ ఉపవిష్టులై ఉండేవారు.

అక్కడ, హాస్యగాండ్రు, పలువిధాల, ఆయననూ సభాసదులనూ ఆనందపరచేవారు. నాట్యగత్తెలు సభారంజకంగా నటించేవారు. సూతులూ మాగధులూ వందులూ వివిధ వాద్యవిశేషాల సహాయంతో

ఆడి పాడి సభాస్తారులకు సంతోషం కలిగించేవారు. ఆ తరువాత, కొందరు బ్రాహ్మణులు వేదపఠనం జరిపేవారు. మరికొందరు, పూర్వపు రాజుల దివ్యచరిత్రలను వినిపించేవారు; శ్రీ కృష్ణునకూ యితరులకూ మహదానందం కలిగించేవారు.

## 106. రాజసూయ ప్రసక్తి :

అలా, మహదానందదాయకంగా ఉండే ఆ సభాస్థలానికి, ఒక రోజున, ఒక భూసురుడు వచ్చాడు. వచ్చి, శ్రీ కృష్ణుని సభక్తికంగా స్తుతించాడు. ఆ తరువాత, ఆయన్ని ఉద్దేశించి, 'తండ్రీ! జరాసంధుడు తన్ను ధిక్కరించిన ఇరువదివేల ఎనిమిదివందల మంది రాజులను, గిరివ్రజమనే పట్టణంలో చెరబెట్టాడు. ఆ రాజులు, సర్వశరణ్యుడవైన నిన్నే ఆశ్రయించి, తమ బాధను తొలగించవలసిందిగా నిన్ను వేడుకుంటున్నారు. ఆ అనన్య శరణ్యుల పలుకులు నీకు మనవిచేసుకునే నిమిత్తమే నేనిలా వచ్చాను' అని వినయపూర్వకంగా నివేదించుకున్నాడు.

అది విన్న శ్రీ కృష్ణుడు, ఒక క్షణకాలం ఏదో ఆలోచించాడు. అంతలో, త్రిలోకసంచారి అయిన నారద మహర్షి అక్కడికి రావటం జరిగింది.

అలా వచ్చిన మహర్షిని, విధ్యుక్తంగా పూజించి, శ్రీ కృష్ణుడిలా అడిగాడు.

'మహర్షీ ! మీరు త్రిలోకసంచారులు. ముల్లోకాలలోనూ మీకు తెలియని విషయమంటూ ఉండదు. అందుకనే, పాండవుల యోగ క్షేమాలను గురించి మీ ద్వారా వినగోరుతున్నాను.'

అది విన్న నారదుడు, ముందుగా, పాండుపుత్రుల క్షేమాన్ని తెలియపరచాడు. ఆ తరువాత, ధర్మరాజు రాజసూయాధ్వరం నిర్వ

హింప దలచాడనీ, యజ్ఞరక్షకుడూ యజ్ఞభోక్తా అయిన శ్రీకృష్ణుడు, మేనబావ అయిన ఆయనకు సర్వవిధాలా సాయపడటం సమంజసమనీ విన్నవించుకున్నాడు. ఆ సందర్భంలోనే...

'కృష్ణా! నువ్వు పరమపురుషుడవు. భక్తవత్సలుడవు. నిన్ను సేవించినవారికి, నీ నామాన్ని ఉచ్చరించినవారికి, నిన్ను దర్శించిన వారికి ఇహపర సుఖాలు లభించి తీరుతై.

అది కారణంగానే, నువ్వా మఖసమయంలో అక్కడ ఉండాలనీ, అక్కడికి వచ్చే రాజులకూ మహర్షులకూ నీ దర్శన భాగ్యాన్ని లభింప జేయాలనీ కోరుతున్నాను.'

అని కూడా విన్నవించుకున్నాడు. అది విన్న శ్రీ కృష్ణుడు, ఉద్ధవుని ఉద్దేశించి, 'మిత్రమా! ఇప్పుడు మా కర్తవ్య మేమిటో తెలుప వలసింది' అని కోరాడు.

అలా శ్రీ కృష్ణుడు కోరిన మీదట, ఉద్ధవుడు ఇలా సూచించాడు.

"కృష్ణా! దిగ్విజయం చేసినవారు మాత్రమే రాజసూయ నిర్వహణకు అర్హులవుతారు. ధర్మజుని దిగ్విజయానికి జరాసంధ సంహారం అత్యవసరం.

మహానుభావా! నువ్వు కాలస్వరూపుడవు. ప్రపంచ సృష్టికీ లయానికీ కూడా నీ దైన ప్రభావమే ఆధారంగా ఉంటుంది. ఆ యా సందర్భాలలో చతుర్ముఖుడూ శంకరుడూ నిమిత్తమాత్రులుగా మాత్రమే వ్యవహరిస్తూ ఉంటారు. అది గ్రహించటంవల్లనే, జరాసంధుని వల్ల బంధింపబడినవారి పుణ్యమూ, జరాసంధుని పాపమూ పండి ఫలించటానికి నువ్వీపనికి పూనుకోవాలనీ, ఒకే ఒక పనితో రెండు లక్ష్యాలను నువ్వు సాధించాలనీ కోరుతున్నాను.

ఉద్ధవుని అభిప్రాయం గ్రహించిన శ్రీకృష్ణుడు, నారదుని సూచనకు తన అంగీకారం తెలియపరచాడు. భూసురుని ఉద్దేశించి, 'మీ సందేశం త్వరలోనే ఫలప్రద మౌతుంది' అని తెలియపరచాడు. ఆయనకూ నారదునకూ సెలవిచ్చి పంపాడు.

ఆ తరువాత, ఒక సుముహూర్తం చూసుకుని, శ్రీకృష్ణుడు, తన దేవేరులతోనూ, పుత్ర మిత్రాదులతోనూ, పరివారంతోనూ బయలుదేరి ఇంద్రప్రస్థం చేరుకున్నాడు.

ఆవిధంగా తన నగరికి విచ్చేసిన యాదవశ్రేష్టునికి, ధర్మరాజాదులు, పురోపకంఠం వద్దనే స్వాగతం చెప్పారు. ఆయన్నీ, ఆయనతో వచ్చిన పెద్దలనూ అర్చించారు. మంగళతూర్యనాదాలతో వారందరినీ పురంలో ప్రవేశింపజేశారు.

నగరంలో ప్రవేశించగానే, శ్రీకృష్ణుడు, తన మేనత్త అయిన కుంతీదేవి వద్దకు వెళ్ళాడు. ఆమెకు ప్రణామం చేశాడు. కుశల ప్రశ్నలు వేశాడు.

అనంతరం, ద్రౌపదీ సుభద్రలు ఆయన్ని దర్శించి, అంజలించారు. ఆయన వారిని ఆశీర్వదించాడు.

ఆ తరువాత, పాంచాలి, కుంతీదేవి ఆదేశానుసారం, శ్రీకృష్ణుని దేవేరులందరినీ విధ్యుక్తంగా పూజించింది; అమూల్యమైన కానికలెన్నింటినో వారికి సమర్పించుకుంది.

శ్రీకృష్ణుడు కూడా, ఆపైన, తన ప్రాణస్నేహితుడైన అర్జునునితో అతని మందిరానికి వెళ్ళాడు; అక్కడే, ఆ రోజంతా గడిపాడు.

ఆ మరునాడు, ధర్మరాజు, యాదవ ప్రముఖులందరితోనూ తనకొలువుకూటంలో ప్రవేశించి, శ్రీకృష్ణుడు ప్రసన్నుడై ఉన్న సమయం కనిపెట్టి....

'కృష్ణా! నాకు రాజసూయం చేయాలన్న అభిలాష కలిగింది. దాన్ని సక్రమంగా నిర్వహించగలవాడు, నా బంధువర్గంలో, నువ్వు తప్ప మరొకరు లేరు. అదీకాక...

ఎవ్వరు నీ పదాంబుజము లెప్పుడు గొల్తురు భక్తినిష్ఠులై
యెవ్వరు నిన్ను బ్రేమ నుతియింతురు భూరి వివేకశాలులై
య వ్విమలాత్ము లందుదు రుదంచిత శోభన నిత్యసౌఖ్యముల్
నివ్వటిలంగ గృష్ణ నిను నేర్చి భజించిన రిత్తవోవునే!'

అనికూడా విన్నవించుకున్నాడు.

ధర్మజునికి తనపట్ల ఉన్న అభిమానాన్ని గ్రహించి, శ్రీకృష్ణు డమితానందం పొందాడు. అది కారణంగానే...

'నయగుణశాలి పాండునృపనందన నీ తల పొప్పు నీ క్రతు
క్రియ మునిదేవతా పితృసుకృత్యమునై నిఖిలోగ్ర శాత్రవ
క్షయమును బాంధవప్రియము సంచితపుణ్యము నిత్యకీర్తియుఞ్
జయమునొసంగు దీని గురుసత్తమ వేగ యుపక్రమింపవే!'

అని ఆయన్ని అభినందించాడు; ప్రోత్సహించాడు. అంతేకాదు. అనుపమ దివ్యాస్త్రవేదులైన ఆయన అనుజులను దిగ్విజయార్థం నాలుగు దిక్కులకూ వెంటనే పంపవలసిందని కూడా ఆదేశించాడు.

## 107. *జరాసంధుడు :*

శ్రీకృష్ణుని పలుకులువిన్న ధర్మజునికి, తన రాజసూయాధ్వరం నిర్విఘ్నంగా నెరవేరి తీరుతుందన్న ధైర్యం కలిగింది. ఆ ధైర్యం తోనే ఆయన, సహదేవుని సృంజయవీరులతో దక్షిణదిశకూ, నకులుని, మత్స్యులతో పడమటిదిశకూ, అర్జునుని, కేకయులతో ఉత్తరదిక్కుకూ, భీముని, మద్రులతో తూర్పుదిక్కుకూ పంపించాడు. శ్రీకృష్ణుడు

వారందరిలోనూ తన దివ్య తేజాన్ని ప్రసరింపజేసి, వారిని అజేయుల నుగా చేశాడు.

ఆ విధమైన శక్తితో బయలుదేరిన భీమ నకుల సహదేవులు, ఆయాదిక్కులలోఉన్న రాజులందరినీ జయించి, వారినుంచి కప్పంగా అనేక రత్నరాసులను తీసుకువచ్చారు; రాజైన యుధిష్ఠిరునకు సమర్పించుకున్నారు. అర్జునుడుకూడా, అనేకమంది మహీపతులను జయించాడు. వారందరినీ ధర్మజునకు సామంతులుగా చేశాడు. కాని, జరాసంధుడుమాత్రం, యుధిష్ఠిరుని ఆధిక్యతనంగీకరించలేదు. ఆయనకు కప్పంచెల్లించలేదు. ఆ విషయాన్నే అర్జునుడు తన అన్నగారికి నివేదించుకున్నాడు.

అదివిన్న యుధిష్ఠిరుడు అమితంగా వ్యాకులపడసాగాడు. శ్రీకృష్ణుడు, అది గ్రహించాడు. గ్రహించి మగధేశ్వరుని విషయంలో ఆయన బాధపడవలసిందేమీలేదనీ, అతణ్ణి సంహరించే ఉపాయం తనకు తెలుసుననీ చెప్పి, ఆయనకు ధైర్యం కలిగించాడు. ఆ వెంటనే, భీమార్జునులను తీసుకుని, జరాసంధుడున్న గిరివ్రజం చేరుకున్నాడు.

జరాసంధుడు బ్రాహ్మణులను దేవతలతో సమంగా పూజిస్తాడు. వా రేది కోరితే అది ఇస్తాడు. అది తెలిసిన శ్రీకృష్ణుడు, గిరివ్రజంలో ప్రవేశిస్తూనే, విప్రవేషం ధరించాడు. భీమార్జునులచేత కూడా విప్రరూపాలు ధరింపచేసి, తన్ను అనుసరించవలసిందిగా వారి నాదేశించాడు.

ఆ విధంగా బ్రాహ్మణాకృతిలో తన్ను సమీపించిన శ్రీకృష్ణ భీమార్జునులకు, జరాసంధుడు, యథావిధిగా అతిథి పూజాదికా లాచరించాడు. ఆ తరువాత, శ్రీకృష్ణుడు, అతణ్ణి ఉద్దేశించి ఇలా అన్నాడు.

'మగధేశ్వరా ! నువ్వు అతిథి పూజాధురంధరుడవని విని మేము దూరదేశంనుంచి ఇలా వచ్చాము. ఇక మా భాగ్యం ఎలా ఉంటే అలా జరుగుతుంది.

అతిథి జనులను భక్తితో పూజించేవారికి శాశ్వతమైన కీర్తి లభిస్తుంది. దేహం అస్థిరమైనదని గ్రహించి, చిరతరమైన కీర్తిని ఆసించి జీవించేవారే ధన్యులవుతారు. దానికి భిన్నంగా ప్రవర్తించే వారు జీవన్మృతు లనిపించుకుంటారు.

ప్రపంచంలో, దానశీలురైనవారికి ఇవ్వరాని పదార్థమంటూ ఏదీ ఉండదు. దధీచి తన ఎముకలనే దానం చేశాడు. శిబిచక్రవర్తి తన శరీరాన్ని కోసి ఇచ్చాడు. అలాగే రంతిదేవుడు, హరిశ్చంద్రుడు, బలి మొదలైనవారు, అనిత్యమైన తమ శరీరాలనూ సంపదలనూ ధారపోసి, నిత్యమైన కీర్తి నార్జించుకున్నారు. అది కారణంగానే, వారు, మరణించినా ఉన్నవారుగానే భావింపబడుతున్నారు. వారి మాదిరిగానే, నువ్వుకూడా, మా కోరికను తీర్చి, మహితయశాన్ని పొందవలసింది'.

శ్రీకృష్ణుని పలుకులు విని జరాసంధుడు ఒక్కసారి ఆ ముప్పురివంకా చూశాడు. చూసి, వారి రూపాలుగాని, కంఠ స్వరాలుగాని, అల్లెత్రాటి రాపిడి వల్ల కాయలు కాచిన వారి ముం జేతులుగాని విప్రుల కుచితమైనవికావని తెల్సుకున్నాడు. అది కారణం గానే, వారు విప్రవేషంలో వచ్చిన రాజులని నిర్ణయించుకున్నాడు. అయినా, వారి కోరికతీర్చటం తన ధర్మమని భావించాడు. అందు కనే, వారిని ఉద్దేశించి...

'భూరి గుణులార మీ మది
కోరిక యెఱిగింపు డేమి కోరిననైనన్

ధీరత నొసగుటయే కా
దారయ నా శిరము ద్రుంచియైనను నిత్తున్'

అని, అతిథులపట్ల తనకున్న గౌరవాన్ని ప్రకటించుకున్నాడు.

ఆ వెంటనే, శ్రీకృష్ణుడు*111 'అలా అయిన పక్షంలో, మేము కోరే భిక్షను మాకు ప్రసాదించవలసింది. మేము నీవద్దకు క్షుధార్తులమై రాలేదు. ద్వంద్వ యుద్ధాన్ని కోరివచ్చాము. ఆ కోరిక తీర్చగలిగితే సంతోషిస్తాము' అన్నాడు.

అది విన్న జరాసంధునకు, వారు సామాన్యులు కారన్న అభిప్రాయం ధృవపడ్డది. అందుకనే, ఆయన శ్రీకృష్ణుని దిక్కై, 'నేను తప్పకుండా మీ కోరిక తీరుస్తాను. కాని, మీ రెవరో ముమ్ముందుగా తెలుపవలసి ఉంటుంది' అన్నాడు.

అతనికి సమాధానంగా, శ్రీకృష్ణుడు*112 భీమార్జునులను పరిచయపరచాడు. 'నేను నీ పూర్వవిరోధిని. నన్ను శ్రీకృష్ణుడంటారు' అని తన్ను తాను తెలుపుకున్నాడు.

శ్రీకృష్ణుని పలుకులు విని, జరాసంధుడు పగలబడి నవ్వాడు. నవ్వుతూనే, 'కృష్ణా! ఇంతకు పూర్వం నువ్వు నాతో అనేకసార్లు పోరాడావు. నా ప్రతాపాన్ని రుచి చూశావు. చివరకు, నాకు భయపడి, మథురానగరంనుంచి పారిపోయి, సముద్రంలో తల దాచుకున్నావు. ఆ విషయం నువ్వు మరచిపోయినా నేను మాత్రం ఈ జన్మలో మరచిపోలేను. పిరికిపందవైన నీతో తిరిగి పోరాడటానికి ఇష్టపడలేను.

---

*111 యుద్ధం నో దేహి రాజేంద్ర ద్వంద్వశో యది మన్యసే
యుద్ధార్థినో వయం ప్రాప్తా రాజన్యా నాఽన్నకాంక్షిణః.

*112 అసౌ వృకోదరః పార్థ స్తస్య భ్రాతాఽర్జునో హ్యయం
అనయో ర్మాతులేయం మాం కృష్ణం జానీహి తే రిపుం.

ఇక అర్జునుడున్నాడు. అతడు నాకు వయసులోగాని, బల పరాక్రమాలలోగాని ఈడు కాడు. అది కారణంగానే, నేను, నాతో సమాన బలుడైన భీమునితో పోరాడటానికి, అందులోనూ, అతనికి అమిత ప్రావీణ్యం ఉన్న గదాయుద్ధంలో అతణ్ణి ఎదిరించటానికి సిద్ధంగా ఉన్నాను; అన్నాడు. అంటూనే, ఒక ఉద్దండ గదాదండాన్ని భీమునకందించాడు. ఆ తరువాత, వారితోసహా పుర బహిఃప్రదేశంలో ఉన్న ఒక సమస్థలం చేరుకున్నాడు.

అలా అక్కడికి వెళ్లిన భీమసేన జరాసంధులు, పరస్పరం తలపడ్డారు. ఆ సమయంలో, మహోగ్రమైన వారి గదలు ఒక దానికొకటి తాకినప్పుడల్లా, రెండు పర్వతాలో, రెండు సముద్రాలో, పరస్పరం ఢీకొంటున్న ధ్వని కలిగింది. ఆకాశం పగిలిపోతున్నదా అనిపించింది. వారి పాదఘట్టనలకు భూమి అదరిపోసాగింది. వారి గర్జనలు ఉరుముల మాదిరి వినిపించినై. అంతలో, వారిరువురి గదలూ నుగ్గు నుగ్గు కావటం జరిగింది. ఆ వెంటనే, వారు ముష్టియుద్ధానికి దిగారు. ఆ సమయంలో...

ప్రక్కలు చెక్కులున్ మెడలు పాణితలంబులచే బగుల్చుచున్
ముక్కులు నక్కులుం జెవులు ముష్టిహతిన్ నవియంగ గ్రుద్దుచున్
డొక్కలు బిక్కలున్ ఘనకఠోర పదాహతి నొంచుచున్ నెఱుల్
దక్కక స్రుక్కకొండొరుల దార్కొని పేర్కొని పోరి రుగ్రతన్.

అది చూసిన శ్రీకృష్ణుడు, ఒకసందర్భంలో, భీమసేనుడు జరాసంధునకు చాలడేమో అనుకోవటంకూడా జరిగింది. అందుకనే ఆయన జరాసంధుని జన్మవృత్తాంతము తెలిసినవాడు కావటంవల్ల*113 అతణ్ణి చంపే ఉపాయం భీమసేనునకు సూచిస్తూ, అక్కడఉన్న ఒక పుల్లను

*113. సంచిన్త్యారి వధోపాయం భీమస్యామోఘ దర్శనః
దర్శయామాస విటపం పాటయన్నివ సంజ్ఞయా.

తీసుకుని, అతడు చూస్తూఉండగా, దాన్ని, మధ్యకు రెండు చీలికలుచేసి, చెరొకప్రక్కకూ విసరివేశాడు. ఆ సూచనమీద, భీమసేనుడు, ఆవెంటనే, జరాసంధుని క్రిందపడేసి, అతని కాలిని ఒకదాన్ని తన కాలితో త్రొక్కిఉంచి, రెండుచేతులతోనూ అతని రెండవకాలు పట్టుకుని, అతణ్ణి మధ్యకు రెండుగా చీల్చివేశాడు.

అలా చీలిపోయిన జరాసంధునిచూసి ప్రజలు హాహాకారాలు చేశారు. కృష్ణార్జునులు భీమసేనుని కౌగిలించుకుని అభినందించారు.

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, జరాసంధుని కుమారుడైన సహదేవుని మగధకు అధిపతిగా అభిషేకించాడు. అంతకుముందు జరాసంధునివల్ల బంధింపబడిఉన్న రాజులందరినీ, వారికి మాట ఇచ్చిన ప్రకారం, చెఱనుంచి విడిపించాడు. ఆ సమయంలో, శ్రీకృష్ణుడు, వారికి, తన దివ్యరూపంలో దర్శన మివ్వటం జరిగింది.

నీలమేఘం వంటి శరీరచ్ఛాయతో, పట్టుపీతాంబరంతో, చతుర్భుజుడై, శంఖ చక్ర గదాద్యాయుధాలు ధరించి, శ్రీవత్సంతోనూ, కౌస్తుభంతోనూ, కిరీట కుండలాలతోనూ, వనమాలతోనూ, ప్రసన్న వదనంతోనూ విరాజమానుడై తమకు దర్శనమిచ్చిన శ్రీకృష్ణుని చరణాబ్జాలమీద వ్రాలి, ఆ రాజన్యులందరూ పదేపదే ప్రణామాలాచరించారు. తమ జీవితాలు ధన్యత నందినట్టు భావించారు. ఆ పైన తమ కృతజ్ఞతను ఆయన కిలా తెలియపరచుకున్నారు.

"తండ్రీ! రాజ్యమదంవల్ల, మే మింతవరకు, ప్రజలను పీడిస్తూ, పరస్పరం కలహించుకుంటూ, దుష్టభావంతో వ్యవహరిస్తూ వచ్చాము. అస్థిరమైనసంపదలే స్థిరమైనవనుకుని, అశాశ్వతమైనభోగాలు శాశ్వతమైనవనుకుని, అనిత్యమైన పదవులు నిత్యమైనవనుకుని, వాటివెంట, ఎండమావులకు పరుగెత్తే జంతువుల మాదిరి పరుగెడుతూ వచ్చాము. నీ దర్శనంద్వారా, నేడు, మా కా భ్రమ తొలగిపోయింది. ఐహిక

సుఖాలమీది ఆశ నశించిపోయింది. మమ్మల్ని ఇక అనుగ్రహించ వలసింది; నీ భక్తశ్రేణిలో చేర్చుకోవలసింది."

ఆ విధంగా తన్ను ఆశ్రయించిన మహీపతుల నుద్దేశించి, శ్రీకృష్ణుడు...

'మీరలు ధర్మముం దగవు మేరయు దప్పక భూజనాళి బెం
పారయ సౌఖ్య సంపదల నందగఁబ్రోచుచు భూరియజ్ఞముల్
గౌరవ వృత్తి మత్పరముగా నొనరించుచు మామకాంఘ్రి పం
కేరుహముల్ భజించుచు నకిల్బిషులై చరియింపుడిమ్ములన్'

అని ఉపదేశించాడు. వారందరినీ వారివారి దేశాలకు సగౌరవంగా సాగనంపాడు.

అలా జరాసంధుని వధించి, అతనిచేత చెరపెట్టబడిన రాజులందరికీ విముక్తి కలిగించి, భీమార్జునులతో ఇంద్రప్రస్థం చేరుకున్న శ్రీకృష్ణుని, యుధిష్ఠిరుడు యథోచితంగా ప్రస్తుతించాడు. ఆయనకు తమపట్ల ఉన్న అభిమానానికి తన కృతజ్ఞతను మరొకమారు తెలియపరచుకున్నాడు.

## 109 . . . *శిశుపాలుడు :*

ఆ తరువాత, శ్రీకృష్ణుని ఆమోదంపొంది, భీష్మ ద్రోణ కృప ధౌమ్యాదులతోనూ తదితర ప్రముఖులతోనూ సంప్రదించి, వ్యాస వశిష్ఠ విశ్వామిత్ర గౌతమ భరద్వాజ కశ్యప వామదేవ పరశురామ గర్గ వైశంపాయనాది మహర్షులను ఋత్విజులుగా వరించి, ధర్మరాజు రాజసూయ మహాధ్వర నిర్వహణ కుపక్రమించాడు. తనవారందరికీ కొన్నికొన్ని గురుతర బాధ్యతలనుకూడా అప్పగించాడు. ఆ సందర్భంలోనే...

సకలావనీశు లిచ్చిన
యకలంక సువర్ణ రత్నహయ ధనవస్త్రీ

ప్రకరంబులు మొదలగు కా
నుకలందికొనన్ సుయోధనుని నియమించెన్.

అర్థిజాతము కోరినట్టి వస్తువులెల్ల
దగ బంచియిడగ రాధాతనూజు
సరసాన్న పానాది సకల పదార్థముల్
పాకముల్ సేయింప బవనతనయు
బంకజోదరు నొద్ద ఛాయక పరిచర్య
దవిలి కావింప వాసవతనూజు
సవన నిమిత్తంబు సంచిత ద్రవ్యంబు
పెంపుతో వేగ దెప్పింప నకులు

దేవ గురు వృద్ధ ధాత్రీసురావలులను
నరసి పూజింప సహదేవు నఖిలజనుల
బోలుచు మృష్టాన్నతతుల దృప్తులను జేయ
ద్రౌపదిని నియోగించెను ధర్మసుతుడు.

ఆ సందర్భంలో, యాగసందర్శనార్థం విచ్చేసిన అతిథులకు పాద పూజ చేసే పనిని, శ్రీకృష్ణుడు తనకుతానై కోరి స్వీకరించాడు. అదే విధంగా, సాత్యకి వికర్ణ హార్దిక, విదుర, భూరిశ్రవాదులకు కూడా ధర్మజుడు ఉచిత కార్యాలను ఒప్పచెప్పాడు. వారందరూ తమతమ పనులను అమితోత్సాహంతో, నిర్దుష్టంగా, యుధిష్ఠిరుని మనసుకు నచ్చేటట్టుగా నిర్వర్తించుకోవటానికే శ్రమించారు. అలా ప్రారంభమైన రాజసూయ మహాధ్వరాన్ని దర్శించే నిమిత్తం, బ్రహ్మ రుద్రామరేంద్రులూ, లోకపాలురూ, గరుడ గంధర్వ విద్యాధర ప్రముఖులూ అనేకమంది వచ్చారు. వచ్చి, పరమ విభవంతో, అత్యంతనియమంతో శాస్త్రోక్తప్రకారం, లోకోత్తరంగా జరుగుతున్న ఆ క్రతు నిర్వాహకులను అమితంగా ప్రశంసించారు. 'శ్రీకృష్ణ భక్తులైనవారు చేయరాని దేముంటుంది' అని తమలోతాము అబ్బురపడసారు.

మహాధ్వరం ముగిసేరోజున, యాజకులనూ, సదస్యులనూ, గురువులనూ విధ్యుక్తంగా పూజించటానికి యధిష్ఠిరుడు నిర్ణయించుకున్నాడు. కాని, అగ్రపూజకు అర్హులెవరా అని ఆయన ఆలోచించసాగాడు. అది గ్రహించిన సదస్యులు, ఎవరికి తోచినట్లు వారు సూచించారు. కాని, వారి పలుకులు సహదేవునకు సంతృప్తికరమైనవి కాలేదు. అందుకనే అతడు ధర్మరాజునకు శ్రీకృష్ణుని చూపి, 'యదుకుల శేఖరుడైన ఈ మహానుభావుడు సాక్షాద్భగవంతుడు.

ఈ పురుషోత్తమున్ జగదధీశు ననంతుని సర్వశక్తు జి
్రదూపకు నగ్రపూజ బరితోషితుజేయ సమస్త లోకముల్
వే పరితుష్టిబొందు బృథివీవర కావున నీవు కృష్ణునిన్
శ్రీపతి బూజసేయు మెడసేయక మాటలు వేయునేటికిన్.

అని వినయపూర్వకంగా విన్నవించుకున్నాడు. ఆ పలుకులు విన్న ప్రాజ్ఞులైన మహీపతులూ మహర్షులూ, సహదేవుని వివేకాన్ని ఎంతగానో అభినందించారు. అతని అభిప్రాయం అత్యుత్తమమైనదిగా ఉన్నదని ప్రశంసించారు. ఆ వెంటనే, అమితోత్సాహంతో, యుధిష్ఠిరుడు, శ్రీకృష్ణుని సమీపించి, ఆయనకు, భక్తి పూర్వకంగా ప్రథమార్ఘ్యం సమర్పించుకున్నాడు. ఆ పావనోదకాన్ని తన శిరస్సున చల్లుకున్నాడు. తన సోదరుల మీదా ద్రౌపది మీదా చల్లాడు. శ్రీకృష్ణునకు పట్టుపీతాంబరాలూ దివ్యాభరణాలూ సమర్పించుకున్నాడు. పరమానందం పొందాడు. అది చూసిన పవిత్ర హృదయాలన్నీ అమిత భక్తితో, 'నమోనమః' 'జయజయ' అంటూ ఆయదుకుల శిరోభూషణునిపట్ల తమకున్న గౌరవాన్ని ప్రకటించుకున్నారు. ఆ సందర్భంలో, ఆకసం నుంచి ఆ మహానుభావునిమీద పుష్పవృష్టి కురిసింది.

అది చూసిన శిశుపాలునకు అమితమైన అసూయ కలిగింది. శ్రీకృష్ణునకు ప్రథమార్ఘ్యమివ్వటం అతడు సహించలేకపోయినాడు. అది కారణంగానే అతడు సభాసదుల నుద్దేశించి ఇలా అన్నాడు.

'ఈ సభలో బ్రహ్మనిష్టులూ, జ్ఞానమూర్తులూ, తపోధనులూ ఉత్తమ కుల విద్యా గుణసంపన్నులూ అయిన మహనీయు లెందరో ఉన్నారు. వారందరినీ కాదని, ఒక దాశార్హుని, ప్రప్రథమంగా పూజించటం అవమానకరమైన విషయం. అతడయినా ప్రసిద్ధుడా అంటే అదీకాదు.

గురు దేవ శూన్యుండు కులగోత్ర రహితుండు
దలిదంద్రుడులెవ్వరో తడవ గాన
మప్పులబోరలెడు నాదిమధ్యావ సా
నంబులం దరయమానంబు లేదు
బహురూపియై పెక్కుభంగుల వర్తించు
వావివర్తనములు వరుస లేవు
పరికింప విగత సంబంధుండు దలపోయ
మా నిమిత్తంబున మానిసయ్యె
బరగమున్న యయాతి శాపమున జేసి
వాసికెక్కదు యీ యదువంశమెల్ల
బ్రహ్మతేజంబునెల్ల గోల్పడిన యితడు
బ్రహ్మఋషి సేవ్యుడగునె గోపాలకుండు.

గోపాలురు యథార్థానికి పూజనీయులు కారు. వారు దస్యుప్రాయులు. అది కారణంగానే, వారు, బ్రహ్మర్షి సేవితమైన భూమిని వదలి, సముద్రమధ్యంలో వ్యవహరించటం జరుగుతోంది. ఇదంతా తెలిసికూడా, యుధిష్ఠిరుడు ఇతనికి ప్రథమార్ఘ్యమిచ్చాడు. మనల్ని అందరినీ కోరి అగౌరవపరచాడు. ఇది సహింపరాని విషయం'.

శిశుపాలుని అనుచితవచనాలు విని, సభాసదులందరూ అమితంగా వ్యాకులపడ్డారు. వారిలో చాలామంది హరినిందవినలేక, అక్కడినుంచి వెళ్ళిపోయినారు. కాని, మత్స్య కేకయ సృంజయులు మాత్రం, సహదేవుని నాయకత్వాన, శిశుపాలుని శిక్షించే ఉద్దేశంతో, తమతమ ఆయుధాలను తీసుకుని, అతని మీదికి ఉరికారు. అది గ్రహించి, శిశుపాలుడూ, అతని అనుచరులూ యుద్ధ సన్నద్ధులై నిలబడ్డారు. ఆ సమయంలో, ఆ సవనసీమ సమరస్థల మవుతుందేమో అన్న భీతి అక్కడివారికి కలిగింది.

అంతలో, శ్రీకృష్ణుడు, సహదేవాదులను వారించాడు. తన సమక్షాన కత్తిదూసి నుంచున్న శిశుపాలునివంక అమిత రోషంతో చూశాడు. చూసి* మనసారా తన చక్రాయుధాన్ని స్మరించుకున్నాడు, ఆ వెంటనే రాక్షసాంతకమైన ఆ చక్రం వచ్చి ఆయన చేతి నలంకరించింది. ఆయన, దాన్ని అతనిమీద ప్రయోగించాడు.

శిశుపాలుడు శ్రీకృష్ణుని మేనత్త అయిన శ్రుతిశ్రవ (సాత్వతి) కుమారుడు అతనికి సునీథుడనే వ్యవహారనామంకూడా ఉంది. అతని తండ్రి దమఘోషుడు; చేది దేశాధీశ్వరుడు.

శిశుపాలుడు నాలుగుచేతులతోనూ, లలాటంమీద నేత్రంతోనూ జన్మించాడు. అది చూసిన అతని తలిదండ్రులు భయపడిపోయినారు. వారలా భయపడి, విస్మయావిష్టులై ఉండగా, 'ఎవరు ఎత్తుకున్నప్పుడు ఇతని మిగిలిన రెండుచేతులూ మూడవకన్నూ హరించి పోతయ్యో, అతనివల్ల ఇతనికి మరణం ఉంది;' అని ఒక అశరీరి పలికింది.

---

*114 తథా బ్రువత ఏ వాస్య భగవాన్ మధుసూదనః
మనసా చింతయ చ్చక్రం దైత్యవర్గ నిషూదనం
ఏతస్మి న్నేవ కాలే తు చక్రే హస్తగతే సతి...

అది విన్నవారందరూ ఆశ్చర్యచకితులైనారు. అప్పటినుంచీ, అతనికి మారకుడైనవానిని గ్రహించే ఉద్దేశంతో, అక్కడికి వచ్చినవారందరికీ, అతని తల్లిదండ్రులు, అతణ్ణి అందిస్తూ వచ్చారు.

వికృతరూపధారి అయిన తమ మేనత్త కుమారుని చూడాలనే ఉద్దేశంతో, రామకృష్ణులు కూడా, ఒకసారి అక్కడికి వెళ్లటం జరిగింది. అలా వెళ్ళిన ఆ మహానుభావులకు, ఉచితోపచారాలు జరిగినై. అనంతరం, సాత్వతి, తనకుఱ్ఱవాణ్ణి బలరామునిచేతి కందించింది. ఆ తరువాత శ్రీకృష్ణున కిచ్చింది.

శ్రీకృష్ణుడు, ఆ శిశువును చేతుల్లోకి తీసుకోగానే, అంతవరకూ ఆ శిశువుకు అదనంగా ఉన్న చేతులూ కన్నూ హరించిపోయినై. అది చూసిన సాత్వతి, అది మహాద్భుత మనుకుంది. తన కుమారునికి, సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అయిన కృష్ణునివల్ల మరణం తథ్యమని కూడా నిర్ణయించుకుంది. అది కారణంగానే, శ్రీకృష్ణుని ఉద్దేశించి... 'కృష్ణా! వీడు దుర్మార్గుడై నీకు అయిష్టుడు కావచ్చు. అయినా, ఇతడు నీకు బావ. అది కారణంగా ఇతని అపరాధాలను నూరింటి వరకు సహించవలసిందని నేను నిన్ను కోరుతున్నాను' అని విన్నవించుకుంది.

తన కుమారుడు శ్రీకృష్ణునిపట్ల అన్ని తప్పులు చేయబోడన్న అభిప్రాయం ఆ మాతృహృదయంలో జనించి ఉంటుంది. అది కారణంగానే ఆమె అలా కోరి ఉంటుంది.

శ్రీకృష్ణుడు ఆమె హృదయాన్ని అర్థం చేసుకున్నాడు. ఆమె ప్రార్థన నంగీకరించాడు.

కాలక్రమాన, శిశుపాలుడు శ్రీకృష్ణునిపట్ల శత్రుత్వం వహించటం జరిగింది. ఆయనపట్ల అతడు అన్నివిధాలైన అపచారాలూ ఆచరించాడు.

శ్రీకృష్ణుడు, భగదత్తునిమీద దండెత్తి, ప్రాగ్జోతిషపురం వెళ్లిన సమయంలో, శిశుపాలుడు ద్వారావతికి వెళ్లి, ఆ మహానగరాన్ని అగ్నికాహుతి చేయాలని చూశాడు. భోజరాజులు తమ, స్త్రీలతో రైవత మహోత్సవంలో ఉన్న సమయంలో, శిశుపాలుడు వారిని వధించాడు. అలాగే, అతడు, వసుదేవుడు తలపెట్టిన అశ్వమేధ యాగంలో యాగాశ్వాన్ని హరించుకుపోయి యజ్ఞవిఘ్నం చేశాడు. బభ్రువాహనుని భార్యనుఅపహరించుకుపోయి, వివాహంచేసుకున్నాడు. అలాగే ఎన్నో అపచారాలు చేశాడు. అయినా శ్రీకృష్ణుడు, అవన్నీ సహించాడు; కాని వాటినన్నింటినీ లెక్కపెట్టుకుంటూనే ఉన్నాడు.

అంతలో రాజసూయాధ్వరం జరగటం, అక్కడ శిశుపాలుడు, హద్దుమీరి ప్రవర్తించటం జరిగింది. అప్పుడు శ్రీకృష్ణుడు ప్రయోగించిన చక్రాయుధం, సూటిగా వెళ్లి, శిశుపాలుని శిరస్సును ఛేదించింది. ఆ వెంటనే* [115] అతనిలోనుంచి బాహిరిల్లిన ఒక దివ్యతేజం, దానవాంతకుడైన శ్రీకృష్ణునిలో ప్రవేశించింది. ఆవిధంగా...

మధుదైత్యాంతకు మీది మత్సరమునన్ మత్తిల్లి జన్మత్రయా
వధి నేప్రొద్దు దదీయ రూప గుణ దివ్యధ్యానపారీణ ధీ
నిధియౌటన్ శిశుపాల భూవిభుడు దా నిర్ధూత సర్వాఘుడై
విధి రుద్రాదుల కందరానిపదవిన్ వేషించె 'నుర్వీస్థలిన్'

రాజసూయం ఆ విధంగా శిశుపాల సంహారంతో సమాప్తమయింది. అదిచూసిన మహర్షులూ, మహీసురులూ ధర్మరాజును అమితంగా ప్రశంసించారు. అతనికి అండగాఉన్న శ్రీకృష్ణుని పరిపరి విధాల ప్రస్తుతించి, ఆయనవద్ద సెలవు తీసుకుని యథాస్థానాలకు వెళ్ళిపోయినారు.

---

*115 చైద్య దేహోత్థితం జ్యోతి ర్వాసుదేవ ముపావిశత్
పశ్యతాం సర్వభూతానా ముల్కేవ భువి స్వాచ్చ్యుతా.

ఆ తరువాత, యుధిష్ఠిరుని కోరికమీద శ్రీకృష్ణాదులూ మరి కొందరు సన్నిహితులూ, కొంతకాలం ఇంద్రప్రస్థంలోనే ఉండిపోయి నారు. శ్రీకృష్ణుడు, సాంబునీ, మిగిలిన తనకుమారులనూ, మరికొందరు యాదవవీరులనూ ద్వారావతికి పంపించాడు.

## 110. శాల్వభూపతి :

రుక్మిణీ పరిణయ సమయంలో, శ్రీకృష్ణుడు, అనేకమంది రాజు లను ఓడించాడు. అలా ఓడింపబడినవారిలో, శిశుపాలుని స్నేహితుడైన శాల్వుడొకడు. ఆ సమయంలో, అతడు రాజు లందరి సమక్షానా, 'నేను యాదవులను నిర్మూలించేవరకూ నిద్రపోను' అని శపథం చేశాడు.

అలా ప్రతినబట్టిన శాల్వుడు, పశుపతిని ప్రసన్నుని చేసుకునే ఉద్దేశంతో, తీవ్రతపశ్చర్యకు పూనుకున్నాడు. ఆ సమయంలో, అతను ప్రతిరోజూ పిడికెడు దుమ్మునుమాత్రమే తినేవాడు.

శాల్వుని భక్తికి శంకరుడు అమితంగా ఆనందించాడు. అది కారణంగానే, ఆయన అతనికిప్రత్యక్షమై, 'నీకు సంతోషం కలిగించేవరం ఏదో ఒకటి కోరుకోవలసింది' అన్నాడు. అలా తనపట్ల ప్రసన్ను డైన పరమేశ్వరుని ఉద్దేశించి...

'గరుడ గంధర్వ యక్ష రాక్షస సురేంద్ర
వరులచే సాధ్యపడక నా వలయునెడల
నభ్రపథమున దిరిగెడునట్టి మహిత
వాహనము నాకు దయసేయు వరద యీశ!'

అని శాల్వుని అభ్యర్థించాడు.

హరుడు అతనికోరిక ననుసరించి, అతి విశాలమైనదీ, లోహ మయమైనదీ, కామగమనం గలదీ అయిన ఒక విమానాన్ని, మయుని

చేత నిర్మింపచేసి అతనికి ప్రసాదించాడు. దానికి, సౌభకం అనే పేరు పెట్టాడు.

ఆ సౌభక విమానంమీదనే వెళ్ళి, శాల్వుడు, ద్వారావతిపైన దాడి చేశాడు. పురాన్ని ముట్టడించాడు. తనసేనలచేత అక్కడి ఉద్యానవనాలనూ, గోపురాలనూ, ద్వారాలనూ, ప్రాసాదాలనూ పాడు చేయించాడు. ఆ నగరం మీద శరవర్షం కురిపించ సాగాడు.

శాల్వుడలా దాడిచేసిన సమయంలో, శ్రీకృష్ణుడు అక్కడ లేడు; ఇంద్రప్రస్థంనుంచి బయలుదేరి ద్వారావతికి వస్తూఉన్నాడు. అది కారణంగానే, సాత్యకి ప్రభృతుల సహాయంతో, ప్రద్యుమ్నుడు శాల్వునిపైకి వెళ్లాడు.

అప్పుడు సాల్వ ప్రద్యుమ్నులమధ్య జరిగిన యుద్ధం అతితీవ్రంగా ఇరవైఏడు రోజులు సాగింది. ఆ పోరులో ఇరుపక్షాలు అమితంగా క్షీణించిపోయినై. ఆ సమయాన, మార్గమధ్యంలో ఉన్న శ్రీకృష్ణుడు తన సారథి నుద్దేశించి...

'కంటే దారుక దుర్నిమిత్తములనేకంబుల్ మహాఖిలముల్
మింటన్ మేదిని దోచుచున్నయవి నెమ్మిన్ ఖాండవప్రస్థ మే
నుంటం జైద్యహిత క్షితీశ్వరులు మాయోపాయులై మత్పురి
న్గెంటింపం జనుదేరబోలుదురు పోనీ తేరు వేగంబునన్'

అని, తన అభిప్రాయాన్ని తెలియపరుస్తూ ఆదేశించాడు. ఆ తరువాత, అనతికాలంలోనే ద్వారావతిని సమీపించాడు.

అలా ద్వారావతి చేరుకున్న శ్రీకృష్ణుని చూడగానే, యదువీరులకు అమితమైన శక్తి లభించింది. అది కారణంగా వారు విజృంభించారు.

శ్రీకృష్ణుడు కంటబడగానే, అంతవరకూ అత్యుగ్రంగా పోరాడు తున్న శాల్వుని సేనలు కలవరపడసాగినై. అది గ్రహించిన శాల్వుడు, ఆ వెంటనే, తన సౌభక విమానంతోసహా అదృశ్యుడై పోయినాడు.

అంతలో ఒక వార్తాహరు డక్కడకు పరుగుపరుగునవచ్చి, శ్రీకృష్ణునికి మ్రొక్కి, 'ప్రభూ! పాపాత్ముడైన శాల్వుడు మీ తండ్రి గారిని క్రూరంగా బంధించి తీసుకువెళ్లాడు. ఆవిషయాన్ని మీకు నివే దించుకునే నిమిత్తం మీతల్లిగారు నన్నిక్కడికి పంపారు' అని అతి దీనంగా విన్నవించుకున్నాడు.

అది వినగానే శ్రీకృష్ణుడు*1 అమితంగా వ్యాకులపడ్డాడు. తన తండ్రికే అటువంటి దుర్గతి కలిగించిన విధి ఎంతో బలవత్తరమైనదై ఉండాలనుకున్నాడు. ఆ వెంటనే, అదృశ్యుడైన శాల్వుని కోసం నలు దిక్కులా పరికించి చూశాడు.

అలా చూస్తున్న కృష్ణునకు, బంధితుడై ఉన్న వసుదేవుని తన వేపుగా తీసుకువస్తున్న శాల్వుడు, గగనమార్గాన కనిపించాడు. అతణ్ణి చూడగానే శ్రీకృష్ణునకు అంతులేని రోషం కలిగింది.

అది గ్రహించిన శాల్వుడు వికటాట్టహాసం చేశాడు. కత్తి దూశాడు. వసుదేవుని తల నరుకటానికి ఉద్యమించాడు శ్రీకృష్ణు ఉద్దేశించి, 'ఇది, నా స్నేహితుడైన శిశుపాలుడు వరించిన కన్యను అపహరించినదానికి ఫలం' అంటూ కత్తి విసిరాడు.

ఆ మరుక్షణంలోనే, వసుదేవుని శిరం, నెత్తురోడుతూ, శ్రీకృష్ణుని సమీపంలో పడ్డది. అది చూడగానే కృష్ణుడు మూర్ఛితు

---

*116 నిశామ్య విప్రియం కృష్ణో మానుషీం ప్రకృతిం గతః
విమనస్కో ఘృణీ స్నేహాద్ బభాషే ప్రాకృతో యథా.
కథం రామ మసంభ్రాంతం జిత్వాజేయం సురాసురైః
శాల్వే నాల్పీయసా నీతః పితా మే బలవాన్ విధిః.

డైనాడు. కాని వెంటనే మనసును దిట్టపరచుకుని, సురాసురులకు కూడా అజేయుడైన బలరాముని రక్షణలో ఉన్న తన తండ్రిని శాల్వుడు బంధించటం, తన్నుకన్నవాడు ఆవిధంగా దుర్గతిపాలు కావటం అసంభవమని భావించాడు. అదంతా శాల్వుని అసుర మాయమాత్రమే అయిఉండాలని నిర్ణయించుకున్నాడు. అంతలోనే, అంతకుముందు తనవద్దకు వచ్చిన వార్తాహరుడూ, తన సముఖాన పడ్డ ఖండితశిరమూ అతివిచిత్రంగా మాయమైపోవటం గ్రహించాడు. ఆవెంటనే, తనగదను గిరగిరత్రిప్పి, సౌభకంపైకి విసరివేశాడు. ఆ తాకిడికి ఆ విమానం చూర్ణమైపోయింది.

సౌభక మావిధంగా కూలిపోగానే, శాల్వుని, అంతవరకూ ఆశ్రయించిఉన్న మాయాబలంకాస్తా హరించిపోయింది. ఆ వెంటనే, శ్రీకృష్ణుడు, అత డంతకుపూర్వం ఏ చేతితో తన తండ్రిని నరుకుతున్నట్టు భ్రమకలిగించాడో ఆచేతిని ఖండించివేశాడు. ఆపైన తన చక్రాయుధాన్ని వదలి, మణిమయాంచిత కిరీటాన్ని ధరించిన అతని శిరస్సును ఛేదించాడు.

## 111 ... దంతవక్త్రుడు :

తన మిత్రులయిన జరాసంధ, శిశుపాల, శాల్వభూపతుల మరణానికి కారకుడైన శ్రీకృష్ణుని సాధించి తీరాలని కరూశ దేశాధిపతి అయిన దంతవక్త్రుడు నిర్ణయించుకున్నాడు. అది కారణంగానే, అతడు శ్రీకృష్ణుని మాహాత్మ్యాన్నిగాని, ఆయనతో తనకున్న బాంధవ్యాన్నిగాని పాటించకుండా, ఆయన్ని అమితంగా దూషిస్తూ, ఒక గద తీసుకుని ఆయనతో తలపడ్డాడు. అదిచూసి శ్రీకృష్ణుడు కౌమోదకి అనే తన గదతో, దంతవక్త్రుని హృదయంమీద కొట్టాడు. దాంతో, దంతవక్త్రుడు నెత్తురు కక్కుకుంటూ నేలకూలాడు. ఆవెంటనే

అతనినుంచి ఒక తేజోకిరణం లేచి, శ్రీకృష్ణునిలో లీనమైపోయింది. అది గ్రహించి...*117

నర ముని యోగి సురాసుర
గరు డోరగ సిద్ధ సాధ్య గంధర్వ నభ
శ్చర కిన్నర కింపురుషులు
హరిమహిమ నుతించి రద్భుతానందమునన్ .

శాపగ్రస్తులైన జయవిజయులు మూడవమారు శిశుపాల దంతవక్త్రులై జన్మించారు. వారిద్దరూ పినతల్లి పెదతల్లి బిడ్డలు; శ్రీకృష్ణునకు మేనబావలు.

దంతవక్త్రుడు కరూష దేశాధిపతి అయిన వృద్ధశర్మ కుమారుడు. అతనితల్లి వసుదేవుని సోదరి అయిన శ్రుతదేవ.

శిశుపాలుని మాదిరిగానే దంతవక్త్రుడుకూడా ప్రద్యుమ్నుని ఎదిరించి పరాజితుడైనాడు. తిరిగి యుధిష్ఠిర రాజసూయంలోకూడా, శిశుపాలునిమాదిరిగానే శ్రీకృష్ణుని ధిక్కరించి, అనంతరం అతనితో యుద్ధంచేసి, అతని చేతులో మరణించి శాపవిముక్తి పొందాడు.

తన అన్నగారైన దంతవక్త్రుడు అలా సంహరింపబడటం చూసి, విదూరథుడు, అమితాగ్రహంతో, శ్రీకృష్ణుని మీదికి ఉరికాడు. కాని, మరుక్షణంలోనే ఆయన చక్రాయుధానికి బలిఅయినాడు.

ఆ విధంగా, శాల్వ దంతవక్త్ర విదూరథులను సంహరించి, శ్రీకృష్ణుడు, జయజయధ్వానాలమధ్య, ద్వారావతిలో ప్రవేశించటం జరిగింది.

---

*117 ఏవం సౌభం చ శాల్వం చ దన్తవక్త్రం సహానుజం
హత్వా దుర్విషహో న్యైరీడితః సురమానవైః.

112 . . . పాంచాలి :

యుధిష్ఠిరుడు నిర్వహించిన రాజసూయాధ్వర వైభవం, దుర్యోధనునిలో, అమితమైన ఈర్ష్యాసూయలను కలిగించింది. పాండు పుత్రులదైన మయ సభా సౌందర్యం, అతని అల్పత్వాన్ని అతనికి అనుక్షణం స్ఫురణకు తెస్తూ ఉంది; అతనిహృదయాన్ని అవమానద వానలంలో భస్మం చేస్తూఉంది.

దానికితోడు, అతడు మయ సభా సౌందర్యాన్ని తిలకిస్తూ ఉన్న సమయంలో, అతనికి అంతులేని అవమానంకూడా కలిగింది.

ఒకరోజున, దుర్యోధనుడు, ఆ సభను పరికిస్తూ, ఇంద్రనీల మణులతో విరచింపబడ్డ స్థలాన్ని జలాశయంగా భావించటం జరిగింది. అది కారణంగా, అతడు, కట్టుకున్న పుట్టాన్ని, పైకి పట్టుకుని, మెల్ల మెల్లగా ముందుకు సాగాడు. అది చూసిన యుధిష్ఠిరభటులు తమలో తాము నవ్వుకున్నారు. అది దుర్యోధనుడు గ్రహించాడు.

మరొకచోట, స్ఫటిక కమలాలతో కూర్చబడ్డ జలాశయం, అతనికి సమస్థలంగా కనిపించింది. అత డటు పోతూ అందులోపడ్డాడు; అతని బట్టలన్నీ తడిసి పోయినై. అది గ్రహించిన ధర్మరాజు, అతణ్ణి సమీపించి, సానుభూతితో పలుకరించి, సరిక్రొత్త వలువలిచ్చి ధరింప చేశాడు. అది తనకు జరిగిన ఘోరావమానంగా దుర్యోధనుడు భావించాడు.

అలాగే, మరొక స్థలంలో, మూసి ఉన్న ద్వారం తెరచిఉన్నట్టు అతనికి తోచింది. అతడు అందులో ప్రవేశింపబోయి, తలుపు తలకు తగలటం వల్ల గాయపడ్డాడు.

ఆ వెంటనే, మరొకచోట, తెరచిఉన్న ద్వారం మూసి ఉన్నదని భావించి, తెరవబోయి, ముందుకు పడ్డాడు. పంచ పాళిలోఉన్న ద్రౌపది, సోరణగండ్ల ద్వారా అది చూసింది. చూసి, పకపకలాడింది,

అది దుర్యోధనుడు గ్రహించాడు. అతడు అంతవరకూ అనుభవిస్తున్న అవమానానికి, అది పరమావధిగా అతనికి తోచింది. ఆపైన, అతడక్కడ నిలబడలేకపోయినాడు; ధర్మజునివద్ద సెలవు తీసుకుని, ఆవెంటనే హస్తినాపురం చేరుకున్నాడు.

పాండుపుత్రులమీదా, పాంచాలిమీదా, దుర్యోధనునకున్న ద్వేషం, పై సంఘటనలతో పరాకాష్టపొందింది. వారిని ఎప్పుడు ఏ విధంగా పరాభవించటమా అన్న ఆలోచనలతో, అతడు, దివారాత్రాలు గడుపసాగాడు.

ఆ ఆలోచనా ఫలితంగానే, అతడొక నూత్న సభాభవనాన్ని నిర్మించటం, దాన్ని చూడటానికనే మిషతో యుధిష్ఠిరాదులను ఆహ్వానించటం, వారు వచ్చి, ఆ భవన సౌందర్యాన్ని వీక్షించి, ఆనందిస్తూఉన్న సమయంలో, సుహృద్ద్యూతం పేరట ఒక మాయా ద్యూతాన్ని ఏర్పరచటం, అందులో అతని మామ అయిన శకుని సహాయంతో, యుధిష్ఠిరుని ఓడించటం జరిగింది.

ద్యూతప్రియుడైన యుధిష్ఠిరుడు, ముందు తన సంపదలను పణంగా ఒడ్డాడు. ఆపైన రాజ్యాన్ని ఒడ్డాడు. అటుమీదట తనతమ్ము లందరినీకూడా ఒడ్డాడు. ఆయన ఎన్ని పందాలు వేసినా, మాయా ద్యూత నిపుణుడైన శకుని, దుర్యోధనుని పక్షాన అన్నిటినీ గెలుచుకోవటమే సంభవించింది. దుర్యోధనుడు కోరిందికూడా అదే.

అతడప్పుడు, తనకు ఓడిపోయిన పాండుపుత్రులు తన బానిసలనుకున్నాడు. వారిని పరాభవించటానికి మంచి అవకాశం లభించిందనుకున్నాడు. ఆ అభిప్రాయంతోనే, పాంచాలిని, సభాస్థలికి రప్పించాడు. ఆమె భర్తల అధోగతినీ, ఆమె నిస్సహాయతనూ ఆమెకు స్ఫురింపచేస్తూ, ఆ మహాసభలో, పంచేంద్రులవంటి పాండుపుత్రుల కళ్లెదుట, కురువృద్ధుల సమక్షాన, ఆమెను అవమాన పరచాలనుకున్నాడు. ఆమె కట్టుపుట్టాన్ని దుశ్శాసనునిచేత ఒలిపించటానికి ప్లానుకున్నాడు.

ద్రౌపది, పరిస్థితి నంతనూ అవగాహన చేసుకుంది. తన కళ్ల ఎదుట ఉన్నవా రెవరూ, తన్ను కాచి రక్షించలేరని నిర్ణయించుకుంది. అది కారణంగానే, అమితమైన ఆవేదనతో, అఖిలలోకాధారుడూ, రమానాధుడూ, భక్తవత్సలుడూ, వ్రజేశ్వరుడూ, ఆర్తిహారుడూ, ద్వారకావాసుడూ అయిన శ్రీకృష్ణుని ఆశ్రయించింది. ఆశ్రయించి, "తండ్రీ! కౌరవులు కల్పించిన పరాభవ మహార్ణవంలో నేను మునిగిపోకుండా చూడవలసింది. అందులోనుంచి నన్ను ఉద్ధరించవలసింది. అని, ప్రార్థిస్తూ, ఆయనమీది పరిపూర్ణవిశ్వాసంతో, ముఖాన్ని చేతులతోకప్పుకుని, శోకమూర్తి మాదిరి నిలబడిపోయింది.

అంతలో, దుశ్శాసను డామెను సమీపించాడు. సమీపించి, వికటాట్టహాసం చేస్తూ, ఏ విధమైన పాపభీతీ లేకుండా, ఆమె కట్టుపుట్టాన్ని లాగేశాడు.

పాంచాలికైన పరాభవాన్ని వారించగలవాడు ఆ పరాత్పరుడొక్కడే అన్న అభిప్రాయంతో, భీష్మాది కురువృద్ధులు, ఆయన్నే స్మరించుకుంటూ, 'పరమసాధ్వి అయిన పాంచాలి పరాభవంపాలు కాకుండా చూడవలసింది, అని ప్రార్థించ సాగారు. ధార్తరాష్ట్రులు మాత్రం, ధర్మరాజాదుల కీర్తి శిఖరం కూలిపోయినట్లే భావించారు; ఆనందతాండవం చేయసాగారు.

అంతలో, మహాద్భుతమైన సంఘటన ఒకటి*116జరిగింది. దుష్టుడైన దుశ్శాసనుడు, ద్రౌపది మీది వలువను ఒలిచాడు. ఓ ప్రక్కకు

*116 కృష్ణం చ విష్ణుం చ హరిం నరం చ
త్రాణాయ విక్రోశతి యాజ్ఞసేనీ
తతస్తు ధర్మోఽన్తరితో మహాత్మా
సమావృణోద్ వై వివిధైః సువస్త్రైః.
ఆకృష్యమాణే వసనే ద్రౌపద్యాస్తు విశాంపతే
తద్రూపమపరం వస్త్రం ప్రాదురాసీ దనేకశః.
నానారాగ విరాగాణి వసనాన్యథ వై ప్రభో
ప్రాదుర్భవంతి శతశో ధర్మస్య పరిపాలనాత్.
తతో హలహలా శబ్దస్తత్రాసీద్ ఘోరదర్శనః
తదద్భుత తమం లోకో వీక్ష్య సర్వే మహీభృతః.

విసరివేశాడు. వికటాట్టహాసంచేస్తూ, ఆమెవంక చూశాడు. కాని, అతడు భావించినట్టు, ఆమె వివస్త్ర కాలేదు. ఆమె కట్టుకున్న చీర కట్టుకున్నట్టే ఉంది. అది గ్రహించి, అతడు ఆశ్చర్యచకితుడైనాడు.

తిరిగి ఆచీరనుకూడా ఒలిచాడు. దాన్ని చేత్తోపట్టుకునే, ఆమె వంక చూశాడు. కాని, ఆమె యథాప్రకారంగానే ఉంది. ఆమెమీది వలువ తొలిగినట్టుకూడా లేదు. ఆమె కన్నులు మూసుకుని ఉంది. 'కృష్ణా! కృష్ణా...!! శ్రీహరీ...!!!' అని అమితమైన ఆవేదనతో ఆక్రందిస్తూ ఉంది.

అది చూసిన దుశ్శాసనుడు, అమితావేశంతో, చేతులోని చీరెను ఓ ప్రక్కకు విసరివేసి, ఆమెమీది చీరను తిరిగి లాగాడు. అప్పటికీ ఆమె వివస్త్ర కాలేదు. అది గ్రహించిన దుర్యోధనాదులు తమ కళ్లను తామే నమ్మలేకపోయినారు. అంతలో, సభాభవనమంతటా అదో విధమైన కలకలం ప్రతిధ్వనించింది.

ఆ తరువాత, దుశ్శాసనుడు, ద్రౌపదిమీద కనిపించిన చీరలన్నింటినీ లాగివేయసాగాడు. అత డెంతగా అలా లాగివేసినా, అతని ఆశయం మాత్రం సిద్ధించలేదు. అతడు ఒలిచిన చీరలు కుప్పలుకుప్పలు కాజొచ్చినై. అది చూపరులకు మహాద్భుతమనిపించింది. కాని, పాంచాలి, ఆ సమయంలో ఆ సభాసదుల దిక్కు కన్నెత్తిఅయినా లేదు. కలవరపడలేదు. పరమాత్ముని పట్ల తనకున్న పరిపూర్ణ విశ్వాసానికి పరమచిహ్నంగా ఆమె, అలాగే నిలబడి ఉంది.

భీష్మాది కురువృద్ధులు అది గ్రహించారు. గ్రహించి, ఏక కంఠంతో, "ఆపద్బాంధవా! భక్తవత్సలా!" అంటూ నినాదాలు చేయసాగారు.

ఆ సమయంలో. ధర్మరాజాదులు పొందిన దివ్యానుభూతికీ, దుర్యోధనాదులు అనుభవించిన అవమానానికీ, అవధిలేకుండా

పోయింది. అది గ్రహించిన పూజ్యులు, అదంతా శ్రీకృష్ణభగవానుని లీలావిశేషంగా భావించారు; పరమానందా న్ననుభవించారు.

ఆ విధంగా, శ్రీకృష్ణుడు, మరొక మహాద్భుత లీలను ప్రదర్శించటం సంభవించింది; తన్నే ఆశ్రయించిన పాంచాలి, పరాభవంపాలు కాకుండా చేయటం జరిగింది.

## 113. బాల్యమిత్రుడు కుచేలుడు :

పూర్వం, జితేంద్రియుడూ, ప్రశాంతచిత్తుడూ, బ్రహ్మవిదుడూ, ధర్మవత్సలుడూ అయిన ఒక బ్రాహ్మణు డుండేవాడు. ఆయన పేరు కుచేలుడు. ఆయనకు పరమ పతివ్రత అయిన ఒక భార్య ఉండేది.

ఆ దంపతులు అమిత సంతానవంతులు. అత్యంత దరిద్రులు. వారు అనుభవించని దారిద్ర్యక్లేశమంటూ లేదు. వారి సంతానం, వరుసగా కొన్నిరోజులపాటు, త్రాగటానికి గంజికూడా లేకుండా, ఆకటి మంటతో అటమటించిపోయేవారు. వారి బాధలు చూడలేక, ఆ తల్లి క్రుంగి కృశించిపోయేది. ఆ పరిస్థితిలో కూడా, మానధనుడైన కుచేలుడు, ఇతరుల నెవ్వరినీ ఏమీ అడిగేవాడు కాదు. ఎప్పు డేది లభిస్తే అది, అది అత్యల్పమైనదయినా, మహాఘనంగా భావించి, దానితోనే కాలం వెళ్లదీసుకునేవాడు.

ఆ కుచేలుడు, సాందీపనివద్ద విద్యాభ్యాసం చేసేసమయంలో, శ్రీకృష్ణుడు అతని సహాధ్యాయిగా ఉండేవాడు. సహాధ్యాయిగా మాత్రమే కాదు; అతని ప్రాణానికి ప్రాణంగాకూడా వ్యవహరించేవాడు. అతనిపట్ల అత్యంతాభిమానంతో ప్రవర్తించేవాడు.

అత్యద్భుతమైన శ్రీకృష్ణుని సాహసచర్యలు విన్నప్పుడల్లా, కుచేలుడు ఉప్పొంగిపోయేవాడు. తన కా మహానుభావునితో లభించిన సాహచర్య భాగ్యాన్నిగురించి తన భార్యకు వివరిస్తూఉండేవాడు.

'శ్రీకృష్ణుడు సాక్షాత్పరమేశ్వరుడే'నని తన పిల్లలకు చెబుతూ ఉండే వాడు. అంతేకాదు:

'శ్రీకృష్ణుడు ఆర్తత్రాణ పరాయణుడు. ఆయన్ని నమ్మి భజించేవారికి ఆర్తి అనేదే ఉండదు; ఆపదలనేవి ఎన్నడూ సంభవించవు. విధివశాత్తు, ఒకవేళ సంభవించినా, ఆయన కటాక్షవీక్షణ ప్రసారం మూలంగా, అవన్నీ ఇట్టే తొలగిపోతై. ఆపద్బాంధవుడన్న బిరుదు, ఆయనపట్ల సార్థకమయింది. యథార్థానికి, ఆయన నా బాల్య సఖుడుకావటం నా అదృష్టం;' అనికూడా తెలియపరచుకుంటూ ఉండేవాడు. భార్యకూ పిల్లలకూ ఆయన దివ్యలీలలను అనవరతం అభివర్ణించి చెప్పి, ఆనందిస్తూఉండేవాడు.

అది కారణంగా, అతని భార్య, ఒకసారి అతణ్ణి సమీపించి, తమ సంతానం అప్పుడు అనుభవిస్తున్న దారిద్ర్యబాధను, అతనికి, దీనాతిదీనంగా విశదపరచుకుంది. ఆ సందర్భంలోనే...

'పిల్లలు ఆకటిమంటతో అటమటించి పోతున్నారు. ఆ పసి కూనల ప్రాణాన్ని నిలబెట్టడానికి, పట్టెడు మెతుకులు కూడా పుట్టని దురవస్థ నాకు సంభవించింది. గంజికూడా కరవైన ఆ పసిప్రాణాలను చూసినప్పుడల్లా, నా గుండె చెరువై పోతూ ఉంటుంది. కష్టాలను అనుభవింప చేయటానికే నేను వారిని కన్నానా అనిపిస్తూఉంటుంది.

అదంతా వివరించటం వల్ల మిమ్మల్ని కూడా కష్టపెట్టడ మవుతుందని నాకు తెలుసు. కాని, ఉట్టి దౌర్భాగ్యురాలిని. అది కారణంగానే, ఇప్పుడు ఆ పాపానికి కూడా పాల్పడుతున్నాను. యథార్థానికి, మన కష్టాలనుంచి మనల నుద్ధరించగలవాడు, ద్వారకావాసుడైన ఆ శ్రీకృష్ణుడు తప్ప మరొకడు లేడు. ఆయన్ని ఆశ్రయించిన వారిని ఆయనే ఉద్ధరించాలి; రక్షించి తీరాలి. నిజానికి, ఆయన తలుచుకుంటే కానిదంటూ యేమీ ఉండదు.

శ్రీకృష్ణుడు మీకు చిన్ననాటి స్నేహితు డని మీ రెన్నిసార్లో చెప్పారు. ఆయన, భక్తవత్సలు డని కూడా మీరు పదేపదే ప్రశంసిస్తూ ఉంటారు. మీకు స్నేహితుడూ, దయాపయోనిధీ, ఆర్త శరణ్యుడూ అయిన ఆ ద్వారకావాసుని, మీరింతవరకూ ఒక్కసారికూడా దర్శించుకు రాలేదు. అది ఆయనపట్ల మన మాచరించిన అపచారమేమో అని కూడా, నాకు అప్పుడప్పుడు అనిపిస్తూ ఉంటుంది. ఆయన దర్శనం చేసుకున్న పక్షంలో, మనకష్టాలు తొలగిపోగలవన్న దృఢాభిప్రాయం కూడా నాకు ఉంది. యథార్థానికి...

కలలోనం దను మున్నెఱుంగని మహాకష్టాత్ముడైనట్టి దు
ర్బలు డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులో
దలప న్నంతన మెచ్చి యార్తిహరుడై తన్నైన నిచ్చున్ సుని
శ్చల భక్తిన్ భజియించువారికిడడే సంపద్విశేషోన్నతుల్

అనికూడా నివేదించుకుంది.

తన ఇల్లాలి పలుకులను కుచేలుడు కాదనలేకపోయినాడు. ఆమె ఆశించిన అదృష్టాన్ని అభిలషించి కాకపోయినా, సంసారసాగరాన్ని తరించటానికయినా ఆ మహానుభావుని దర్శించటం అవసరమని ఆయన భావించాడు. కాని భగవత్సందర్శనానికి, రిక్తహస్తాలతో వెళ్లటం ఉచితంకాదు. భగవానుడైన శ్రీకృష్ణునకు కానికగా ఇవ్వదగ్గది తమదగ్గర ఏమీలేదు. ఆ విషయాన్నే, ఆయన, తన భార్యకు తెలుపుకున్నాడు. ఆ పరిస్థితి నర్థం చేసుకుని, ఆమె అమితంగా విచారపడ్డది. కాని, ఆ వెంటనే, పొరుగున ఉన్న ఒక ఇల్లాలి నడిగి నాలుగు గుప్పెళ్ల అటుకులు ఆమెవద్దనుంచి అప్పుగా తీసుకువచ్చింది. వాటిని ఒక గుడ్డ పేలికలో మూటకట్టి, శ్రీకృష్ణునకు సమర్పించుకునే నిమిత్తం తన పెనిమిటికి అందించింది. అది తీసుకుని, కుచేలుడు ద్వారావతికీ బయలుదేరాడు.

ద్వారావతి సమీపించగానే, శ్రీకృష్ణుని, యెక్కడ యెలా కలుసుకోవటమా అన్న ఆలోచన కుచేలునకు కలిగింది. అంతలో అతని కొక విప్రు డెదురైనాడు. ఆయన, కుచేలుని చూసి, "స్వామీ! మీ రెవరి యింటికి వచ్చారు! అని గౌరవపూర్వకంగా పలుకరించాడు. ఆయనకు సమాధానంగా, కుచేలుడు...

"ఇందీవర శ్యాము వందిత సుత్రాము
గరుణాలవాలు భాసుర కపోలు
గౌస్తుభాలంకారు గామిత మందారు
సురుచిర లావణ్యు సుర శరణ్యు
హర్యక్ష నిభమధ్యు నఖిల లోకారాధ్యు
ఘన చక్రహస్తు జగ త్ప్రశస్తు
ఖగ కులాధిప యాను గౌశేయ పరిధాను
బన్నగ శయను నబ్జాత నయను
మకర కుండల సద్భాషు మంజు భాషు
నిరుప మాకారు దుగ్ధ సాగర విహారు
భూరి గుణ సాంద్రు యదుకులాంభోధి చంద్రు
'జిష్ణునిం గృష్ణు జూడవచ్చితి మహాత్మ'!
అని వినయపూర్వకంగా విన్నవించుకున్నాడు.

అది విన్న విప్రుడు, విరగబడి నవ్వాడు. కుచేలుని ఒక వెర్రి వానిగా భావించాడు. కాని, ఆయనపట్ల సానుభూతి చూపుతూ...

"అయ్యా! ఆయన్ని దర్శించటం అందరికీ సాధ్యమయే పని కాదు. ఆయనకు పదహారువేల ఎనిమిది మంది భార్య లున్నారు. ఆయన ఎప్పు డెక్కడ ఉండేదీ ఎవరికీ తెలియదు. అలా అన్నా మని, ఆయన ఎప్పటి కప్పుడు, ఒకే ఒకచోట ఉంటా డనుకోవటం కూడా భ్రమ కాకపోదు. ఒకేఒక సమయంలో, ఆయన, అనేకచోట్ల ఆడుతూ

పాడుతూ ఉండటం కూడా కద్దు. అదంతా, ఆ మహానుభావుని చిద్విలాసం."

అని చెప్పాడు. అది విన్న కుచేలుడు ఆనందబాష్పాలు రాల్చాడు. శ్రీకృష్ణుడు తన సమక్షాన కూడా ఉన్నట్టే భావించాడు, భక్తిపూర్వకంగా, చేతులెత్తి నమస్కరించాడు.

కుచేలుడు ఆవిధంగా నగరంలో ప్రవేశించటం, అప్పుడు రుక్మిణీదేవి మందిరంలో ఉన్న శ్రీకృష్ణుడు గ్రహించాడు. గ్రహించి*117 ఆయనకు ఎదురు వెళ్ళి స్వాగతం చెప్పాడు. ఆలింగనం చేసుకున్నాడు.

ప్రాణస్నేహితుడైన అతణ్ణి కౌగిలించుకోగానే, పరమానంద స్వరూపుడైన ఆ మహానుభావుని కళ్ళుకూడా చెమ్మగిల్లినై. ఆయన ఆనందాశ్రులు రాల్చాడు. అనంతరం ఆయన్ని తన మందిరంలోకి తీసుకువెళ్ళి, ఆయన కాళ్ళు కడిగి, ఆ జలాన్ని శిరస్సున చల్లుకున్నాడు. ఆ తరువాత, ఆయన్ని తనతోపాటు, తనపాన్పుమీదనే కూర్చోబెట్టుకుని, ఆయన శరీర మంతటా చల్లని మైపూతలు పూశాడు. ఆయనకు అగరువత్తులతో ధూపం వేశాడు. హారతి నిచ్చాడు. పరిమళద్రవ్యాలతో కూడిన తాంబూలం సమర్పించుకున్నాడు.

---

*117 తం విలోక్యాచ్యుతో దూరాత్ ప్రియా పర్యంక మాస్థితః
సహసోత్థాయ చాభ్యేత్య దోర్భ్యాం పర్యగ్రహీన్ముదా.
సఖ్యుః ప్రియస్య విప్రర్షే రంగ సంగాతి నిర్వృతః
ప్రీతో వ్యముంచ దబ్బిందూన్ నేత్రాభ్యాం పుష్కరేక్షణః.
అథోపవేశ్య పర్యంకే స్వయం సఖ్యుః సమర్హణం
ఉపహృత్యావని జ్యాస్య పాదౌ పాదావనే జనీః.
అగ్రహీచ్ఛిరసా (రాజన్) భగవా న్లోక పావనః
వ్యలింపద్ దివ్యగంధేన చందనాగురు కుంకుమైః.
ధూపైః సురభిభిర్మిత్రం ప్రదీపావలిభి ర్ముదా
అర్చిత్వా ఽఽ వేద్య తాంబూలం గాం చ స్వాగత మబ్రవీత్.

అలా శ్రీకృష్ణుని సరసను కూర్చున్న కుచేలునికి అంతఃపుర పరిచారిక లందరూ అమిత గౌరవం చూపారు. రుక్మిణీదేవి స్వయంగా ఆయనకు వింజామర వీచింది. అదంతా చూసిన శుద్ధాంత కాంతలు...

'ఏమి తపంబు సేసె నొకొ యీ ధరణీ దివిజోత్తముండు తొల్
బాముస యోగి విస్ఫుర దుపాస్యకుడై తనరారు నీ జగ
త్స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించి యున్నవా
డీ మహనీయమూర్తి కెనయే ముని పుంగవు లెంత వారలున్'

అని కుచేలుని మాహాత్మ్యానికి, తమలో తాము అబ్బురపడసాగారు.

కుచేలుని సర్వోత్తమ విధానంలో పూజించిన తరువాత, శ్రీకృష్ణుడు, అతని కుశల మడిగాడు. చిన్ననాటి ముచ్చట లెన్నో అతని స్ఫురణకు తీసుకువచ్చి అతనికి ఆనందం కలిగించాడు. ఆ సందర్భం లోనే*[118].

---

*118 అపి నః స్మర్యతే బ్రహ్మన్ వృత్తం నివసతాం గురౌ
గురుదారైః చోదితా నా మింధనానయనే క్వచిత్.
ప్రవిష్టానాం మహారణ్య మపర్తౌ సుమహద్ ద్విజ
వాతవర్షమభూత్ తీవ్రం నిష్ఠురాః స్తనయిత్నవః.
సూర్యశ్చాస్తం గతస్తావత్ తమసా చా వృతా దిశః
నిమ్నం కూలం జలమయం న ప్రాజ్ఞాయత కించన.
వయం భృశం తత్ర మహానిలాంబుభి
ర్నిహన్యమానా ముహురంబు సంప్లవే
దిశో౽విదంతో౽ థ పరస్పరం వనే
గృహీత హస్తాః పరిబభ్రి మాతురాః.
ఏత ద్విదిత్వా ఉదితే రవౌ సాందీపని ర్గురుః
అన్వేష మాణో నః శిష్యా నాచార్యో౽ పశ్య ద్దాతురాన్.
ఇత్థం విధా న్యనేకాని వసతాం గురు వేశ్మసు
గురో రనుగ్రహేణైవ పుమాన్ పూర్ణః ప్రశాంతయే.

"మనం గురుకుల వాసం చేస్తున్న రోజుల్లో, ఒకసారి, సమిధల కోసం అడవికి వెళ్లాము. ఆ సమయంలో ఒక పెద్ద గాలివాన వచ్చింది. ఉరుములతో, మెరుములతో, ఆ వన మంతా అతి భయంకర మైనదిగా తయారయింది. అంతలో, సూర్యు డస్తమించటం, ఆ ప్రదేశ మంతా అంధకార బంధుర మైపోవటం జరిగింది. వనమంతా జలమయం కావటం వల్ల, మిట్టపల్లాలు తెలుసుకోలేక మన మెంతో బాధపడ్డాము. కడవ పోతగా వర్షం కురుస్తూ ఉండటం వల్లా, పెనుగాలి దానికి తోడు కావటం వల్లా, మనం, దిక్కు తోచక, ఆ రాత్రంతా, ఆ వనాంతరంలో తిరిగాము. ఎంతసేపు అలా తిరిగినా, మనం మాత్రం విడిపోకుండా, చేయీ చేయీ కలుపుకుని ఉండటం జరిగింది.

ఆ రాత్రంతా అలా గడచిపోవటం, మన మా గాలివానలో ఏమైనామో అన్న భయంతో, మన గురుదేవుడు, సాందీపని, మన కోసం వెదకి వెదకి ఒకచోట మనల్ని కలుసుకోవటం, మనం తనకోసం పడ్డపాట్లు గ్రహించి, జాలిపడి, మనం ఆయనవద్ద నేర్చుకున్న విద్య లన్నీ మన మనసులో ఎప్పుడూ నవనవోన్మేషంగా ఉండేటట్టూ, మన వాంఛితార్థా లన్నీ తీరేటట్టూ మనకు వర మివ్వటం మొదలైన ఘట్టాలు నువ్వుకూడా మరచి ఉండవనే అనుకుంటాను. నిజానికి, ఆ రోజులు ఎంత సంతోషంగా గడచిపోయినై! అవి తలచుకుంటే ఇప్పుడు కలిగే ఆనందానికి అవధి అనేది ఉండదు. అదంతా గురుదేవుని దయ; అంతే"

అంటూ, పూర్వగాథ లెన్నింటినో వివరిస్తూ, మధుర స్మృతులను కలిగిస్తూ, అతనితోపాటు తనుకూడా ఆనందా న్ననుభవించసాగాడు. అంతేకాదు.

'నిన్ను చూస్తుంటే, నువ్వు ప్రపంచం పట్ల పరమ విరక్తి భావంతో ఉన్నా వనిపిస్తోంది. అది, యథార్థానికి సంతోషించ వలసిన విషయమే.

ఉత్తము లయినవారు, లోక సంగ్రహార్థం విధ్యుక్త కర్మ లన్నింటినీ ఆచరిస్తూనే ఉంటారు; కాని, కామ మోహితులు మాత్రం కారు. నువ్వుకూడా, ఆ విధంగానే, శీలవతి అయిన భార్యతో, గృహస్థ ధర్మాన్ని అవలంబిస్తూ, ప్రకృతి సంబంధాలకు దూరంగా, భవ్యనిష్టతో వ్యవహరిస్తున్నావనే నేను భావిస్తున్నాను'

అనికూడా అన్నాడు. ఆ తరువాత, అతణ్ణి ఉద్దేశించి, ఇంతకూ నాకేం తీసుకు వచ్చావు ?' అని ప్రేమపూర్వకంగా, అమాయకుని మాదిరి ప్రశ్నించాడు.

ఆ పలుకులు విన్న కుచేలుడు, అమితమైన లజ్జతో తలవంచు కున్నాడు. 'మహానుభావుడైన మాధవునకు కానికగా అటుకుల నెలా అర్పించుకునేది ?' అని అతను తనలో తాను బాధపడసాగాడు.

శ్రీకృష్ణుడు అది గ్రహించాడు. గ్రహించి, అతని కొంగునఉన్న అటుకులమూటను దొంగమాదిరి విప్పసాగాడు. విప్పుతూనే...

"ప్రేమతో తెచ్చిన పిడికెడు అటుకుల నయినా నేను సంతోషంతో స్వీకరిస్తాను. నాకు కావలసింది అభిమానంగాని, ఆడంబరం కాదు. నా మీది ప్రేమతో ఎవ రేమిచ్చినా నేను పరమానందం పొందుతాను. అది అల్పాతి అల్పమైన పదార్థమైనా, అదే పదివేలుగా భావిస్తాను. దుష్టాత్ములైనవారు, నా మెప్పును పొందేనిమిత్తం, అప్పుడప్పుడు హేమరాసులనుకూడా అర్పిస్తారు. కాని, అది నాకు ఆనందం కలిగించదు"

అని తన హృదయాన్ని తెలియపరచుకున్నాడు. ఆ అటుకు లలోనుంచి ఒక గుప్పెడు తీసుకుని*[119] 'ఈ నా స్నేహితునికి సంపదల

---

*119 పత్న్యాః పతివ్రతాయాస్తు సఖా ప్రియచికీర్షయా
ప్రాప్తో మామస్య దాస్యామి సంపదోఽమర్త్య దుర్లభాః.

మీద ఏ విధమైన అపేక్షా లేదు. కాని, ఈనాడు, పరమ పతివ్రతఅయిన తన భార్యను సంతృప్తి పరచే ఉద్దేశంతో, తన బిడ్డలదైన దారిద్ర్యబాధను తొలగించుకునే నిమిత్తం, ఇలా నా వద్దకువచ్చాడు. ఇతని కోరికను తీర్చటం నా ధర్మం. అందుకనే, దేవతలకుకూడా పొందరాని భోగాలు ఇతణ్ణి ఆశ్రయించాలని నేను కోరుతున్నాను'; అనుకుని, వాటిని ఆర గించాడు. అది గ్రహించిన రుక్మిణీదేవి కుచేలునివంక ఆదరపూర్వకంగా చూసింది.

ఆ వెంటనే, శ్రీకృష్ణుడు, మరొక గుప్పెడు అటుకులను తీసు కున్నాడు. అదిచూసి రుక్మిణీదేవి, ఆయన చేయి పట్టుకుని...

'సొంపారగ నితనికి బహు
సంపద లందింప నివియ చాలును నిక భ
క్షింపగ వలవదు త్రిజగ
త్సంపత్కర దేవదేవ సర్వాత్మ హరీ !'

అని ఆయన్ని వారించింది. ఆమె పలుకులు విని, శ్రీకృష్ణుడు మంద హాసం చేశాడు.

కుచేలుడు ఆరాత్రికి అక్కడే ఉండి, మర్నాడు ఉదయాన శ్రీకృష్ణునివద్ద సెలవుతీసుకుని, గృహోన్ముఖుడై బయలుదేరాడు. అలా వెడుతూ...

'నా పుణ్య మరయ నెట్టిదొ
యా పుణ్యనిధిం బ్రశాంతు నచ్యుతు నఖిల
వ్యాపకు బ్రహ్మణ్యుని జి
ద్రూపకు బురుషోత్తముని బరుం గనుగొంటిన్'

అని, నందనందనుని సందర్శించిన ఆనందంతో, తనలో తా నను కున్నాడు. అంతేకాదు.

'సర్వేశ్వరుడైన శ్రీకృష్ణుడు, నిరుపేదనైన నన్ను ఆదరించి, ఆలింగనం చేసుకోవటం, ఆయన దీనజన వాత్సల్యానికి మాత్రమే తార్కాణం. ఎవని పాదాల నాశ్రయించి సేవించి, మహర్షులు తరిస్తారో ఆ మహానుభావుడు, నాకు అర్ఘ్యపాద్యాదులర్పించటం, ఆయనకు, భక్తజనులమీద ఉండే గౌరవానికి నిదర్శనం.

శ్రీనిధి యిట్లు నన్ను బచరించి ఘనంబుగ విత్తమేమియు
నీని తెఱంగు గానబడె నెన్న దరిద్రుడు సంపదంధుడై
కానక తన్ను జేరడనికాక శ్రితార్తిహరుండుసత్కృపాం
భోనిధి సర్వవస్తు పరిపూర్ణునిగా నను జేయకుండునే !'

అనికూడా తనలోతాను వితర్కించుకున్నాడు. అలా వితర్కించు కుంటూనే ఊరు చేరుకున్నాడు.

అక్కడ, కుచేలునకు*120 పూర్వం తన కుటీరం ఉండేచోట, ఒక మహాప్రాసాదం గోచరించింది. అందులోఉన్న ఉద్యానవనాలనూ,

---

*120 ఇతి తచ్చిన్తయన్నన్తః ప్రాప్తో నిజగృహాంతికం
సూర్యానలేందు సంకాశై ర్విమానైః సర్వతోవృతం.
విచిత్రోపవనోద్యానైః కూజద్ ద్విజ కులాకులైః
ప్రోత్ఫుల్లకుముదాంభోజ కల్హారోత్పల వారిభిః.
జుష్టం స్వలంకృతైః పుంభిః స్త్రీభిశ్చ హరిణాక్షిభిః
కిమిదం కస్యవాస్థానం కథం తదిద మిత్యభూత్.
ఏవం మీమాంస మానం తం నరా నార్యోఽమర ప్రభాః
ప్రత్య గృహ్ణాన్ మహాభాగం గీత వాద్యేన భూయసా.
పతిమాగత మాకర్ణ్య పత్న్యు ద్ధర్షాతి సంభ్రమా
నిశ్చక్రామ గృహాత్తూర్ణం రూపిణీ శ్రీరివాలయాత్.
పతివ్రతా పతిం దృష్ట్వా ప్రేమోత్కంఠాశ్రులోచనా
మీలితాక్ష్య నమద్ బుద్ధ్యా మనసా పరిషస్వజే.

సరస్సులనూ, ఆ ప్రాంతంలో సంచరిస్తూఉన్న దాస దాసీజనాన్నీ చూసి, కుచేలుడు, తను దారితప్పివచ్చినట్టుగా భావించుకున్నాడు. ఆ 'ఈదివ్యభవనంలో నివసించేవారు ఎంతటిపుణ్యాత్ములై ఉంటారో' అని ఆలోచించసాగాడు. అలా ఆలోచిస్తూ ముందుకుపోతున్న అతణ్ణి కొందరు సుందరీమణులు, విమల గీత వాద్యాదులతో ఎదుర్కొని, స్వాగతం చెప్పి, ఆ విచిత్రభవనంలోకి తీసుకువెళ్ళారు.

ఆ భవనంలో ప్రవేశించగానే, సాక్షాత్తు శ్రీదేవిమాదిరి ఉన్న అతనిభార్య, అమితానందంతో ఆయన కెదురయింది. పరిచారికల సహాయంతో ఆయనకు అర్ఘ్యపాద్యాదు లర్పించుకుంది. ఆయన్ని పుష్పమాలలతో అలంకరించింది. అర్చించింది. పద్మరాగ స్తంభాలతోనూ పటికపుగోడలతోనూ, రత్నమయ కవాటాలతోనూ, హంసతూలికా తల్పాలతోనూ, ప్రకాశిస్తున్న దివ్యమందిరంలోకి ఆయన్ని తీసుకు వెళ్లింది.

అలా, ఆ గృహంలో ప్రవేశించిన కుచేలుడు, అదంతా శ్రీకృష్ణుని కృపా విశేషంగానూ, అనుగ్రహంగానూ భావించాడు. శ్రీకృష్ణ సందర్శనంవల్లనే, అంతవరకు దుఃఖార్ణవంలో మునిగిఉన్న తన సంసారానికి, ఆమహూర్తాన అటువంటి మహదైశ్వర్యం లభించిందని భావించాడు. పవిత్రమైన మనోవికారం పొందకుండా, నిర్మలాంతఃకరణంతో, ఆ పరమేశ్వరుని మనసార ధ్యానించుకున్నాడు. ఆ సమయంలోనే....

'శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడు. సర్వాత్ముడు. ఆయనకు తెలియని దేమీలేదు.

అది కారణంగానే, ఆయన, నన్నుచూసి పలుకరించికూడా, నా సంసారానికి సంబంధించిన వృత్తాంతాన్ని అడగనేలేదు. అడగకుండానే, అన్నివిషయాలూ గ్రహించాడు. గ్రహించటమే కాదు; నన్ననుగ్రహించి, సర్వసంపదలనూ ప్రసాదించాడు.

శ్రీకృష్ణుడు కారుణ్యరసప్రపూర్ణుడు. భక్తవత్సలుడు. తన్ను ఆశ్రయించిన సుహృదులు భక్తితో సమర్పించుకున్న తృణాన్నిగాని, ఫలాన్నిగాని, చివరకు, జల కణాన్నిగాని ప్రేమపూర్వకంగా స్వీకరిస్తాడు. దానికి ప్రతికృతిగా, వారికి, అనంత సౌఖ్యాలను ప్రసాదిస్తాడు. నేను తీసుకువెళ్ళిన గుప్పెడటుకులను తీసుకుని, నాకీ గురుతర సౌభాగ్యాన్ని ప్రసాదించటమే దానికి దృష్టాంతం, అనికూడా, భావించాడు ; అమితానందం పొందాడు.

ఆ విధంగా అపూర్వైశ్వర్యం పొందికూడా, కుచేలుడు, అహమికతో చరించలేదు. పత్నీపుత్రులతో, నిఖిలభోగాలనూ అనుభవిస్తూకూడా, అతను, రాగరహితుడై, నిర్వికారుడై వ్యవహరించాడు. ఎప్పుడు ఏపనిచేస్తున్నా, ఆ అనంతునే అఖండంగా ధ్యానిస్తూ, ఆయన చరణాబ్జాల మీదనే అభిరతి కలిగి ఉండి, జీవితశేషాన్ని వెళ్ళదీసుకున్నాడు. దాని ఫలితంగా, అఖిల బంధాలనూ తొలగించుకుని, అవసానదశలోకూడా ఆ శ్రీమన్నారాయణునే స్మరించుకుంటూ, సాధువులయిన సత్పురుషులకుమాత్రమే గమ్యమైన పరమపదాన్ని పొందగలిగాడు.

## 114. సుహృత్సమాగమం :

శ్రీకృష్ణ బలరాములు ద్వారావతిలో ఉన్న సమయంలో, ఒకసారి, పూర్ణ సూర్యగ్రహణం వచ్చింది. అటువంటిది, సామాన్యంగా, యుగాంతాన, ప్రళయకాలాన మాత్రమే సంభవిస్తుంది. అది గ్రహించిన ప్రజలు, కురుక్షేత్రంలోని స్యమంత పంచకానికి, దశదిశల నుంచీ చేరుకున్నారు.

గర్వాంధులైన క్షత్రియులను నిర్మూలించి, పరాక్రమ సంపన్నుడైన పరశురాముడు, వారి రుధిరంతో ఏర్పరచిన మడుగులైదింటికీ, స్యమంతపంచకమన్న పేరు వచ్చింది. క్షత్రియులను సంహరించి,

భూమిని రుధిరప్లావితం చేసిన పాతకాన్ని తొలగించుకునే నిమిత్తం, ఆ ప్రదేశంలోనే, పరశురాముడు, ఒక మహాయాగాన్ని కూడా నిర్వహించాడు. పుణ్యపాపాలకు అతీతుడైన మహానుభావుడై కూడా, ఆయన, ప్రపంచానికి ఒక ఆదర్శాన్ని చూపించే ఉద్దేశంతో అలా చేయటం జరిగింది.

అప్పుడు అక్కడ సమావేశమైనవారిలో, అక్రూర వసుదేవ ఉగ్రసేనాది వృద్ధులూ, గద ప్రద్యుమ్న సాంబాది యువకులూ, అనిరుద్ధుడూ, యాదవసేనాని అయిన కృతవర్మా కూడా ఉన్నారు.

యాదవులు, అత్యంత వైభవోపేతంగా అక్కడికి తరలి వచ్చారు. వారి వస్త్రాభరణాదులు చూసినవారు, వారు దేవలోకం నుంచి వచ్చారా అనుకున్నారు. వారందరూ వారి వారి సంసారాలతో విమానాలవంటి శకటాలమీదా, పల్లకీలమీదా, అక్కడకు విచ్చేశారు.

అలా అక్కడ సమావేశమైన యాదవులు, విధ్యుక్తంగా స్నానాదికాలు పూర్తి చేసుకున్నారు. బ్రాహ్మణపూజ సలిపారు. అన్నదానం చేశారు. శ్రీకృష్ణుని పట్ల వారికిగల భక్తిని దృఢతరం చేసుకోవటానికే, వారలా చేయటం జరిగింది.

ఆ తరువాత, భోజనాదికాలు ముగించుకుని, తమ తమ బంధు మిత్రులను సందర్శించుకునే ఉద్దేశంతో, వారు, వారివారి గుడారాలకు వెళ్లారు.

ఆ సమయంలో, అక్కడ, మత్స్య, ఉశీనర, కోసల, విదర్భ, కురు, సృంజయ, కాంభోజ, కేకయ, మద్ర, కుంతి, అవర్త, కేరళ మున్నగు దేశాధీశు లెందరో సమావేశమైనారు. వారందరితోనూ, యాదవులకు, ఏదో ఒక విధంగా సంబంధం ఉండనేఉంది.

నందుడూ, తదితర గోపకులూ కూడా, శ్రీకృష్ణుని సందర్శించు కోవాలనే ఉత్సుకతతో అక్కడికి వచ్చారు. వారందర్నూ, ఒకరినొకరు

పలుకరించుకున్నారు. పరామర్శించుకున్నారు. కుశల ప్రశ్నలు వేసు కుంటూ, ఉల్లాసంగా కాలం వెళ్లదీసుకున్నారు. వా రందరి ప్రసంగాల లోనూ, ఏదో ఒక విధంగా, శ్రీకృష్ణుని ప్రస్తావన వస్తూనే ఉంది.

శ్రీకృష్ణ బలరాములుకూడా, వారందరినీ యథోచితంగా సత్కరించటం జరిగింది. వారందరూ ఉగ్రసేనుని సమీపించి :

'రాజా! ప్రపంచంలోని మానవు లందరిలోకీ యాదవులు మాత్రమే ధన్యులు. వారి జన్మలే ధన్యతమమైనవి, శ్రీకృష్ణుడు, సర్వ వేళలా వారి మధ్య ఉండటమే దానికి మూలం.

శ్రీకృష్ణుడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే. ఆయనను దర్శించటం ఎంతటి యోగులకు కూడా శక్యం కాదు. ఆయన ఆవిర్భావం వల్లనే, భూమాతకు శాంతీ, పవిత్రతా చేకూరినై.

యాదవులకు ఆ మహానుభావునితో సర్వవిధ సంబంధాలూ ఉన్నై. మీ రాయనను ఎప్పుడూ చూస్తూఉంటారు. ఆయనకు సన్నిహితంగా కూర్చుని భుజిస్తూ ఉంటారు. ఆయన ప్రక్కనే శయనిస్తారు.

యథార్థానికి, మీరు, నరకమార్గమైన గార్హస్థ్య జీవితం గడుపుతున్న వారైనా, మీ మధ్య సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అయిన శ్రీకృష్ణుని నిలుపుకున్నారు. స్వర్గసుఖాన్నీ ముక్తినీ కూడా తిరస్కరింపజేసే ఆయన దివ్యదర్శన భాగ్యాన్ని పొంది జీవిస్తున్నారు" అని ప్రశంసించారు.

శ్రీకృష్ణ సందర్శనాభిలాషతో వచ్చిన నందాది గోపకులకు యాదవులు స్వాగతం చెప్పారు. పూజాదికాలు జరిపారు,

ఆ సందర్భంలో*[121] శ్రీకృష్ణ బలరాములు కూడా తమ పెంపుడు తలిదండ్రులను, యశోదనూ నందునీ సమీపించి, గౌరవపురస్సరంగా నమస్కరించారు. ప్రేమపూర్వకంగా కౌగిలించుకున్నారు. ఆనంద బాష్పాలు రాలుస్తూ, అలాగే మౌనంగా నిలబడిపోయినారు.

నందయశోదలు కూడా పరమానందా న్ననుభవించారు. తమ ముద్దుబిడ్డలను దగ్గరకు తీసుకుని హృదయానికి హత్తుకున్నారు. వారి యెడబాటు వల్ల అంతవరకూ తాము అనుభవిస్తూ వచ్చిన వేదన నంతనూ విస్మరించారు.

ఆ తరువాత, రోహిణీ దేవకీదేవీ యశోదను ఆలింగనం చేసుకున్నారు. ఆమెతో యిలా అన్నారు.

"యశోదా ! ఇంతవరకు అఖండంగా ఉన్న మన మైత్రి మాకు చిరస్మరణీయంగా ఉంది. నీవు మాకు చేసిన మేలుకు మేమెంతగానో నీకు ఋణపడి ఉన్నాము. దేవేంద్రుని ఐశ్వర్యమంతా నీకు యిచ్చినా నీ పట్ల మా ఋణం తీరదు.

శ్రీకృష్ణ బలరాములు, తమ తలిదండ్రు లెవరో తెలియని స్థితిలో మిమ్మల్ని చేరారు. మీరు, వారిని ప్రేమతో పెంచి, పెద్దవారిని చేశారు. యథార్థానికి తల్లిదండ్రులు చేయవలసిన సంస్కారాల నన్నింటినీ మీరే చేశారు. మీ రక్షణలో ఉండటం వల్లనే వారికి యేవిధమైన భయం లేకుండా పోయింది. నిజంగా, మీ దంపతులు ధన్యులు. అది కారణంగానే, మీరు ఇతరుల బిడ్డలనుకూడా మీ స్వంత బిడ్డలను చూసుకున్నట్టు చూసుకోగలిగారు."

దేవకీ రోహిణీ, ఆవిధంగా, యశోదపట్ల తమకున్న కృతజ్ఞతను వెల్లడించుకుంటున్న సమయంలో, గోపికలు, తమ ప్రియతముడైన

---

*121. కృష్ణ రామౌ పరిష్వజ్య పితరా వభివాద్య చ
న కించనోచతుః ప్రేమ్ణా సాస్రుకంఠౌ (కురూద్వహ).

శ్రీకృష్ణుని దూరంనుంచి చూడటం జరిగింది. అలా చూసిన వారు, మానసికంగా ఆయన్ని చుట్టేసుకున్నారు. ఆయనతో తాదాత్మ్యం పొందారు.

అది గ్రహించిన శ్రీకృష్ణుడు, వారందరినీ ఒక ఏకాంత ప్రదేశానికి తీసుకువెళ్లాడు. అక్కడ వారందరినీ ఆలింగనం చేసుకున్నాడు. ఆనందపరచాడు. కుశల ప్రశ్నల అనంతరం, మందహాసం చేస్తూ, వారితో యిలా అన్నాడు.*122

"మీరు మా ప్రాణానికి ప్రాణమైనవాళ్లు. అది మాకు తెలుసు. అయినా, మమ్మల్నే నమ్ముకున్నవారికి, మరికొందరికి మేలు చేకూర్చే నిమిత్తం, ప్రజాపీడకు పూనుకున్న ప్రభువులను కొందరిని శిక్షించే ఉద్దేశంతో ఇంతవరకు మిమ్మల్ని వదలి ఉండటం జరిగింది. అలా విడిచి ఉన్నా, మమ్మల్ని మీరు మరచిపోలేదు; దూషించలేదు. అదే మీలో ఉన్న విశేషం.

సంయోగ వియోగాలనేవి భగవంతుని ఇచ్ఛమీద ఆధారపడి ఉంటాయి. మేఘాలనూ, గడ్డిపరకలనూ, గాలి ఎలా ఒకచోట చేరుస్తూ విడదీస్తూ ఉంటుందో అలాగే, భగవంతుడుకూడా ప్రాణులను కూరుస్తూ దూరంచేస్తూ ఉంటాడు.

ఆవిధంగా శ్రీకృష్ణుడు ఉపదేశించిన మీదట, గోపికలు, అదే విషయాన్ని పదేపదే మననం చేసుకున్నారు. పరమానందం పొందారు. అనంతరం ఆయన్ని సభక్తికంగా పూజించి, ఆయన్ని ఉద్దేశించి....

---

*122 అపి స్మరథ నః సఖ్యః స్వానామర్థ చికీర్షయా
గతాం శ్చిరాయితాచ్ఛత్రు పక్షక్షపణ చేతసః.
అప్యవధ్యాయథాస్మాన్ స్విదకృతజ్ఞావిశంకయా
నూనం భూతాని భగవాన్ యునక్తి వియునక్తిచ.
వాయుర్యథా ఘనానీకం తృణం తూలం రజాంసి చ
సంయోజ్యాక్షిపతే భూయ స్తథా భూతాని భూతకృత్.

'ఘోర సంసార సాగరోత్తారణంబు
ధీయుతజ్ఞానయోగి హృద్ధ్యేయ వస్తు
వగుచు జెలువొందు నీ చరణాంబుజాత
యుగళమును మా మనంబుల దగులనీవె !'

అని వేడుకున్నారు. ఆయననుంచి ఆ వరాన్ని పొందారు.

అంతలో, శ్రీకృష్ణుని సందర్శించుకునే నిమిత్తం, వ్యాస నారద గౌతమ వశిష్ట యాజ్ఞ వల్క్యాది మహర్షులు అక్కడకు వచ్చారు. శ్రీకృష్ణుడు వారికి ప్రత్యుత్థానంచేసి, వారిని విధ్యుక్తంగా పూజించాడు. ఆ తరువాత, వారిని ఉద్దేశించి ఇలా అన్నాడు:

"యోగీశ్వరుల దర్శనం దేవతలకు కూడా దుర్లభమైనదే. అమితమైన అదృష్టవంతులకుగాని, సాధు సందర్శనం లభించదు. తీర్థ సేవనం వల్లగాని, విగ్రహారాధనవల్ల గాని ప్రాప్తించని పావనత్వం, సాధులను సందర్శించినంతలోనే ప్రాప్తిస్తుంది. వారిని, ఏ ఒక ముహూర్తకాలం సేవించినా, అజ్ఞానాంధకారం తొలగిపోతుంది. వారి సేవాభాగ్యాన్ని అభిలషించనివాడు నరుడై కూడా పశువులలో గర్దభం వంటివాడుగా పరిగణింపబడతాడు."

ఆ విధంగా సాధుజన మాహాత్మ్యాన్ని ప్రశంసించిన పరమ పురుషుని, ఆ మహర్షులు అమితంగా అభినందించారు. ఆ తరువాత, వారు, వసుదేవుని కోరిక మీద, ఆయనచేత అక్కడే ఒక మహాధ్వరాన్ని నిర్వర్తింప జేశారు. ఆయన సమర్పించుకున్న విశేషమైన పారితోషికాలను స్వీకరించి, రామ కృష్ణులవద్ద సెలవు తీసుకుని, తమ తమ నివాసాలకు వెళ్ళిపోయినారు.

## 115. మాతృ వాంఛాపూరణం :

ఆ తరువాత, ఒకసారి, దేవకీదేవి, బలరామ కృష్ణుల నుద్దేశించి, వారి మాహాత్మ్యాన్ని ప్రశంసించి, మరణించిన గురుపుత్రుని తీసుకు

వచ్చిన విధంగానే, కంసునిచేత వధింపబడ్డ తన కుమారులను కూడా ఒకసారి తెచ్చి చూపవలసిందిగా కోరింది. ఆ అన్నదమ్ములు, ఆమె కోరిక నాదరించి, ఆ వెంటనే, తమ యోగ మాయా ప్రభావం ద్వారా, సుతలానికి వెళ్లారు.

అలా, అనుకోకుండా దర్శనమిచ్చిన బలరామ కృష్ణులకు, రాక్షసేశ్వరుడైన బలి, స్వాగతం చెప్పాడు; భక్తిపూర్వకంగా వారిని అర్చించాడు. వానికి కానిక లర్పించుకున్నాడు. ఆ తరువాత ఆయన శ్రీకృష్ణునకు ఇలా విన్నవించుకోవటం జరిగింది.

"మహానుభావా ! నువ్వు పరమాత్ముడవు. సర్వవ్యాపివి. అయినా, నీదర్శనభాగ్యం సామాన్యంగా ఎవరికీ లభించదు.

నువ్వు యోగీశ్వరేశ్వరుడవు. అందుకనే యోగులుకూడా నీ యోగమాయాప్రభావం 'ఇది' అని తెల్సుకోలేకుండా ఉంటారు.

నువ్వు శుద్ధసత్త్వధాముడవు. అయినా, రజస్తమస్వభావుడనైన నాకు దర్శనమిచ్చావు. ఇక నన్ననుగ్రహించవలసింది. నీ కేది ఆనందదాయకమో అది తెలియపరచి, దాన్ని చేయవలసిందిగా నీ దాసుడనైన నన్ను శాసించవలసింది."

ఆవిధంగా, వినయవిధేయతలతో విన్నవించుకున్న బలిచక్రవర్తిని చూసి, శ్రీకృష్ణుడు అమితానందం పొందాడు. అతనిపట్ల ప్రసన్నుడైనాడు. తనువచ్చిన పనిని వివరిస్తూ, ఆయననుద్దేశించి ఇలా అన్నాడు.

"పూర్వం, స్వాయంభువ మన్వంతరంలో, మరీచికి, ఊర్ణ అనే ఒక భార్యఉండేది. ఆ దంపతులకు, స్మరుడు, ఉద్గధుడు, పరిష్వంగుడు, పతంగుడు, క్షుద్రభువు, ఘృణి అనే అరుగురు కుమారు లుండేవారు. వారందరూ దేవతలే.

ఆ కుమారు లొకసారి, చతుర్ముఖుని పరిహసించటం జరిగింది. అది కారణంగా, వారు అసురులై జనించేటట్టు ఆయన శపించాడు.

అలా శపింపబడ్డ ఆ ఆరుగురూ హిరణ్యకశిపునకు జనించవలసి నవారు. కాని, యోగమాయ, వారిని దేవకి గర్భాన ఉంచింది. వారే, కాలక్రమాన దేవకీదేవికి జనించటం, అచిరకాలంలోనే కంసునిచేత వధింపబడటం జరిగింది.

ఆ అన్నదమ్ము లందరూ ఇప్పుడు నీ దగ్గర ఉన్నారు. మా తల్లి అయిన దేవకీదేవి, ఇప్పుడు, వారిని చూడాలనుకుంటోంది. ఆమె కోరికను తీర్చటానికే మే మిప్పుడు ఇలా వచ్చాము. మాతో వారిని తీసుకు పోవటం ద్వారా, వారికి శాప విముక్తి కలుగుతుంది; తిరిగి వారు తమ నిజావాసం చేరుకోవటం జరుగుతుంది."

శ్రీకృష్ణుని పలుకులు విని, బలిచక్రవర్తి, ఆ వెంటనే, తన వద్ద ఉన్న కుమారులను ఆయనకు ఒప్పగించాడు. ఆ తరువాత, బలరామ కృష్ణులు, వారిని తీసుకుపోయి, తమ తల్లికి చూపించి, ఆమెకు అమితానందం కలిగించారు. ఆ కుమారులు, ఆలింగనాదుల ద్వారా శ్రీకృష్ణుని స్పృశించి, తమ పాపాన్ని తొలగించుకున్నారు. చతుర్ముఖుని శాపం నుంచి విముక్తి పొందారు. ఆ వెంటనే, తమ తల్లిదండ్రుల వద్దా, బలరామ కృష్ణులవద్దా సెలవు తీసుకుని, తమ నిజావాసానికి, దేవలోకానికి వెళ్లిపోయినారు.

ఏనాడో మరణించిన తన కుమారులు తన సముఖానికి తిరిగి రావటం, వెంటనే వెళ్లిపోవటం దేవకీదేవికి ఆశ్చర్యం కలిగించింది. కాని, అదంతా కూడా శ్రీకృష్ణుని లీలావిశేషం మాత్రమే అని గ్రహించింది కావటంవల్ల, పరమానందా న్ననుభవించింది. పరవశత్వం పొందింది.

## 116. బహుళాశ్వుడు-శ్రుతదేవుడు :

పూర్వం, మిథిలానగరంలో, శ్రుతదేవుడనే ఒక బ్రాహ్మణు డుండేవాడు. ఆయునకు, దురాశ అనేది ఉండేదికాదు. న్యాయంగా

ఎప్పుడేది లభిస్తే అది, మహద్భాగ్యమనుకుని అనుభవిస్తూ, శాంత చిత్తంతో, సంతుష్టితో జీవ యాత్ర సాగించుకుంటూ ఉండేవాడు. శ్రీకృష్ణునే ఆశ్రయించి, సర్వవేళలా ఆయననే స్మరించుకుంటూ ఆనంద ప్రపూర్ణుడై కాలం వెళ్లదీసుకునేవాడు.

ఆ కాలంలో, నిమివంశీయుడైన బహుళాశ్వుడనే ఆయన మిథిలాధిపతిగా ఉండేవాడు. ఆయన కూడా కృష్ణభక్తుడే.

తనకు ప్రియులైన ఆ ఇద్దరినీ అనుగ్రహించే నిమిత్తం, శ్రీకృష్ణు, డొకసారి, వ్యాస నారదాది మహర్షులతోసహా మిథిలా నగరానికి బయలుదేరాడు. దారిపొడుగునా ప్రజలు ఆ మహానుభావునకు స్వాగత సత్కారాలు జరిపారు. తమజీవితాలకు ధన్యత్వం చేకూర్చుకున్నారు

అలా తన సీమలో ప్రవేశించిన బలరామ కృష్ణ ప్రభృతులకు, బహుళాశ్వుడు భక్తిపూర్వకంగా స్వాగతం చెప్పాడు. విధ్యుక్తంగా వారిని పూజించాడు. ఆ తరువాత, శ్రీకృష్ణుని ఉద్దేశించి, జగద్గురువులైన మీ రీనాడు నా ఆతిథ్యం స్వీకరించవలసింది' అని అభ్యర్థించాడు. అతనికి ఆనందం కలిగించేనిమిత్తం, శ్రీకృష్ణుడు, అందుకు అంగీకరించాడు.

అంతలోనే, శ్రుతదేవు డక్కడకువచ్చి, శ్రీకృష్ణునికి వినయ విధేయతలతో మ్రొక్కాడు. ఆయన, బహుళాశ్వున కతిథిగా ఉండటానికి అంగీకరించిన విషయం తెలియక, తన ఇంటికి రావలసిందనీ, తన ఆతిథ్యాన్ని అంగీకరించవలసిందనీ కోరాడు. అతని ఆహ్వానానికి కూడా శ్రీకృష్ణుడు తన ఆమోదాన్ని తెలియపరచాడు.

శ్రీకృష్ణుడు, ముందుగాతనకుమాటుఇచ్చి, ఆతరువాత శ్రుతదేవుని ఆహ్వానాన్ని అంగీకరించటం, బహుళాశ్వునకు ఆశ్చర్యం కలిగించింది. కాని, 'అదేమిట'ని ఆయన్ని అడిగే సాహసం అతనికి లేకపోయింది.



అంతలో, అతిథి పూజాసమయం సమీపించింది. మహారాజు, సంకోచిస్తూనే, శ్రీకృష్ణుని సమీపించాడు. ఆ విషయం తెలియపరచుకున్నాడు. ఆవెంటనే వారిని వెంటబెట్టుకుని. మంగళతూర్యవాదాలతో తన మందిరానికి బయలుదేరాడు. అది చూసిన శ్రుతదేవుడు విస్మితుడైనాడు, శ్రీకృష్ణుని అభిప్రాయం అగ్రాహ్యమనుకుంటూ అలాగే నిలబడిపోయినాడు.

అంతలో శ్రుతదేవుని కుమారుడొకడు, పరుగుపరుగున అక్కడికి వచ్చాడు. వచ్చి, శ్రీకృష్ణుడు తనసహచరులందరితోనూ తమ ఇంటికి విచ్చేశాడనీ, అతణ్ణిగురించి అడిగాడనీ తెలుపుకున్నాడు. అదివిన్న శ్రుతదేవుడు అమితాశ్చర్యం పొందాడు, ఆవెంటనే బయలుదేరి, మనోవేగంతో తన నివాసం చేరుకున్నాడు.

బహుళాశ్వుడు, తన అతిథులందరికీ ఉత్తమాసనాలు సమర్పించుకుని, వారి పాదాలు కడిగి, ఆ పావనోదకాన్ని తన శిరాన ధరించాడు. తన పత్నుల శిరాన చల్లాడు. ఆ తరువాత అతిథులందరనూ గంధమాల్యాంబరాదులతో అర్చించాడు. రసవత్పదార్థాలతో వారికి భోజనాలు పెట్టాడు. వారిని విశ్రమింప చేశాడు.

అంతలో ఒకబ్రాహ్మణు డక్కడికివచ్చి, ఆయన్ని కలుసుకుని, ప్రసంగవశాత్తు, కళ్యాణప్రదుడైన శ్రీకృష్ణునీ మహనీయులైన మహర్షులనూ తాను శ్రుతదేవుని ఇంట్లో దర్శించుకోవటం జరిగిందనీ, అది కారణంగా తన జన్మ ధన్యత్వం పొందిందనీ మహదానందంతో ఆయనకునివేదించుకున్నాడు. ఆ మహానుభావులకు సేవలుచేస్తూ ఉన్న శ్రుతదేవుని అదృష్టాన్ని అమితంగా శ్లాఘించాడు.

అది విన్న బహుళాశ్వుడు అమితాశ్చర్యం పొందాడు. ఆవెంటనే ఆ విచిత్రం చూసే నిమిత్తం, ఆయనతోసహా బయలుదేరి, శ్రుతదేవుని గృహానికి వెళ్లాడు.

అంతలో, అతిథి పూజాసమయం సమీపించింది. మహారాజు, సంకోచిస్తూనే, శ్రీకృష్ణుని సమీపించాడు. ఆ విషయం తెలియపరచుకున్నాడు. ఆవెంటనే వారిని వెంటబెట్టుకుని. మంగళతూర్యనాదాలతో తన మందిరానికి బయలుదేరాడు. అది చూసిన శ్రుతదేవుడు విస్మితుడైనాడు, శ్రీకృష్ణుని అభిప్రాయం అగ్రాహ్యమనుకుంటూ అలాగే నిలబడిపోయినాడు.

అంతలో శ్రుతదేవుని కుమారుడొకడు, పరుగుపరుగున అక్కడికి వచ్చాడు. వచ్చి, శ్రీకృష్ణుడు తనసహచరులందరితోనూ తమ ఇంటికి విచ్చేశాడనీ, అతణ్ణిగురించి అడిగాడనీ తెలుపుకున్నాడు. అదివిన్న శ్రుతదేవుడు అమితాశ్చర్యం పొందాడు, ఆవెంటనే బయలుదేరి, మనోవేగంతో తన నివాసం చేరుకున్నాడు.

బహుళాశ్వుడు, తన అతిథులందరికీ ఉత్తమాసనాలు సమర్పించుకుని, వారి పాదాలు కడిగి, ఆ పావనోదకాన్ని తన శిరాన ధరించాడు. తన పత్నుల శిరాన చల్లాడు. ఆ తరువాత అతిథులందరనూ గంధమాల్యాంబరాదులతో అర్చించాడు. రసవత్పదార్థాలతో వారికి భోజనాలు పెట్టాడు. వారిని విశ్రమింప చేశాడు.

అంతలో ఒకబ్రాహ్మణుడక్కడికివచ్చి, ఆయన్ని కలుసుకుని, ప్రసంగవశాత్తు, కళ్యాణప్రదుడైన శ్రీకృష్ణునీ మహనీయులైన మహర్షులనూ తాను శ్రుతదేవుని ఇంట్లో దర్శించుకోవటం జరిగిందనీ, అది కారణంగా తన జన్మ ధన్యత్వం పొందిందనీ మహదానందంతో ఆయనకునివేదించుకున్నాడు. ఆ మహానుభావులకు సేవలుచేస్తూ ఉన్న శ్రుతదేవుని అదృష్టాన్ని అమితంగా శ్లాఘించాడు.

అది విన్న బహుళాశ్వుడు అమితాశ్చర్యం పొందాడు. ఆవెంటనే ఆ విచిత్రం చూసే నిమిత్తం, ఆయనతోసహా బయలుదేరి, శ్రుతదేవుని గృహానికి వెళ్లాడు.

బహుళాశ్వుడు, శ్రుతదేవునిఇంటికి వెళ్ళేసమయానికి, శ్రీకృష్ణుడు అక్కడ, దర్భాసనంమీద కూర్చుని ఉన్నాడు. శ్రుతదేవుడూ అతని భార్యాపుత్రులూ ఆయనకు పాదసేవ చేస్తున్నారు. ఆయన శ్రుత దేవుని ఉద్దేశించి...

'నామది విప్రులపైగల
ప్రేమము నా తనువునందు బెట్టని కతనన్
భూమీసురు లర్హులు నీ
వీ మునులం బూజసేయు మిద్ధ చరిత్రా !'

అని ప్రేమపూర్వకంగా ఉపదేశిస్తున్నాడు.

అది విన్న బహుళాశ్వుడు, శ్రుతదేవుని భక్తిని తనలోతాను ప్రశంసించుకున్నాడు. అతనిపట్ల గౌరవంచూపుతూ, శ్రీకృష్ణుని సమీపించి; ఆయనకు సాగిలబడి మ్రొక్కాడు. ఆతరువాత, ఆయన్ని ఉద్దేశించి ఇలా విన్నవించుకున్నాడు.

"కృష్ణా ! నువ్వు మహానుభావుడవు. నీ లీలలను గ్రహించటం గాని, నీ మాయను తరించటంగాని నావంటి వారికి సాధ్యంకాదు.

తండ్రీ ! నువ్వు పరమేశ్వరుడవు. సర్వాంతర్యామివి. నీ దర్శనం వల్ల, నీ లీలలను కళ్ళారా చూడగలగటంవల్ల, నీ కింకరుడనైన నేనీ నాడు ధన్యుడనైనాను. నీ చరణదాసులైనవారు బ్రహ్మారుద్రామహేంద్రులకంటె అదృష్టవంతులని ఇప్పుడు గ్రహించగలిగాను. ఇక నీ యీ మూర్తిమీదా, నీ చరణాబ్జాలమీదా, నా మనసు సర్వదా నిలచి ఉండేటట్టు అనుగ్రహించవలసింది."

ఆ విధంగా బహుళాశ్వుడు నివేదించుకున్న తరువాత, శ్రుతదేవుడు, తన హృదయాన్ని శ్రీకృష్ణునకు ఇలా తెలుపుకున్నాడు.

శ్రీనాథా! నువ్వు భక్తవత్సలుడవు. ఎల్లప్పుడూ నీ కథలు వింటూ, నిన్ను కీర్తిస్తూ, నిన్ను అర్చిస్తూ ఉండే భక్తుల హృదయాంతరాళాలలో నువ్వెప్పుడూ ప్రకాశిస్తూనే ఉంటావు. అహంకార మమకారాలు లేని వాడవై కూడా, నిన్ను భజించేవారికి సమీపస్థుడవై ఉంటావు. హృదయస్థుడవై ఉండి కూడా, నీభక్తులు కాని వారికి అతిదూరంగా చరిస్తూ ఉంటావు. అదంతా, నీలీలావిలాసమే కాని అన్యం కాదు.

మహానుభావా! నేను నీ దాసుణ్ణి. నీకు నేను ఏ విధమైన సేవచేసి తరించగలనో తెలుపవలసింది. నీకు సంతుష్టిని కలిగించే ఏదో ఒక కార్యాన్ని నా చేత చేయించవలసింది. నా జీవితానికి చరితార్థత చేకూర్చవలసింది."

ఆ విధంగా నివేదించుకున్న బహుళాశ్వునివంకా, శ్రుతదేవుని వంకా, శ్రీకృష్ణుడు మందహాసం చేస్తూ చూశాడు. చూసి, వారిని ఉద్దేశించి ఇలా అన్నాడు.

"ఈ మహర్షులు మిమ్మల్ని అనుగ్రహించటానికే యిలా వచ్చారు. వీరు తమ పాదరజంచేత ప్రపంచాన్నంతనూ పవిత్రం చేస్తూ, నాతో పర్యటిస్తూ ఉంటారు. పుణ్యక్షేత్ర దర్శనంవల్లా, తీర్థాటనాదులవల్లా, ప్రాణులు, కాలక్రమాన పవిత్రులుకావటం జరుగుతుంది. కాని, ఇటువంటి మహనీయుల దర్శనం ఆ ఫలితాన్ని వెంటనే కలిగిస్తుంది. మహనీయుల సందర్శనభాగ్యంవల్లనే, దేవతలకుకూడా పవిత్రత చేకూరుతూ ఉంటుంది.

విగ్రహారాధనం కంటె, వేదవిదులను ఆరాధించటం ఉత్తమ కార్యం. జ్ఞాని అయిన విప్రుడు చరాచర జీవరాసి అంతలోనూ నన్ను దర్శిస్తూ ఉంటాడు. సృష్టి అంతా నా రూపంగానే భావిస్తూ ఉంటాడు.

అందుకనే, బ్రహ్మ విదులను భక్తితో అర్చించటం అవసరమని నేను మీకు తెలుపుతున్నాను. అలా చేయటం ద్వారా మీరు నన్ను ప్రత్యక్షంగా అర్చించిన వారవుతారు. అత్యధిక ధనాన్ని వెచ్చించి వైభవోపేతంగా చేసే కార్యాలన్నిటికంటె, సాధువైన మహనీయులను సభక్తికంగా పూజించినవారు నా ప్రేమకు అమితంగాపాత్రులవుతారు."

అలా బోధించి, వారి అభ్యర్థన మీద అక్కడ కొన్ని దినాలుండి, శ్రీకృష్ణుడు, ఆ తరువాత, ద్వారావతికి తిరిగి వెళ్లటం జరిగింది.

## 117. వైకుంఠ యాత్ర :

అర్జునుడు, తన మేనబావా బావమరదీ అయిన శ్రీకృష్ణునివద్ద ఉన్నసమయంలో, ఒకసారి, ఒకబ్రాహ్మణుడు, పుట్టిన వెంటనే మరణించిన తనకుమారుని తీసుకువచ్చి, రాజద్వారంలో ఉంచి, అమితంగా దుఃఖిస్తూఉండటం జరిగింది. అది చూసిన అర్జునుడు ఆ విప్రుని సమీపించి ఆయన విచారకారణం తెలుపవలసిందిగా కోరాడు. అతనికి సమాధానంగా, ఆ బ్రాహ్మణు డిలా అన్నాడు.

"అయ్యా ! బ్రహ్మద్వేషీ, శరుడూ, లుబ్ధుడూ విషయాసక్తుడూ దుశ్శీలుడూ, అజితేంద్రియుడూ అయిన రాజు పాలనలో ఉన్నవారు, నిరుపేదలూ నిత్యదుఃఖితులూ అవుతారు. ఇప్పుడు, నేనుకూడా ఆ పరిస్థితిలోనే ఉన్నాను. నాకు జనించిన ఎనమండుగురు కుమారులు నా కళ్లముందే మరణించటం జరిగింది. ఇది మా పాలకుని పాపఫలం కాక మరొకటికాదు."

ఆ బ్రాహ్మణుని విచార కారణం గ్రహించిన అర్జునుడు, కొన్ని సాంత్వన వచనాలతో, అతణ్ణి ఊరడించటానికి ప్రయత్నించాడు; ఈమాటు నీకు పుట్టే కుఱ్ఱవాణ్ణి నేను రక్షించితీరుతాను' అని వాగ్దానం చేశాడు. అంతేకాదు; అలా చేయలేనిపక్షంలో నేను అగ్ని ప్రవేశం చేస్తాను' అనికూడా శపథం చేశాడు.

అర్జునుని పలుకులు ఆ బ్రాహ్మణునకు ఆశ్చర్యం కలిగించినై. అందుకనే, ఆయన అతణ్ణి ఉద్దేశించి, 'ప్రథిత విక్రమశాలురైన రామ కృష్ణులూ, వారి కుమారుడైన ప్రద్యుమ్నుడూ, అతని పుత్రుడైన అనిరుద్ధుడూ చేయలేని పనిని నువ్వెలా చేయగలవు ?' అని అడిగాడు. 'ఇంతకూ నువ్వెవరవు ?' అని కూడా ప్రశ్నించాడు. అలా ప్రశ్నించిన బ్రాహ్మణునకు సమాధానంగా, అర్జునుడు...

"బలుడం గాను మురాసురాంతకుడ గా బ్రద్యుమ్నుడం గాను నే
దెలియం దత్తనయుండ గా నని విరోధివ్రాతముం భీషణో
జ్జ్వలగాండీవ ధనుర్విముక్త నిశితాస్త్రశ్రేణిచే బీన్గు బెం
టలు గావించు పరాక్రమప్రకట చండస్ఫూర్తి నే బార్థుడన్"

అని తన్ను తాను తెలియపరచుకున్నాడు. అంతటితో ఆగక, అతని పలుకులవల్ల కలిగిన రోషంతో...

"బలిమి పురాంతకుం దొడరి బాహువిజృంభణమొప్ప నెక్కటిం
దలపడి పోరినట్టి రణధైర్యుని నన్ను నెఱుంగ వక్కటా
పెలుకుబ మృత్యుదేవతను బింకమడంచి భవత్తనూజుల
న్నలవు జలంబు జూపి కొనియాడగ నిప్పుడ తెచ్చియిచ్చెదన్"

అని కూడా ప్రగల్భించాడు.

ఆ తరువాత, కాలక్రమాన, ఆ భూసురునిభార్య తిరిగి గర్భ వతి అయింది. ఆమె ప్రసవించే సమయంకూడా సమీపించింది. అది గ్రహించిన ఆ బ్రాహ్మణుడు, అర్జునున కావిషయం నివేదించు కున్నాడు. ఆ వెంటనే అర్జునుడు, తన గాండీవంతో, ఆ బ్రాహ్మ ణుని ఇంటికి వెళ్లాడు. అలావెళ్ళి, తన దివ్యాస్త్రాలతో ఆ సూతికా భవనాన్ని అన్నిదిక్కులా బంధించాడు. పురిటింటిని ఒక శరపంజరం మాదిరి రూపొందించాడు.

అదిచూసిన ఆ బ్రాహ్మణుడు, ఆపైన ఆఇంట్లోకి మృత్యుదేవత ప్రవేశించటం అసంభవమని నిశ్చయించుకున్నాడు. ఆవిధమైన విశ్వాసంతోనే ఉన్న అర్జునుని సమీపించి, అతనిప్రక్కనే నిశ్చింతగా కూర్చున్నాడు.

అంతలో పురిటింటిలోనుంచి, పుట్టిన పిల్లవాడు మింటికెగిరి పోతున్నాడన్న అరుపులు వినిపించినై. అదివిన్న అర్జునుడు, అదరిపడ్డాడు; అవనతవదనుడైనాడు. అతణ్ణిచూసి, ఆ విప్రుడు అమితంగా తూలనాడుతూ...

'ఎక్కడి పాండుతనూభవు
డెక్కడి విలుకాడు వీని కెక్కడి సత్యం
బెక్కడి గాండీవము దన
కెక్కడి దివ్యాస్త్ర సమితి యేమనవచ్చున్'

అనికూడా హేళన చేశాడు.

చెవులకు ములుకులై తోచిన ఆ పలుకు లాలకించి, అర్జునుడు, ఆ వెంటనే బయలుదేరి, తన ఆత్మవిద్యాయోగంద్వారా, యమపురానికి వెళ్లాడు. కాని, అతని కక్కడ ఆ బాలుడు కనిపించలేదు. అది గ్రహించి, అతను దిక్పాలుర పురాలన్నీ గాలించాడు. అయినా ఆ బాలుని జాడ అతనికి తెలియలేదు. ఆ తరువాత, స్వర్గపాతాళాలకు పోయి చూశాడు. అదీ ప్రయోజన శూన్యమే అయింది. అది కారణంగానే, అతడు, తిరిగి కుశస్థలి చేరుకుని, తన శపథాన్ననుసరించి అగ్నిప్రవేశం చేయటానికి పూనుకున్నాడు.

అది గ్రహించిన శ్రీకృష్ణుడు, అతణ్ణిసమీపించి, 'ఆ కుఱ్ఱవాణ్ణి నీకు నేను చూపిస్తాను' అని మాట ఇచ్చాడు. అతడు అగ్నిప్రవేశం చేయకుండా వారించాడు. ఆ వెంటనే, తన దివ్యరథంమీద, అతణ్ణి కూర్చోపెట్టుకుని బయలుదేరాడు.

అలా బయలుదేరిన శ్రీకృష్ణుని రథం*[123] సప్తద్వీపాలూ దాటింది. సప్త సముద్రాలనూ తరించింది. సప్త కులగిరులనూ అధిగమించింది. అంధకార బంధురమైన ఒకసీమలో ప్రవేశించింది.

అక్కడికి చేరుకునేటప్పటికి, ఆ రథాశ్వాలకు దారికనిపించలేదు అది కారణంగా, అవి ముందుకు పోలేకపోయినై. అది గ్రహించిన శ్రీకృష్ణుడు, వేయిసూర్యుల కాంతితో ప్రకాశించే తన చక్రాన్ని ముందుకు వదిలాడు.

---

*123 సప్తద్వీపాన్ సప్తసింధూన్ సప్తసప్త గిరీనథ
లోకాలోకం తథాతీత్య వివేశ సుమహత్తమః.

తత్రాశ్వాః శైబ్య సుగ్రీవ మేఘపుష్ప బలాహకాః
తమసి భ్రష్టగతయో బభూవు (ర్భరతర్షభ).

తాన్దృష్ట్వా భగవాన్ కృష్ణో మహాయోగేశ్వరేశ్వరః
సహస్రాదిత్య సంకాశం స్వచక్రం ప్రాహిణోత్ పురః.

తమః సుఘోరం గహనం కృతం మహద్
విదారయద్ భూరితరేణ రోచిషా
మనోజవం నిర్వివిశే సుదర్శనం
గుణచ్యుతో రామ శరో యథా చమూః.

ద్వారేణ చక్రానుపథేన తత్తమః
పరం పరం జ్యోతి రనంతపారం
సమశ్నువానం ప్రసమీక్ష్య ఫాల్గునః
ప్రతాడితాక్షోఽపిదధేఽక్షిణీ ఉభే.

తతః ప్రవిష్టః సలిలం నభస్వతా
బలీయసైజద్ బృహదూర్మి భూషణం
తత్రాద్భుతం వై భవనం ద్యుమత్తమం
భ్రాజన్మణి స్తంభ సహస్రశోభితమ్.

ఆ చక్రం కల్పించిన కాంతిమూలంగా చీకటి అంతా చెదరి పోయింది. మార్గం సుబోధకమయింది. రథం యథాప్రకారంగా ముందుకు పోసాగింది.

అప్పుడు నలువంకలా ప్రసరించిన ఆ పరమ తేజాన్ని అర్జునుడు చూడలేకపోయినాడు. కళ్ళు మూసుకున్నాడు. అలా ఉన్న అర్జునునితో, ఆ రథం, వెళ్ళి వెళ్ళి ఒక మహాసముద్రంలో ప్రవేశించింది.

ఆ జలనిధి మధ్యభాగంలో కోటిసూర్యుల కాంతితో ప్రకాశించే ఒక దివ్యభవనం కృష్ణార్జునులకు గోచరమయింది. అదే పరమ భాగవత నివాసమయిన దివ్యధామం.

అక్కడ, వేయి ఫణీమణులతో వెలుగులుచిమ్ముతూ, రెండు వేల కళ్ళతో ప్రకాశిస్తూ, విషధూమ రేఖలమాదిరి ఉన్న జిహ్వాలతో, కైలాసగిరివంటి దేహంతో ఒప్పారుతున్న భోగికులేంద్రునిమీద సుఖాసీనుడై ఉన్న శ్రీమన్నారాయణుని కృష్ణార్జునులు సమీపించారు. నీలమేఘచ్ఛాయతో, పూర్ణచంద్రునివంటి ముఖంతో, పద్మపత్రాల వంటి నేత్రాలతో, మృదుమధుర మందహాసంతో, కిరీటకుండలాద్యలంకారాలతో, అష్టబాహులతో, శంఖచక్ర గదాది సాధనలతో, కౌస్తుభ మణితో, వనమాలతో విరాజిల్లుతూ, సునందాది పార్షదులమధ్య మహర్షి జన సేవితుడై ప్రకాశమానుడై ఉన్న ఆయన కంజలించారు. భక్తిపూర్వకంగా ఆయన్ని స్తుతించి ప్రసన్నుని చేసుకున్నారు.

ఆపైన శ్రీమన్నారాయణుడు వారిని చూసి, ఆనందంతో మందహాసంచేశాడు. వారిని ఉద్దేశించి...

"ధరణికి వ్రేగగు దైత్యుల
బోరిబోరి వధియించి ధర్మమున్ నిలుపుటకై
ధర జనియించితి రిరువురు
నర నారాయణు లనంగ నా యంశమునన్.

ఆరూఢనియతితో బెం
పారిన మిము నిమ్మునీంద్రు లర్థిం జూడం
గోరిన మీ వచ్చుటకై
ధారుణీసురసుతుల నిటకు దగ దేవలసెన్"

అని వారికి విశదపరచాడు; ఆ కుఱ్ఱవాళ్లని వారికి అప్పగించాడు.

ఆ తరువాత, ఆ మహానుభావుని దగ్గర సెలవుతీసుకుని, విప్ర సుతులతోసహా బయలుదేరి, కృష్ణార్జునులు, తిరిగి కుశస్థలి చేరుకున్నారు. ఆ పిల్లలను వారి తండ్రికి ఒప్పజెప్పి, అతని సన్నుతి నందుకున్నారు.

118. *బృందావన గమనం :*

ఉద్ధవునిద్వారా తనవారి వియోగవ్యథను గ్రహించిన కృష్ణునకు, ఒకసారి బృందావనానికిపోయి, వారికి మనశ్శాంతిని చేకూర్చాలన్న అభిప్రాయం కలిగింది. ఆవెంటనే ఆయన ఉద్ధవునితోసహా బయలుదేరాడు.

అలా వెడుతూఉండగా, ఆయనకు, మధురాతి మధురమైన పూర్వ స్మృతు లెన్నో కలిగినై. పూర్వం, తాను, తన హృదయాన్ని ఆహరించిన గోపికలతోనూ గోపకులతోనూ గోవత్సలతోనూ విహరించిన బాటలు వనాలు నికుంజాలు చూసి మురిసిపోయినాడు. గోప కన్యలతో తను జలక్రీడ సలిపిన కాళింది కనిపించగానే పరమానందం పొందాడు. గోవర్ధనగిరి తలపుకురాగానే, ఆయన ఒళ్లు పులకరించింది. గోవుల అంభారవం వినిపించగానే ఆయన ఆనందాశ్రులు రాల్చాడు.

శ్రీకృష్ణుని రథచక్రాల సవ్వడి, గుఱ్ఱపు గిట్టలచప్పుడు చెవుల బడగానే, గోకులమంతా, చంద్రోదయ సమయాన సముద్రం మాదిరి ఉత్సాహంతో ఉప్పొంగిపోయింది, అంతలో, వారికి ఘురఘీరవం విని

పించింది. ఆ వెంటనే గోవులూ వాటిని అనుసరించి గోవత్సలూ ఆ వేణునాదం వినిపించిన దిక్కుగా ఉరుకులు పెడుతూపోయినై.

శ్రీకృష్ణుడు, దూరంనుంచే వాటిని చూశాడు. చూసి, రథగమనవేగాన్ని హెచ్చించి, వాటిని సమీపించాడు.

అంతలో, అవి, అంభారవం చేస్తూ రథాన్ని చుట్టేసుకున్నై. మోరలెత్తి, కృష్ణయ్యవంకనే చూడసాగినై. అది చూసిన కృష్ణయ్య, రథంనుంచి క్రిందికి ఉరికి, వాటి అన్నింటినీ పేరుపేరున పలుకరించాడు. వాటి మూపులమీద ప్రేమతో మృదువుగా చరిచాడు.

ఆ సమయానికి, కృష్ణుని సఖులు శ్రీదామాదులు అక్కడికి చేరుకున్నారు. కృష్ణయ్య, పరమప్రేమతో వారిని ఆలింగనం చేసుకున్నాడు. ఆ తరువాత, వారూ ఆయనా పరస్పరం కుశల ప్రశ్నలు వేసుకున్నారు.

అంతలో, భేరీ మృదంగాది వివిధ వాద్యాలతోనూ, పూర్ణ కుంభాలతోనూ, వేదనాదంతోనూ, చందనాక్షతలతోనూ, కుసుమ హారాలతోనూ, వ్రజవాసినులయినసుమంగలులతోనూ, గోపికలతోనూ, దాసదాసీజనంతోనూ నందాదులు శ్రీకృష్ణుని సమీపించారు. ఆయనకు నీరాజన లిచ్చారు. జయజయధ్వానాలు చేశారు. ఆలింగన పూర్వకంగా, శ్రీకృష్ణునిపై తమకున్న ప్రేమను వ్యక్తీకరించుకున్నారు.

శ్రీకృష్ణుడు, ఆపైన, నందాదులకు పాదాభివందనలు చేశాడు. గోపవృద్ధు లందరినీ పరామర్శించాడు. మిగిలిన పిన్న పెద్ద లందరినీ ఉచితరీతిని, ప్రేమపురస్సరంగా పలుకరించాడు.

అనంతరం, వారు నందవ్రజం చేరుకున్నారు. యశోదా రోహిణు లాపైన శ్రీకృష్ణుని కౌగిట గ్రుచ్చుకుని, ఆనందబాష్పాలు రాల్చారు. అతనిచేత మంగళ స్నానాలు చేయించి, అతణ్ణి అలంకరించారు.

ఆ తరువాత, గోపికలు శ్రీకృష్ణుని సమీపించి, వివిధమైన కానికలు సమర్పించుకుని, అతడు తమ్ము విస్మరించనందుకూ, అతని అనుగ్రహం తమమీద అంతవరకు ఉన్నందుకూ అతనికి తమ కృతజ్ఞతను తెలుపుకున్నారు.

ఆపైన, శ్రీకృష్ణుడు, అక్కడ ఎందరు గోపికలు ఉన్నారో అందరికీ, అన్ని రూపాలలోనూ, ఒకే సమయాన దర్శన మిచ్చాడు. వారితో, యథాపూర్వకంగా సంభాషించాడు. వారికి పరమానందం కలిగించాడు. అక్కడినుంచి వా రందరితోనూ గోవర్ధనాద్రికి వెళ్లి, వారితో యథేచ్ఛగా క్రీడించాడు. యమునానదికి వెళ్లి, వారితో జలక్రీడ సలిపాడు.

119 . . . ఋభుమహర్షి :

ఆ ప్రాంతంలో, అప్పుడు, శ్రీకృష్ణునికి, ఋభుడనే ఒక మహర్షి కనిపించాడు. ఆ మహర్షి, అక్కడ, అరువదారువేల సంవత్సరాలనుంచీ, నిరాహారదీక్షతో, తీవ్ర తపస్సు చేసుకుంటున్నాడు. ఆయన తనభక్తుడు కావటంవల్ల, శ్రీకృష్ణు డాయన్ని సమీపించి, పేరు పెట్టి పిలిచాడు. కాని, సమాధిస్థితుడై ఉన్న ఋభుడు పలుకలేదు. అది గ్రహించి, శ్రీకృష్ణుడు ఆయనలో ప్రవేశించాడు.

తన హృదయంలో అలా దర్శనమిచ్చిన శ్రీకృష్ణుని చూసి, ఋభుడు పరమానందంతో కళ్లుతెరచాడు. తనఎదుటఉన్న శ్రీకృష్ణుని సందర్శించుకున్నాడు.

అలా అనుకోకుండా దర్శనమిచ్చిన శ్రీకృష్ణునకు ఋభుడు ప్రణామం చేశాడు. ఆయన్ని అస్తోకంగా స్తుతించాడు. తన తపస్సు ఫలించిందన్న భావంతో అమితానందం పొంది, ఆయన పాదాలమీద వ్రాలాడు. ఆయన పాదాబ్జాలనే హృదయంలో నిలుపుకుని, ప్రాణం వదిలాడు. ఆ వెంటనే, ఆయన జ్యోతి శ్రీకృష్ణునిలో లయించి

పోయింది. అది చూసిన గోపికాజనం, అమితాశ్చర్యంతో, శ్రీకృష్ణుని చుట్టి స్తుతించారు.

అంతలో, శ్రీకృష్ణుడు ఆ మహర్షి ని తిగిరి పిలిపించటం జరిగింది. దానితో ఆ ముని ప్రాణం పొంది, శ్రీకృష్ణుని ఎదుట నిలబడ్డాడు.

అలా తిరిగి లేచిన ఋఘుని, శ్రీకృష్ణుడు ఆలింగనం చేసుకున్నాడు. తన దక్షిణ హస్తంతో ఆయన శిరస్సు నిమిరాడు. ఆ వెంటనే, ఋఘుడు తేజోరూపం ధరించి గోలోకానికి వెళ్లిపోవటం జరిగింది.

## 120 . . . సుభద్ర :

శ్రీకృష్ణుని చెల్లెలు సుభద్ర; ప్రాణమిత్రుడూ మేనత్త కుమారుడూ అర్జునుడు. ఆ సుభద్రార్జునులు పరస్పరం ప్రేమించుకున్నారు. వారిద్దరూ భార్యాభర్తలు కావాలని శ్రీకృష్ణుడు కోరుకుంటూ ఉండేవాడు.

కాని, సుభద్రను అర్జునున కివ్వటం బలరామున కిష్టంలేదు. అత డామెను, దుర్యోధనున కిచ్చి వివాహం చేయాలని నిర్ణయించుకున్నాడు. అది తలచుకున్నప్పుడల్లా, శ్రీకృష్ణుడు బాధపడుతూ ఉండేవాడు. అర్జునునిపట్ల బలరామున కున్న వైముఖ్యాన్ని ఎలా తొలగించటమా అని ఆలోచిస్తూ ఉండేవాడు.

ఆ పరిస్థితి అలా ఉండగా, ఇక్కడ, ఇంద్రప్రస్థంలో ఉన్న పాండుపుత్రులు, నారదుని సూచనమీద, పాంచాలి విషయంలో, తమ మధ్య పర్పరచుకున్న నియమాన్ని, అర్జునుడు, ఒక విషమ పరిస్థితిలో ఉల్లంఘించటం, అది కారణంగా, అతడు, నియమానుసారం తీర్థయాత్రకు బయలుదేరటం జరిగింది.

అలా తీర్థయాత్రకు బయలుదేరిన అర్జునుడు, యాత్రావసాన సమయానికి ప్రభాసతీర్థంలో ఉన్నాడు. అక్కడికి చేరుకోగానే, అతనికి,

అచటికి అనతిదూరంలోనే ఉన్న ద్వారావతీ, అక్కడ ఉన్న తన మేనమామ కూతురు సుభద్రా స్ఫురణకు రావటం జరిగింది. ఆ వెంటనే, అతనికి, అక్కడికి పోయి, తన ప్రాణ మిత్రుడైన శ్రీకృష్ణునీ, అందాలరాసి అయిన ఆయన చెల్లెలినీ చూడాలనిపించింది. ఆ నిర్ణయంతోనే, అతడు ఒక త్రిదండి సన్యాసి రూపంలో అక్కడకు వెళ్లాడు. వెళ్లి, అక్కడే చాతుర్మాస్య దీక్షలో కాలం వెళ్లదీయ సాగాడు.

అర్జును డలా అక్కడ ఉన్న సమయంలో, అప్పుడప్పుడు, ద్వారావతీ ప్రజలూ బలరాముడూ కూడా ఆయన్ని సందర్శించు కోవటం ఆయనకు అతిథిపూజలు చేస్తూ ఉండటం జరిగేది. ఐనా, వారెవరూ ఆయన్ని గుర్తించటం మాత్రం సంభవించలేదు.

ఒకసారి, బలరాముడు, ఆయన్ని తన ప్రాసాదానికి ఆహ్వానించి, యతిపూజ చేసి, సభక్తికంగా భిక్షపెట్టాడు. ఆ సమయంలో, అర్జునుడు సుభద్రను చూడటం జరిగింది. అమిత సౌందర్యవతీ, నవయౌవనాంగీ అయిన మేనమామ కుమార్తెను చూడగానే, అర్జునుని మనస్సు ఆమె మీద లగ్నమయింది. ఎలాగైనా ఆమెను తనదాన్ని చేసుకుతీరాలని అతడు నిశ్చయించుకున్నాడు.

అర్జునుడే ఆ యతి రూపంలో ఉన్నాడని తెలియకపోయినా, సుభద్ర కూడా అతణ్ణి ప్రేమించింది. ఆ క్షణంలోనే, అతనికి తన హృదయంలో ఒక పవిత్రస్థానాన్ని కల్పించింది. అప్పటినుంచీ మృదు మధుర భావాలతో, అతణ్ణి అక్కడ సేవించుకోసాగింది.

కాలక్రమాన, సుభద్రను అపహరించుకు పోవాలన్న అభిప్రాయం అర్జునునిలో దృఢమయింది. దానికి తగిన అవకాశంకోసం అతడు తపిస్తూ ఉండటం సంభవించింది.

శ్రీకృష్ణుడు అది గ్రహించాడు. గ్రహించి, ఆ రహస్యాన్ని దేవకీ వసుదేవులకు తెలియపరచాడు. సుభద్రను అర్జునుడు గాంధర్వ పద్ధతిని వివాహం చేసుకోవటానికి వారు అంగీకరించేటట్టు చేశాడు.

ఆ సమయంలో, అక్కడ, రైవతక మహోత్సవాలు జరుగుతున్నై. బలరాముడూ తదితర యాదవ ప్రముఖులూ ఆ మహోత్సవ నిర్వహణలో నిమగ్నులై ఉన్నారు. దేవకీ వసుదేవులూ, శ్రీకృష్ణుడూ ఆయన అష్టపత్నులూ, సుభద్రా ఆమె చెలికత్తెలూ మరికొందరు బంధువులూ మాత్రమే ద్వారావతిలో ఉండటం జరిగింది.

ఆ పరిస్థితినంతనూ అర్జునుడు ఎప్పటికప్పుడు అర్థం చేసుకుంటూనే ఉన్నాడు. అవకాశం లభించినప్పుడల్లా, తన బావమరదితో ఏవేవో సంప్రదింపులు జరుపుతూనే ఉన్నాడు. ఉత్సవ సందర్శనార్థం వా రెప్పుడు, ఎలా నగరంనుంచి బయలుదేరేదీ సవివరంగా తెలుసుకుంటూనే ఉన్నాడు.

అంతలో రథాలు బయలుదేరినై. దేవకీ వసుదేవులు ఒక దివ్య రథాన్నధిరోహించి దారితీశారు. వారి వెనుక, శ్రీకృష్ణుడు తన దేవేరులతో బయలుదేరాడు. చివరకు, సుభద్ర యెక్కిన రథం, ఆ రథానికి వెనుక కొందరు యాదవ వీరుల వాహనాలూ కదలటం జరిగింది.

అది అదనుగా తీసుకున్న అర్జునుడు, మార్గమధ్యంలో, సుభద్ర ఉన్న రథంలోకి అమాంతంగా ఎగిరాడు. రథచోదకుని ఒక ప్రక్కకు నెట్టివేశాడు. అతని స్థానాన్ని ఆక్రమించుకున్నాడు. రథాన్ని ఇంద్రప్రస్థం వేపుగా నడిపించటం మొదలుపెట్టాడు.

అది చూసిన కొందరు యోధులు అతని గమనానికి అవరోధం కలిగించాలని ఎంతగానో ప్రయత్నించారు. కాని, ప్రయోజనం లేకపోయింది.

అది జరిగిన కొంతసేపటికి, ఆ వార్త బలరామునికందింది. అతడు, అమితంగా ఆవేదన పడ్డాడు. ఆవేశ పరవశుడై నాడు. అది గ్రహించిన శ్రీకృష్ణుడు, అతని పాదాలమ్మీదపడి, అర్జునుడు చేసిన దోష మేమీ లేదనీ, దోషమనేది ఏమాత్రమైనా ఉన్నపక్షంలో, అది తనదేననీ, రుక్మిణీహరణ రూపంలో తను చూపిన మార్గాన్నే అర్జునుడు ఆదర్శంగా ఉంచుకోవటం, అనుసరించటం జరిగిందనీ నివేదించు కున్నాడు.

ఆ పరిస్థితినంతనూ అర్థం చేసుకున్న బలరాముడు, ఆ సంద ర్భంలో, అర్జునునకు అండగా ఉన్నవాడు తన తమ్ముడేనని తెలుసు కుని, తన ఆవేశాన్ని ఉపశమింప చేసుకున్నాడు. ఆగ్రహాన్ని అనుగ్ర హంగా మార్చుకున్నాడు. అది కారణంగానే, ఆ తరువాత ఆ నూతన దంపతులకు అతనివద్ద నుంచి అమూల్యమైన కానికలు అశేషంగా చేరటం జరిగింది.

## 121. . . . దుర్వాసుడు :

పాండుపుత్రులు అరణ్యావాసం చేస్తూ ఉండగా, ఒకసారి, దుర్వా సుడు వారికి అతిథిగా వెళ్లాడు. ఆ వెళ్ళటంకూడా, పదివేలమంది శిష్యు లతో, అకాలంలో వెళ్ళాడు.

ఆ మహర్షిని అలా కోరి పంపినవాడు దుర్యోధనుడు. పాండు పుత్రులను ధర్మమార్గాన జయించటం దుర్ఘటమని తేల్చుకున్న అతడు, దుర్వాసుని ఆగ్రహానికి వారిని ఆహుతిచేసి శాంతి పొందాలను కున్నాడు. అది కారణంగానే, ఆ సమయంలో, తనపట్ల ప్రసన్నుడై ఉన్న ఆ మహర్షిని సమీపించి, 'ప్రారబ్ధవశాన పడరాని పాట్లు పడు తున్న పాండుపుత్రులకు, మా అన్నదమ్ములకు కూడా మీ సేవా భాగ్యాన్ని ప్రసాదించి వారిని తరింపచేయవలసింది' అని కోరాడు. అలా చేయటానికి ఆయనదగ్గర మాట తీసుకున్నాడు.

అరణ్యావాసం చేస్తున్న పాండుపుత్రులు అమిత కోపిష్టి అయిన ఆ మహర్షికి తగిన ఆతిథ్యాన్నివ్వటం అసంభవమనీ, అది కారణంగా, ఆ మహర్షి ఆగ్రహించుకుని, వారిని భస్మం చేసి తీరుతాడనీ అతడు భావించాడు. ఆ విధమైన భావనతోనే, అతడు ఆమహర్షినలా ప్రార్థించి పంపటం జరిగింది.

దుర్వాసమహర్షి తమ్ము సమీపించే సమయానికి, పాండుపుత్రులు అతిథి పూజాదికాలు పూర్తిచేసుకుని, అభ్యాగతులకూ ఆశ్రితులకూ షడ్రసోపేతంగా భోజనాలు పెట్టి, తమ భోజనాలు ముగించుకుని, విశ్రాంతి తీసుకుంటున్నారు. సూర్యభగవానుడు వారికి ప్రసాదించిన అక్షయపాత్ర ద్వారా, వారి కానాడు కలుగవలసిన ప్రయోజన మంతా కలిగింది. తిరిగి, మరుసటిదినం మధ్యాహ్నంవరకూ దానివల్ల వారు పొందగల ప్రయోజనం ఏమీ ఉండదు.

అటువంటి సమయంలో, దుర్వాసమహర్షి అలా ప్రత్యక్షం కావటం, తనకూ తనవారికీ భోజనాలు పెట్టే ఏర్పాట్లు చేయవలసిందని యుధిష్ఠిరుని ఆదేశించటం జరిగింది. అది కారణంగానే, ఆ మహర్షికి అర్హమైన ఆతిథ్యాన్నిచ్చి ఆయన్ని సంతుష్టి పరచే అదృష్టం ఆనాటికి తమకు లేకపోయిందనీ, అది కారణంగా, అలా తనకుతానై కోరి వచ్చిన ఆ మహానుభావుని ఆగ్రహానికి గురికావలసి వస్తుందేమోననీ ధర్మరాజాదులు అమితమైన ఆవేదన పడసాగారు.

పాంచాలి ఆ పరిస్థితినంతనూ అర్థం చేసుకుంది. ఆ సమయంలో, తమ్ము ఆ ఆపదనుంచి తప్పించగలవాడు ఆపదోద్ధారకుడైన ఆ శ్రీకృష్ణు డొక్కడే ననుకుంది. ఆ విశ్వాసంతోనే, ఆయన్ని, హృదయ పూర్వకంగా స్మరించుకుంది. స్మరించుకుని :

"కృష్ణా ! నువ్వు భక్తవత్సలుడవు. మేము నీ భక్తులం; నీ చరణాబ్జాలనే ఆశ్రయించి జీవిస్తున్న ప్రాణులం. . . .

నువ్వు ఆపదోద్ధారకుడవు. మే మిప్పుడు అంతు తెలియని ఆపత్సముద్రంలో మునిగి ఉన్నాము. నీ భక్తులైన వారికి ఎప్పుడు ఏ విధమైన ఆపద సంభవించినా, నువ్వు వారికి అండగా నిలబడతావు. వారి ప్రార్థన నంగీకరించి, వారికి, రక్షణ ననుగ్రహిస్తావు. ఆ విధమైన నీ అనుగ్రహాన్ని ఇంతకుముందు మే మెన్నిసార్లో అనుభవించాము. మా పట్ల నువ్వు ప్రదర్శిస్తూ వచ్చిన అభిమానానికి మేము మా కృతజ్ఞతను సర్వవేళలా తెలుపుకుంటూనే ఉన్నాము.

నాయనా! నీ ఆశ్రితులమైన మేము ఈ రోజున మరొక మహోపద్రవాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఈ సమయంలోకూడా మేము నిన్నే నమ్ముకుని ఉన్నాము. నీ అనుగ్రహంకోసమే ఎదురు చూస్తున్నాము. ఇప్పుడుకూడా నువ్వే మమ్మల్ని రక్షించాలి. అమిత కోపనుడైన ఈ దుర్వాసుని ఆగ్రహానికి నీ భక్తులైన నా భర్తలు ఆహుతి కాకుండా చూడాలి;"

అని దీనాతిదీనంగా ప్రార్థించింది.

పరమ పతివ్రత అయిన పాంచాలి. ఆ విధంగా ప్రార్థించే సమయానికి, శ్రీకృష్ణుడు రుక్మిణీదేవితోతన విలాస మందిరంలో ఉన్నాడు. ఆమెదైన దీనాలాపం చెవులబడగానే ఉన్నవాడున్నట్టుగా అక్కడి నుంచి బయలుదేరి, మనోవేగంతో, కామ్యకవనం చేరుకున్నాడు. యుధిష్ఠిరుని శిబిరంలో ప్రవేశించాడు.

జగన్నాథుడైన శ్రీకృషుడు ఆ విధంగా, అనుకోకుండా దర్శనమివ్వటం, అక్కడివారందరికీ ఆశ్చర్యం కలిగించింది. ధర్మరాజాదులు తమ తమ ఆసనాల దినుంచి లేచి, స్వాగతం చెప్పబోతూ ఉండగానే, ఆయన, పాంచాలిని సమీపించాడు. సమీపించి, *124 తనకు

---

*124 ................క్షుధితోఽస్మి భృశాతురః
శీఘ్రం భోజయ మాం కృష్ణే వశ్చాత్ సర్వం కరిష్యసి.

అమితమైన ఆకలి అవుతున్నదని చెప్పి, 'వెంటనే, ఏదిఉంటే అది తెచ్చిపెట్టవలసింది' అని ఆమెను కోరాడు.

ఆపదోద్ధారకుడైన ఆ మహానుభావుని ఆగమనంద్వారా, తమకు సంభవించిన ఆపద తొలగిపోయినట్లే భావిస్తున్న పాంచాలికి, ఆయన పలుకులు అశనిపాతం మాదిరి తోచినై. ఐనా, ఆమె, ఆ వెంటనే, మనసును కుదుట పరచుకుంది. ఆయన ఆపద్బాంధవుడు. తన్ను ఆశ్రయించినవారి ఆపదలను తొలగిస్తాడేకాని, ఏపరిస్థితిలోనూ వారి ఇడుమలను ఇనుమడింపజేయడు. అదే ఆమెదైన దృఢవిశ్వాసం. ఆ విశ్వాసంతోనే, ఆమె ఆయన పలుకులను పరిహాసవచనాలుగా భావించి, ఆయనపాదాలమీదనే చూపునిలిపి ఉండిపోయింది.

అంతలో శ్రీకృష్ణుడు *[125] 'అమ్మా! ఆలస్యం చేయవద్దు; నాకు అమితమైన ఆకలి అవుతోంది' అని తిరిగి అన్నాడు. 'ఏపదార్థమైనాసరే, ఎంత అల్పంగాఉన్నా సరే, వెంటనే తెచ్చిపెట్టవలసింది' అనికూడా తొందరచేశాడు.

శ్రీకృష్ణుడు ఆవిధంగా తన్ను తొందరపెట్టడం అర్థశూన్యమైన పని అయి ఉండదని ద్రౌపది అప్పుడు భావించింది. అది కారణంగానే, ఆమె, వంచి ఉన్న తల నెత్తకుండా, వెంటనే వంట ఇంట్లోకి వెళ్ళింది. వెళ్ళి, ఆ మహానుభావునకు అర్పించుకోతగ్గది ఎక్కడైనా ఏదైనా దొరుకుతుందేమోనని చూసింది. కాని, ఆమె ప్రయత్నమంతా వ్యర్థమే అయిపోయింది. ఎక్కడా ఏమీ కనిపించలేదు. అప్పుడు ఆమె అనుభవించిన నైరాశ్యానికి అంతనేది లేకుండా పోయింది.

ఆసమయంలో ఆమె దృష్టి, ఆప్రక్కనే తొలిచి శుభ్రపరచి ఉంచిన అన్నపాత్ర మీద పడ్డది. అందులో ఏమీ ఉండదని ఆమె

---

*125 కృష్ణే న నర్మకాలోఽయం క్షుచ్ఛ్రామేణాతురే మయి
శీఘ్రం గచ్ఛ మమ స్థాలీమానీయత్వం ప్రదర్శయ.

అభిప్రాయం. అయినా ఆమె పరీక్షగా చూసింది. ఆశ్చర్యంతో, సంతృప్తితో తల పంకించింది. మరుక్షణంలోనే, ఆమె, ఆ పాత్రలో తనకు దొరికిన ఒక మెతుకుతో, మాధవుని సమీపించింది. సమీపించి, ప్రేమ పూరకంగా దాన్ని ఆయన నోటికి అందిస్తూ, 'అనన్య గతికులమైన మా యీ అత్యల్పోపహారం, విశ్వాత్ముడూ, యజ్ఞభోక్తా, అఖిల లోకాధారుడూ అయిన మా అన్నను ఆనందపరచి తీరాలి' అనుకుంది. మానసికంగా ఆయనకు నమోవాకా లర్పించుకుంది.

అంతే, శ్రీకృష్ణుడా మెతుకును సంతోషంతో స్వీకరించాడు. సంతుష్టితో త్రేన్చాడు. సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అయిన శ్రీకృష్ణుడు, ఆవిధంగా సంతుష్టి చెందటంతో, చతుర్దశభువనాలూ సంతుష్టి చెందినై. జీవరాసి అంతా, పంచభక్ష్య పరమాన్నాలతోనూ భోజనం చేసినట్టు సంతృప్తితో త్రేన్చింది. స్నానార్థం నదికి వెళ్లి వస్తున్న దుర్వాస మహర్షీ ఆయన శిష్యులూ కూడా, అలా ఆకలితీరిన వారై, పాండుపుత్రుల మాటనే మరచిపోయి, తమదారిన తాము వెళ్లిపోయినారు.

శ్రీకృష్ణుడు అదంతా గ్రహించాడు. మందహాసంచేస్తూ, యుధిష్ఠిరాదులను సమీపించాడు. 'మహాసాధ్వి అయిన మా చెల్లెలి తేజం ఆ మహర్షిని మళ్లీ ఇటు రాకుండా చేసింది' అని వారికి తెలియ బరచాడు.

అదంతా విచిత్రంగా భావిస్తూ ఉన్న ధర్మరాజాదులు, దుశ్శాసనుని చేతులో ద్రుపదరాజ పుత్రి పరాభవం పాలు కాకుండా ఆనాడు కాపాడినట్టే, ఈనాడు, దుర్వాసుని దురాగ్రహానికి తాము గురి కాకుండా రక్షించిన శ్రీకృష్ణుని పలువిధాల ప్రస్తుతించారు. తమ కృతజ్ఞతను, ఆయనకు హృదయపూర్వకంగా తెలుపుకున్నారు.

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, పాండుపుత్రుల వద్దా, పాంచాలి వద్దా సెలవు తీసుకుని, ద్వారావతి చేసుకోవటం జరిగింది.

## 122 . . . బాణాసురుడు :

ప్రహ్లాదుని కుమారుడైన విరోచనుని మనుమడు బాణుడు. అతడు శోణపురాధిపతి. జ్ఞాని. సత్యవ్రతుడు. దానశీలి. దృఢ సంకల్పుడు. మహేశ్వర భక్తుడు. ఆ మహేశ్వరుని ఆదేశం ప్రకారం, దేవతలుకూడా అతనికి ఊడిగం చేస్తూ ఉండేవారు.

అత డొకసారి కుబేరశైలానికి వెళ్లాడు. అలా వెళ్లిన అతనికి, షణ్ముఖుని లాలిస్తున్న ఆది దంపతుల దర్శన మయింది.

షణ్ముఖుని తేజం చూసి బాణుడు విస్మితుడైనాడు. ఏ తపస్సు చేసి ఆ చిరంజీవి ఉమాసుతుడై, శంకరుని అలా ప్రేమపాశ బద్ధుని చేశాడో, అదేవిధమైన తపస్సును తనుకూడా చేయ సంకల్పించాడు భక్తియోగం ద్వారా, మనో వా క్కాయ కర్మలను ఏకీకృతం చేసి, నిష్టతో మహేశ్వరుని అర్చించసాగాడు.

ఆ తపస్సు అనేక సంవత్సరాలు జరిగింది. అతని భక్తికి మెచ్చి, శంకరుడు, పార్వతి నుద్దేశించి, 'ఇతడు నా భక్తుడు. మన కుమారుని తరువాతివానిగా ఇతణ్ణి నువ్వు ప్రేమతో చూసుకోవలసింది' అని అతణ్ణి ఆమెకు ఒప్పచెప్పాడు. ఆపైన, అతడు ఉండటానికి శోణ పురాన్నిచ్చాడు. ఆ పుర రక్షణభారాన్ని తను వహించాడు. ఆ సందర్భంలోనే, అతనికి వాహనంగానూ కేతనంగానూ ఉండేనిమిత్తం, కుమారస్వామి, ఒక దివ్య మయూరాన్ని అతనికి ప్రసాదించటం జరిగింది.

ఆ గర్వంతో, బాణుడు, దేవ గంధర్వ భుజగాదులనూ, యక్ష భూతాదులనూ అందరినీ ధిక్కరించసాగాడు. తన కెవరూ సాటి కారన్న అహామికతో ప్రవర్తించసాగాడు. ఆ సమయంలోనే, అత డొకసారి, మహేశ్వరు నుద్దేశించి, 'స్వామీ ! పరమేశ్వరుని భక్తులు కూడా తీరని కోరికతో పరితపించి పోవలసిందేనా !' అని అడిగాడు.

బాణుని ఆవేదన శంకరునకు అవగతం కాలేదు. అందుకనే, ఆయన, అతణ్ణి ఉద్దేశించి, 'నీ అభిప్రాయమేమిటో నివేదించుకోవలసింది' అన్నాడు. అది అదనుగా తీసుకుని, బాణుడు...

'అనిలో నన్ను నెదిర్చి బాహుబల శౌర్య స్ఫూర్తి బోరాడ జా
లిన వీరుం డొకడైన బందెమునకున్ లేడయ్యె భూమండలి
న్ననయంబున్ భవదీయదత్తకర సాహస్రంబు కండూతి వా
యు నుపాయంబును లేద యీ భరము నెట్లోర్తున్నుమానాయకా!'

అని తన మనోగతాభిప్రాయాన్ని మనవి చేసుకున్నాడు.

మహేశ్వరునికి అది విపరీతమైన కోరికగా తోచింది. కాని, చేయగలదేమీ లేక...

'విను మూఢ హృదయ నీ కే
తన మెప్పుడ కారణంబ ధారుణిపై గూ
లును నపుడ నీ భుజావలి
తునియగ నాయంతవానితో ననిగల్గున్'

అని, అతణ్ణి సమాధానపరచి పంపించా .

ఆక్షణంనుంచీ, బాణుడు, తన కేతనమెప్పుడు కూలుతుందా అనీ, తనకోరిక ఎప్పుడు తీరుతుందా అనీ నిమిషాలు లెక్కపెట్టుకో సాగాడు.

## 123. ... ఉషానిరుద్ధులు :

అత డలాఉండగా, అతనికుమార్తె అయిన ఉషాకన్య, ఒకరోజున, ప్రద్యుమ్నుని కుమారుడైన అనిరుద్ధుని కలలో చూడటం జరిగింది. శ్యామవర్ణుడూ, కమలలోచనుడూ, పీతాంబరధారీ, ఆ జానుబాహుడూ, మన్మథాకారుడూ అయిన అతణ్ణి చూడగానే, ఆమె మనసు అతనిమీద లగ్నమయింది. అతడినే వివాహం చేసుకోవాలని ఆమె నిర్ణయించుకుంది,

ఆ రహస్యాన్ని, బాణునిమంత్రిఅయిన కుంభాండుని కూతురూ, ఆమె స్నేహితురాలూ అయిన చిత్రరేఖ గ్రహించింది. గ్రహించి, తన యోగబలంద్వారా, అనిరుద్ధుని, అమాంతంగా యెత్తుకు వచ్చి, ఉషాకన్యకు అప్పగించింది. ఆరోజునుంచీ, ఉషానిరుద్ధులు శోణపుర రాజాంతఃపురంలో అమితానందంతో కాలం గడుపసాగారు.

ఆవిషయం, కాలక్రమాన, అలాఅలా బాణునకు తెలిసింది. అది కారణంగా, అతనికి అంతులేని ఆగ్రహం కలిగింది. ఆ వెంటనే, అతడు ఉషాకన్య ఉన్న మందిరానికి వెళ్లాడు.

బాణుడు అలా వెళ్లిన సమయానికి, అనిరుద్ధుడు, అక్కడ, ఉషా కన్యతో పాచికలాడుతున్నాడు. అదిచూసిన బాణాసురుడు, తన భటులను అతనిమీదికి పంపాడు. అతణ్ణి బంధించవలసిందిగా ఆదేశిం చాడు.

అది గ్రహించిన అనిరుద్ధుడు, ఆవెంటనే, తన ఆయుధాలు తీసుకుని, దండధరుని మాదిరి వారితో తలపడ్డాడు. అప్పుడు జరిగిన పోరులో, బాణుని సైనికులు చాలామంది కూలిపోయినారు. మిగిలిన వారు ప్రాణభీతితో పారిపోయినారు. అది గ్రహించిన బాణుడు, ఆవెంటనే, అనిరుద్ధునిమీద నాగపాశాన్ని ప్రయోగించాడు. అతణ్ణి బంధించాడు.

అనిరుద్ధుడు ఆవిధంగా బంధితుడయిన ముహూర్తంలోనే, బాణాసురుని కేతనం, ప్రచండధ్వనితో, అకారణంగా ఒరిగిపోయింది. అదిచూసిన బాణాసురుడు, మహేశ్వరునిమాట నిజం కాబోతోం దను కున్నాడు. ఆసమయానికే ఎదురుచూడసాగాడు.

అక్కడ, ద్వారకానగరంలో, అనిరుద్ధుని జాడ తెలియక, యాదవులు అమితవేదన ననుభవిస్తున్నారు. ఆసమయంలో, ఒకసారి, నారదమహర్షి, శ్రీకృష్ణ సందర్శనార్థం అక్కడకు వెళ్ళటం జరిగింది.

అలా అనుకోకుండా దర్శన మిచ్చిన త్రిలోకసంచారికి, బల రామాదులు, తమ అనిరుద్ధుడు అదృశ్యుడయిన విషయం తెలియపరచు కున్నారు. అది విన్న నారదుడు, అనిరుద్ధుడు క్షేమంగానే ఉన్నాడనీ, కాని ఆసమయంలో, ఉషాకన్య నిమిత్తంగా, బాణాసురునిచేత బంధితుడై ఉండటం జరిగిందనీ విశదపరచాడు. వారి ఆవేదనను ఉపశమింపచేశాడు.

అలా నారదునిద్వారా అనిరుద్ధుని విషయం గ్రహించిన బల రామ కృష్ణులు, ఆవెంటనే, పన్నెండ క్షౌహిణుల బలంతో బయలుదేరి శోణపురంమీద దాడి చేశారు. ఆ దాడిలో, వారు...

సరి దారామ సరోవరోపవన యజ్ఞస్థానముల్ మాపి వే
పరిఖల్ పూడిచి యంత్రముల్ దునిమి వప్రవ్రాతముల్ 'కూల్చి'గో
పురముల్ గూలగద్రోచి సౌధభవనంబుల్ నూకి ప్రాకారములో
ధరణిం 'జేర్చి' కవాటముల్ విటిచి రుద్దండ క్రియాలోలురై.

124. విష్ణువిజయం :

ఆవిధంగా తన పురాన్ని నిరోధించిన యాదవవీరులను చూసి, బాణాసురుడు ఉగ్రుడయినాడు. తనుకూడా, పన్నెండ క్షౌహిణుల బలంతో కదనరంగానికి ఉరికాడు. ఆ సమయంలో, అతని నగర రక్షకు డయిన శంకరుడు, సమరోత్సాహంతో శ్రీకృష్ణుని మీదికివెళ్లాడు. శంకరు డలా బయలుదేరటంచూసిన ప్రమథులూ, కార్తికేయాదులూ, భూతగణాలతో ఆయన్ని అనుసరించారు.

ఆతరువాత జరిగిన భీకర సంగ్రామంలో, శ్రీకృష్ణుడు తన శార్ఙచాపంద్వారా, వాడి బాణాలను వదలి, బాణునికి సహాయకులుగా వచ్చిన భూత ప్రేత గుహ్యకాదు లందరినీ అమితంగా పీడించాడు. ఆ

పైన. [126] *మహేశ్వరుడు ప్రయోగించిన వాయవ్యాస్త్రానికి ప్రతిగా పార్వతాస్త్రాన్నీ, ఆగ్నేయాస్త్రానికి మారుగా పర్జన్యాస్త్రాన్నీ, పాశుపతాస్త్రానికి ప్రతిగా నారాయణాస్త్రాన్నీ ప్రయోగించి, ఆ యా దివ్యాస్త్రాలను శాంతింపచేశాడు. ఆ వెంటనే, జృంభణాస్త్రాన్ని మంత్రించి వదలి, మహేశ్వరుని సమ్మోహితుని చేశాడు. ఆపైన బాణుని సేనమీద విజృంభించాడు.

అది చూసిన బాణునికి ప్రాణభీతి కలిగింది. అది కారణంగా, అతను అదనుచూసుకుని అక్కడినుంచి పారిపోయినాడు.

తన భక్తు డావిధంగా పరాజయం పొందటంచూసి, మహేశ్వరుడు, ఆవెంటనే, మూడు శిరాలతోనూ, మూడు పాదాలతోనూ ఉండే ఒక భీకరశక్తిని సృజించి శ్రీకృష్ణునిమీదికి పంపాడు. అది గ్రహించి. శ్రీకృష్ణుడు, దానితో తలపడేనిమిత్తం మరొక ఘోర భీకరశక్తిని సృజించి వదిలాడు.

దివ్యతేజంతో తనమీదికి వచ్చే వైష్ణవశక్తిని చూసి, శివశక్తి, భయపడి, పారిపోవటానికి ప్రయత్నించింది. కాని, వైష్ణవశక్తి దాన్ని వదలలేదు; తరుముకుంటూ దానివెంటపడ్డది. అది గ్రహించిన శివశక్తి, గత్యంతరంలేక, అటూ ఇటూ తిరిగి, చివరకు శ్రీకృష్ణుని చరణాబ్జాల నాశ్రయించింది; ఆయన నిలా స్తుతించింది.

"కృష్ణా ! నువ్వు అనంతశక్తి సంపన్నుడవు. చతుర్ముఖుని కన్నతండ్రివి. మహేంద్రునకూ మహేశ్వరునకూకూడా అధిపతివి. ప్రపంచ సృష్టి స్థితి లయాలకు కారణభూతుడవు. ఆది మధ్యాంతరహితుడవు.

---

*126 బ్రహ్మాస్త్రస్య చ బ్రహ్మాస్త్రం వాయవ్యస్య చ పార్వతం
ఆగ్నేయస్య చ పార్జన్యం నైజం పాశుపతస్య చ
మోహయిత్వా తు గిరిశం జృంభణాస్త్రేణ జృంభితం
బాణస్య పృతనాం శౌరి ర్జఘా నాసి గదేషుభిః.

సురలనూ సాధువులనూ ధర్మాన్నీ రక్షించటానికి, హింసాపరు లయినవారిని శిక్షించటానికి, భూభారాన్ని తొలగించటానికి నువ్వు నానావిధ లీలావతారాలను ధరిస్తూ ఉంటావు.

తండ్రీ! దుస్సహమైన నీ తేజం నన్ను తపింపజేస్తోంది. నిన్నాశ్ర యించిన నన్ను కరుణించ వలసింది. నీ చరణాబ్జాలను చేరినవారికి తాపోపశమనం కలిగితీరుతుందన్న నీ నుడిని సార్థక పరచుకోవల సింది."

ఆ విధంగా, శివశక్తి శ్రీకృష్ణుని ప్రస్తుతిస్తూ ఉన్న సమయంలో, భూదేవి, చతుర్ముఖుని సమీపించి, శివకేశవులమధ్య జరిగే సంగ్రా మాన్ని వారించవలసిందిగా కోరింది; ప్రళయాన్ని తొలగించవల సిందిగా బ్రతిమాలుకుంది.

ఆవెంటనే, చతుర్ముఖుడు, శంకరుని సమీపించి, రాక్షసులు వధ్యులనీ వారికోసం సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అయిన శ్రీకృష్ణునితో పోరాడటం అసమంజసమనీ, అదీకాక, హరి హరుల అభేదత్వాన్ని హరుడే విస్మరించటం విపరీతంగా ఉన్నదనీ తెలుపు కున్నాడు.

చతుర్ముఖుని పలుకులు విని, శంకరుడు యుద్ధం చేయటం మానుకున్నాడు. అదిగ్రహించిన శ్రీకృష్ణుడు, శివశక్తి పట్ల ప్రసన్నుడై, ఆమెకు అభయమిచ్చి పంపివేశాడు; శంకరుని గాఢంగా ఆలింగనం చేసుకున్నాడు.

అంతలో, బాణుడు తిరిగి రణరంగంలో ప్రవేశించాడు. ప్రవేశి స్తూనే భీకరంగా గర్జించసాగాడు.

అలా తిరిగి విజృంభించిన బాణుని మీద, శ్రీకృష్ణుడు, తన నిశితాస్త్రాలను ప్రయోగించసాగాడు. అదిచూసిన మహేశ్వరుడు, శ్రీకృష్ణుని ఉద్దేశించి, బాణుడు తన భక్తుడనీ, అతణ్ణి దయతో చూడ వలసిందనీ ప్రార్థించాడు,

మహేశ్వరుని ప్రార్థనవిన్న మాధవుడు మందహాసంచేశాడు. అతణ్ణి దగ్గరకు తీసుకున్నాడు. తీసుకుని,*127

"ఉమాపతీ! ఈ బాణుడు నీ కెంతటి ప్రియుడో నాకూ అంతటి ప్రియుడే. ఇతడు ప్రహ్లాదుని వంశీయుడు కావటమే దానికి మూలం. అది కారణంగానే, నేనితణ్ణి సంహరించకుండా, భూభారాన్ని తొలగించే ఉద్దేశంతోనూ, ఇతని క్రొవ్వునడగించే అభిప్రాయంతోనూ ఇతడి సైన్యాన్ని నిర్మూలించాను. ఇతనికి గర్వకారణమైన భుజబలాన్ని హరించాను. ఇక ఇత డెవరికీ భయపడవలసిన పనిలేదు; నీ పార్షదులలో ప్రముఖుడై మాన్యతపొందటానికి ఏ విధమైన ఆటంకమూలేదు" అని తెలియపరచాడు.

ఆ పలుకులు విన్న బాణుడు అమితానందం పొందాడు. ఆ వెంటనే, అతడు, శ్రీకృష్ణుని విధ్యుక్తంగా పూజించాడు. ఆయననూ, బలరామునీ తదితర ప్రముఖులనూ తన ప్రాసాదానికి తీసుకపోయి ఉషానిరుద్ధులను వారికి ఒప్పగించుకున్నాడు. ఆవిధంగా వారితో సంబంధం కలుపుకుని, ఆపైన, అమిత సంతుష్టితో వ్యవహరించ సాగాడు.

## 125. రాయబారం :

పాండుపుత్రులు పడరానిపాట్లుపడి, అజ్ఞాతవాసం నిర్విఘ్నంగా పూర్తిచేసుకున్నారు. అజ్ఞాతవాసానంతరం, విరటపుత్రి అయిన ఉత్త

*127 అవధ్యోఽయం మమాప్యేష వైరోచని సుతోఽసురః
ప్రహ్లాదాయ వరో దత్తో న వధ్యోమే తవాన్వయః.
దర్పోపశమనాయాస్య ప్రవృక్ణా బాహవో మయా
సూదితం చ బలం భూరి యచ్చ భారాయితం భువః.
చత్వారోఽస్య భుజాః శిష్టా భవిష్యన్త్యజరామరాః
పార్షద ముఖ్యో భవతో నకుతశ్చిద్ భయోఽసురః.

రను అర్జునకుమారుడైన అభిమన్యునకిచ్చి వివాహం చేయటం జరిగింది. ఆ వివాహానికి, విరటుని ఆహ్వానంమీద, శ్రీకృష్ణుడు, బంధుమిత్రులతోసహా, విరాటనగరానికి విచ్చేశాడు.

వివాహానంతరం, యాదవవీరులూ, వివిధదేశాధీశ్వరులూ కొలువుదీరిఉన్న సమయంలో, శ్రీకృష్ణుడు, ఆపైన పాండుపుత్రులదైన ధర్మాన్నిగురించి ప్రస్తావించాడు. ధర్మప్రకారం, వారిదైన రాజ్యాన్ని వారు తిరిగి పొందాలని సూచించాడు. దానికి, అవసరమైతే యుద్ధం చేయటంకూడా సమంజసమేనని నిర్ధారించాడు. ఆ సమయంలోనే, కౌరవులకూ పాండవులమధ్య యుద్ధమే అనివార్యమైన పక్షంలో, ధర్మమూర్తులైన పాండుపుత్రులు ధార్తరాష్ట్రులను జయించటం తథ్యమనీ, దాని ఫలితంగా, కురువంశం నిర్మూలమైనా కావచ్చుననీ, అటువంటి భయానకమైన పరిణామం తటస్థించకుండా చూడటం పూజ్యులయినవారి ధర్మమనీ కూడా బోధించాడు.

శ్రీకృష్ణుని ఉపదేశం, అక్కడ సమావేశమైనవారందరినీ ఆకర్షించింది. కాని, బలరాముడు మాత్రం, కురుపాండవులమధ్య సంధి జరిగేటట్టు చూడటం సమంజసమని తెలియపరచాడు. సాత్యకి ప్రభృతులు ఆయన అభిప్రాయాన్ని అంగీకరించలేకపోయినారు. యుద్ధం అనివార్యమనే వారు దృఢంగా విశ్వసించారు.

శ్రీకృష్ణుని అభిప్రాయం కూడా అదే; అయినా, యుద్ధాన్ని నివారించగలశక్తి ఉండికూడా శ్రీకృష్ణుడు ఉపేక్షచేశాడన్న అపవాదు రాకుండా చూసుకునే నిమిత్తం, ఆయన, దుర్యోధనాదుల వద్దకు దూతను పంపటానికి సమ్మతించాడు.

ద్రుపదుడాపైన ఒక దూతను పంపటం, దుర్యోధనాదులు ఆ దూతను అవమానపరచటం, ఇరువర్గాలవారూ యుద్ధానికి సన్నద్ధులు కావటం జరిగింది. ఆ సమయంలో, తుది ప్రయత్నంగా, శ్రీకృష్ణుడే పాండవుల పక్షాన, రాయబారిగా హస్తినాపురానికి వెళ్లాడు.

శ్రీకృష్ణుడు రాయబారిగా వస్తున్నాడని విన్న ధృతరాష్ట్రుడు అమితానందం పొందాడు. ఆయనకు ఉచితరీతిని స్వాగత సత్కారాలు జరిపించాలనీ, ఎలాగైనా, ఆయన తనపుత్రుల పక్షాన పోరాడేటట్లు చేయాలనీ అతడు ఆలోచించాడు. కాని, విదురుడు. శ్రీకృష్ణుడు ధర్మమూర్తి అనీ, ఆ మహానుభావుని సహాయం అధర్మపరుల కేనాటికీ లభించదనీ ఆయనకు తెలియపరచాడు. అంతలో దుర్యోధనుడు తన తండ్రిని కలుసుకుని, శ్రీకృష్ణుని సన్మానించటం దోషమనీ, అవకాశం కల్పించుకుని అయినా, ఆయనకు, తమ బలాధిక్యతను విశదపరచటం అవసరమనీ విన్నవించుకోటవం జరిగింది. భీష్మాది కురువృద్ధులు దుర్యోధనుని విపరీతాభిప్రాయాన్ని గర్హించారు. కాని, వారుచేయగలదేమీ లేకపోవటంవల్ల, తటస్థంగా ఊరుకున్నారు.

అంతలో, శ్రీకృష్ణుడు నగరంలో ప్రవేశించాడు. కురువృద్ధులూ, తదితర ప్రముఖులూ ఆయనను కలుసుకున్నారు ఉచిత రీతిని ఆయనకు స్వాగతం చెప్పారు.

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, అక్కడ సమావేశమైనవారందరినీ పలుకరించాడు. అనంతరం కుంతీదేవిని కలుసుకున్నాడు, కుశల ప్రశ్నలు వేశాడు. ఆమె మనోవ్యథనంతనూ అర్థం చేసుకుని, ఆమె చెప్పినదంతా విని, ఆమెకు కొంత ఊరట కలిగించాడు; ఆపైన, విశ్రాంతి తీసుకునే నిమిత్తం విదురునింటికి వెళ్ళాడు.

ఆ మరునాడు, మహాసభామధ్యంలో ఉన్న ధృతరాష్ట్రుని ఉద్దేశించి, పాండవులపక్షాన వాదించాడు. వారి రాజ్యాన్ని వారికి ఇచ్చివేయటం సమంజసమని బోధించాడు. పాండుపుత్రులనుకూడా అతడు తన పుత్రులనుగా చూసుకోవటం ధర్మమనీ, అలా కాని పక్షంలో అతనికి దుఃఖం ప్రాప్తించి తీరుతుందనికూడా తెలియపరచాడు.

శ్రీకృష్ణుని అభిప్రాయాన్ని ఆ సభలో ఉన్న మహర్షులందరూ శ్లాఘించారు, ఆపైన, వారు, దుర్యోధనుని ఉద్దేశించి,

'శ్రీకృష్ణుని హితవచనాలను శిరసావహించ వలసింది' అని బోధించారు. కాని, దుర్యోధనుడు, వారి బోధనల నన్నింటినీ పెడచెవిని పెట్టాడు. అంతేకాదు. తాను జీవించి ఉండగా, పాండు పుత్రులకు సూదిమొన మోపేటంతటి స్థలమైనా ఇవ్వటం జరగదన్న తన నిశ్చితాభిప్రాయాన్ని వారికి తెలియ పరచాడు; అదే శ్రీకృష్ణునకు కూడా వెల్లడించాడు.

ఆపైన, శ్రీకృష్ణుడు, ధృతరాష్ట్రుని ఉద్దేశించి, సుయోధనుడు, పూర్వం కంసుడు వ్యవహరించినట్టుగా వ్యవహరిస్తున్నాడనీ, అతని మూలంగా కురు వంశానికే చేటు మూడబోతున్నదనీ విశదపరచాడు. యాదవులు, కంసుని ఒదులుకుని, తమ వంశాన్ని రక్షించుకున్నట్టుగా, కౌరవులు దుర్యోధనుని త్యజించి తమ వంగడాన్ని నిలుపుకోవటం సమంజసమని ఉద్బోధించాడు.

అది విన్న దుర్యోధనుడు అమితంగా ఆగ్రహించుకున్నాడు. అది కారణంగానే, అతనిలోని వివేచనాజ్ఞానం పూర్తిగా నశించిపోయింది. పాండవులు శ్రీకృష్ణునిమీద ఆధారపడి యుద్ధానికి దిగారనీ, వారికి వెన్నెముకగా ఉన్న ఆ శ్రీకృష్ణుని బంధించి, కారాగారంలో ఉంచిన పక్షంలో, వారు చేయగలదేమీ ఉండదనీ, ఆ పరిస్థితిలో, వారు, క్రుంగి కృశించి మరణించి తీరుతారనీ అతడు భావించాడు. ఆ విధమైన భావంతోనే అతడు, తన సహచరుల సాయంతో, శ్రీకృష్ణుని బంధించటానికి పూనుకున్నాడు.

దుర్యోధనాదుల దుర్మంత్రం, శ్రీకృష్ణునకు అవగతమయింది. ఆ వెంటనే, ఆయన, అటువంటి అత్యాచారమేదీ జరుగకుండా చూడవలసిందని ధృతరాష్ట్రుని కోరాడు. అంతేకాదు.

'నాపట్ల దుర్యోధనాదులు ఏ విధమైన దౌర్జన్యానికి పూనుకున్నా, నేను, స్వీయ రక్షణార్థం, వారిని ప్రతిఘటించవలసి

ఉంటుంది. ఆ ప్రతిఘటనా ఫలితం ఎంత దారుణంగా పరిణమించినా దానికి బాధ్యులు నీ కుమారులే అన్న యథార్థాన్ని నువ్వు గ్రహించ వలసి ఉంటుంది' అని కూడా హెచ్చరించాడు.

అది విన్న ధృతరాష్ట్రుడు, అమితంగా భయపడి పోయినాడు. ఆ వెంటనే దుర్యోధనాదులను తన దగ్గరకు రప్పించుకుని, వారందరినీ తీవ్రంగా మందలించాడు. సర్వనాశనాన్ని తలపెట్టని పక్షంలో, శ్రీకృష్ణుని హితోక్తిని శిరసావహించవలసిందనీ, సర్వలోకేశ్వరుడైన ఆయన చరణాబ్జాల నాశ్రయించ వలసిందనీ బోధించాడు. కాని, ఆ హితబోధ దుర్యోధనుని మనసును ఏమాత్రంగానూ కూడా మార్చ లేకపోయింది. అది గ్రహించిన శ్రీకృష్ణుడు, దుర్యోధనుని ఉద్దేశించి ఇలాఅన్నాడు.

"రాజా! నేను ఏకాకినై ఉన్నాననీ, నన్ను బంధించటం సులభ మనీ నువ్వు భావిస్తున్నట్టున్నావు. అదే యథార్థమైన పక్షంలో నువ్వు ఉట్టి భ్రమలో ఉన్నావని రూఢిగా చెప్పవలసి ఉంటుంది. ఇప్పుడు, చతుర్దశ భువనాలలోనూ ఉండే జీవరాసి అంతా నా సమ ఖూన ఉంది. నన్నే ఆశ్రయించి ఉంది. ఆ యథార్థాన్ని గ్రహించి అయినా, నువ్వు, నీకు శ్రేయోదాయకమైన మార్గాన్ని అనుసరించ వలసింది."

ఆ పలుకులువిన్న దుర్యోధనుడు విరగబడినవ్వాడు. అదిచూసిన అతని సహచరులందరూ కూడా అప్పుడు అతనినే అనుకరించారు.

శ్రీకృష్ణుడు, అదంతా తనకు జరిగిన ఘోరావమానంగా భావిం చాడు. అది కారణంగానే, ఆయన ఆ వెంటనే, వారందరికీ భీతిజనించే విధంగా, తన విశ్వరూపాన్ని ప్రదర్శించటం జరిగింది. ఆ సమయంలో

*[128] అక్కడ ఉన్న అందరకూ, ఆయనలో, అంగుష్టమాత్రమైన శరీరాలతో భూతజాలమంతా ద్యోతమయింది. బ్రహ్మరుద్రామరేంద్రాదులూ, లోకపాలురూ, సిద్ధులూ, సాధ్యులూ, వసువులూ, అశ్వినులూ, మరుద్గణాలూ, విశ్వేదేవతలూ, యక్ష గంధర్వ ఉరగ రాక్షసాదులూ, పాండుపుత్రులూ, వృష్ణ్యంధకాదులూ, ప్రద్యుమ్నాది ప్రముఖులూ అందరూ గోచరమైనారు.

అలాగే, శ్రీమన్నారాయణునివైన మహాయుధాలు, శంఖమూ, చక్రమూ, గదా, శక్తీ, శార్ఙ్గమూ, లాంగలమూ, నంద

---

*128 అంగుష్టమాత్రాః త్రిదశా ముముచుః పావకార్చిషః
తస్యబ్రహ్మా లలాటస్థో రుద్రో వక్షసి చా భవత్.
లోకపాలా భుజేష్వాస న్నగ్ని రాస్యా దజాయత
ఆదిత్యాశ్చైవ సాధ్యాశ్చ వసవోఽ థాశ్వినావపి.
మరుతశ్చ సహేంద్రేణ విశ్వేదేవా స్తథైవ చ
బభూవుశ్చైవ యక్షాశ్చ గంధర్వోరగ రాక్షసాః.
ప్రాదురాస్తాం తథా దోర్భ్యాం సంకర్షణ ధనంజయౌ
దక్షిణేఽ ర్జునో ధన్వీ హలీ రామశ్చ సవ్యతః.
భీమో యుధిష్ఠిరశ్చైవ మాద్రీపుత్రౌ చ పృష్ఠతః
అంధకా వృష్ణయశ్చైవ ప్రద్యుమ్న ప్రముఖా స్తతః.
అగ్రే బభూవుః కృష్ణస్య సముద్యత మహాయుధాః
శంఖ చక్ర గదా శక్తి శార్ఙ్గ లాంగల నందకాః.
అదృశ్యన్తోద్యతాన్యేవ సర్వప్రహరణాని చ
నానా బాహుషు కృష్ణస్య దీప్యమానాని సర్వశః.
నేత్రాభ్యాం న స్తతశ్చైవ శ్రోత్రాభ్యాం చ సమన్తతః.
ప్రాదురాసన్ మహారౌద్రాః సధూమాః పావకార్చిషః
రోమ కూపేషు చ తథా సూర్యస్యేవ మరీచయః...

కమూ మొదలైనవన్నీ అప్పుడు ఆయన నాశ్రయించినై. అనేక బాహువులతో, అనేక నేత్రాలతో, అనేక శ్రోత్రేంద్రియాలతో ఆయన చూపట్టాడు. ఆయన రూపం మహారౌద్రమైనదిగా ఉంది. ఆయన రోమకూపాలనుంచి పావకాగ్ని జ్వాలలు వెల్లుబుకసాగినై. ఆయన దైన మూర్తి, కోటి సూర్యులకాంతితో ప్రకాశించింది.

భయంకరమైన ఆ రూపాన్ని దర్శించలేక, అప్పు డక్కడ ఉన్న దుర్యోధనానుచరు లందరూ భయంతో కళ్లు మూసుకున్నారు. నిర్విణ్ణులైపోయినారు. కాని, తపోధనులైన మహర్షులూ, మహామహు లైన ద్రోణ భీష్మ విదుర సంజయాదులూ, ధృతరాష్ట్రుడు మొద లైన కొందరూ మాత్రం, శ్రీకృష్ణుడు ప్రసాదించిన దివ్యచక్షువుల ద్వారా ఆ మహాద్భుత రూపాన్ని అవలోకించి, మహదాశ్చర్యమగ్ను లైనారు.

ఆ సమయంలో, అక్కడ, దేవ దుందుభులు శబ్దించినై. పూల వాన కురిసింది. అంతలో, దివిజులందరూ ఆయన చుట్టూచేరి ఆయన్ని బహువిధాల స్తుతించారు. సాష్టాంగ ప్రణామా లాచరించారు. ఆ దివ్యరూపాన్ని ఉపసంహరించుకోవలసిందిగా భక్తియుక్తులై ప్రార్థించారు.

దేవతలదైన ప్రార్థన నాకర్ణించి సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అయిన శ్రీకృష్ణుడు, తన విశ్వరూపాన్ని ఉపసంహరించుకున్నాడు. అదే సమయంలో, అంతవరకూ అక్కడ ఉన్న మహర్షులందరూ అంత ర్హితులు కావటం, భీష్మాది కురు వృద్ధుల ప్రార్థనాదికాలను స్వీక రిస్తూ, శ్రీకృష్ణుడు రథారోహణం చేసి, సాత్యకి ప్రభృతులతో బయలు దేరి, యుధిష్ఠిరాదులను కలుసుకుని, హస్తినాపుర విశేషాలను వారికి తెలియపరచటం, ఆ తరువాత ద్వారావతి చేరుకోవటం జరిగింది.

## 126. బల విభజనం :

విప్రదౌత్యం విఫలమైన తరువాత, వాసుదేవుని రాయబారం వ్యర్థమైన మీదట, పాండుపుత్రులు సమరరంగ ప్రవేశం సమంజసమై నదేనని నిర్ణయించుకున్నారు. ఆ నిర్ణయాన్ననుసరించే, వారు, ద్రుపదునితోనూ విరాటునితోనూ సంప్రదింపులు జరిపి, తమపట్ల అభిమానం ఉన్న రాజన్యులందరకూ, తమతమ సేనలతో తరలి రావలసిందిగా సందేశాలు పంపారు. ఆ సందేశాలు చాలావరకు సఫలమయినై.

ఆ సందర్భంలో, ఒకసారి, శ్రీకృష్ణుని సందర్శించి, ఆయన సహాయాన్ని అర్థించి పొందటం అవసరమని పాండుపుత్రులు భావించారు. అది కారణంగానే, అర్జునుడు ఆయన వద్దకు పోవటం జరిగింది.

అర్జునుడు శ్రీకృష్ణ మందిరంలో ప్రవేశించే సమయానికి, గోవిందుడు నిద్రపోతున్నాడు. అంతకుముందే అక్కడికి చేరిన దుర్యోధనుడు, ఆ మహానుభావుని తలవంక ఉన్న ఒక ఉన్నతాసనం మీద ఉపవిష్టుడై ఉన్నాడు. అది చూసి, అర్జునుడు, శ్రీకృష్ణుని పాదాలకు చేరువగా, చేతులు జోడించి నుంచున్నాడు.

అంతలో శ్రీకృష్ణుడు నిద్రనుంచి లేచాడు. లేస్తూనే, అర్జునుని చూశాడు, మందహాసం చేశాడు. పలుకరించాడు. భక్తిపూర్వకంగా అతడు సలిపిన అభివాదన నందుకున్నాడు. ఆ సమయంలోనే, ఆయన, దుర్యోధనుని చూడటం జరిగింది.

శ్రీకృష్ణుడు అతనికి కూడా స్వాగతం చెప్పాడు. అతని యోగక్షేమాలను కూడా విచారించాడు. ఆ తరువాత, అతడలా రావటానికి గల కారణం తెలుపవలసిందిగా కోరాడు.

ఆయనకు సమాధానంగా, దుర్యోధనుడు, 'కృష్ణా! మాకూ మా జ్ఞాతులకూ మధ్య జరుగబోయే యుద్ధంలో నీ సహాయాన్నర్థించ టానికి వచ్చాను', అని తెలుపుకున్నాడు. అంతేకాదు;

'వాసుదేవా! స్నేహంలో నీకు నేనెంతో అర్జునుడుకూడా అంతే. బంధుత్వ రీత్యాకూడా మే మిద్దరం నీకు సమానులమే. కాని, మధుసూదనా! నీవద్దకు నేను ముందుగా వచ్చాను. ముందుగా ఆశ్ర యించినవారిని ఆదరించటం సజ్జనులదైన పూర్వాచారం. నువ్వు పురుషోత్తముడవు. నీకు ఏది సమంజసమని తోస్తే అది చేయవలసింది!'

అనికూడా నివేదించుకున్నాడు. అది విన్న కృష్ణుడు, అతణ్ణి ఉద్దేశించి ఇలా అన్నాడు.*129

"సుయోధనా! నువ్వు తొలుదొల్త వచ్చినమాట అయితే నిజమే. కాని, నేను ప్రప్రథమంగా పార్థుని చూడటం సంభవించింది నీవు ముందుగా వచ్చావు. నేను ముందుగా అతణ్ణి చూశాను. అది కారణంగానే, నేను, మీ ఇద్దరికీ సహాయం చేయదలచాను.

కాని, ఏదైనా ఒక విషయాన్ని కోరుకునే సందర్భంలో, పిన్న వారికి ప్రథమావకాశ మివ్వటం ఆచారంగా వస్తూఉంది. కాబట్టి, ఇప్పుడు ఆ అవకాశం అర్జునుని దౌతుంది.

---

*129 భవానభిగతః పూర్వ మత్ర మే నాస్తి సంశయః
దృష్టస్తు ప్రథమం రాజన్ మయా పార్థో ధనంజయః.
తవ పూర్వాభిగమనాత్ పూర్వం చాప్యస్య దర్శనాత్
సాహాయ్య ముభయోరేవ కరిష్యామి సుయోధన,

ప్రవారణం తు బాలానాం పూర్వం కార్య మితి శ్రుతిః
తస్మాత్ ప్రవారణం పూర్వ మర్హః పార్థో ధనంజయః.

మత్సంహనన తుల్యానాం గోపానా మర్బుదం మహత్
నారాయణా ఇతి ఖ్యాతాః సర్వే సంగ్రామయోధినః.

తేవా యుధి దురాధర్షా భవ న్త్వేకస్య సైనికాః
అయుధ్యమానః సంగ్రామే న్యస్త శస్త్రోఽహమేకతః.

ఆభ్యామన్యతరం పార్థ యత్ తే హృద్యతరం మతం
తద్వృణీతాం భవానగ్రే ప్రవా ర్యస్త్వం హి ధర్మతః.

శక్తి సామర్థ్యాలలో నాకు ఏ విధంగానూ తీసిపోనివారు, వీరాధి వీరులైనవారు, నారాయణులని పిలువబడే గోపకులు, నా వద్ద, ఒక అర్బుద సంఖ్యలో ఉన్నారు. వారందరూ సంగ్రామ నిపుణులే. వారందరూ ఒకరి పక్షాన ఉంటారు. నేనొక్కణ్ణి ఒకరి పక్షాన ఉంటాను. నేను ఎవరి పక్షాన ఉన్నా, శస్త్రాస్త్రాలను ధరించేదిలేదు. యుద్ధం చేసేది లేదు. ఆ యథార్థాన్ని గ్రహించి, అర్జును డిప్పుడు తనకు నేను కావాలో, నా సైన్యం కావాలో కోరుకోవచ్చు. అతడు తీసుకోగా మిగిలిన పక్షాన్ని నువ్వు స్వీకరించవచ్చు.

శ్రీకృష్ణు డలా అనగానే, అస్త్రశస్త్రాలు ధరించకపోయినా, యుద్ధం చేయకపోయినా, దుష్ట శిక్షకుడైన శ్రీకృష్ణుడే తనకు కావాలని అర్జునుడు కోరుకున్నాడు. అది గ్రహించిన దుర్యోధనుడు, ఆ పైన, రెండవ పక్షంగా మిగిలిన శ్రీకృష్ణుని సేననంతనూ స్వీకరించాడు. అమితానందంతో అక్కడినుంచి వెళ్లిపోయినాడు.

దుర్యోధను డలా వెళ్లిన తరువాత, శ్రీకృష్ణుడు అర్జునుని ఉద్దేశించి, 'కిరీటీ! యుద్ధం చేయనివాణ్ణి యుద్ధ సహాయకునిగా కోరుకోవటంలో నీ అభిప్రాయమేమిటి?' అని అడిగాడు. దానికి సమాధానంగా అర్జునుడు ఇలా అన్నాడు.

'కృష్ణా! నువ్వు సర్వ సమర్థుడవు, దుష్ట శిక్షణోద్దేశంతో అవతరించిన మహానుభావుడవు. నిన్ను చూసినంత మాత్రంలోనే నీతో విరోధించినవారి గుండెలు నీరైపోతై. నువ్వు ఎవరిపక్షాన ఉంటే వారిపక్షం జయించి తీరుతుంది. అది కారణంగానే, నేను నిన్ను కోరి స్వీకరించటం జరిగింది.'

అర్జునుని నిశ్చితాభిప్రాయాలను గ్రహించి, శ్రీకృష్ణుడు అమితానందం పొందాడు. ఆ తరువాత, రణరంగంలో అతని రథానికి సారథిగా ఉండటానికి అంగీకరించాడు. అతని కోరిక లన్నిటినీ తీర్చటానికి నిశ్చయించుకుని, అతని కలా వాగ్దానం కూడా చేశాడు.

ఆ విధంగా, శ్రీకృష్ణుని అనుగ్రహాన్ని పొందిన అర్జునుడు, ఆ తరువాత, ఆయనతోసహా, ధర్మరాజాదులను కలుసుకోవటం జరిగింది.

## 127. విశ్వరూప ప్రదర్శనం :

కౌరవ వంశం నిర్మూలం కాకుండా చూసే నిమిత్తం, శ్రీకృష్ణుడు ఎన్నో ప్రయత్నాలు చేశాడు. కాని, అవేవీ సఫలం కాలేదు. అది కారణంగానే, ఆయన, పాండుపుత్రుల నుద్దేశించి, ధర్మ ప్రతిష్ఠాపనకు దండోపాయ మొక్కటే మార్గంగా కనిపిస్తున్నదని తెలియపరచాడు.

శ్రీకృష్ణుని నిశ్చితాభిప్రాయం గ్రహించిన యుధిష్ఠిరుడు. ఆ వెంటనే, తన పక్షాన ఉన్న ఏడక్షౌహిణుల సైన్యానికీ ఏడుగురు మహావీరులను నాయకులనుగా నియమించాడు. సర్వాధ్యక్షునిగా ధృష్టద్యుమ్నుని నిర్ణయించాడు. వా రందరితోనూ సమర రంగంలో ప్రవేశించాడు.

అటు కౌరవులు కూడా, తమదైన పదకొండు అక్షౌహిణుల సేనకూ పదకొండుగురు సేనానులను నియమించుకున్నారు. వారందరికీ అధిపతిగా భీష్మాచార్యుని ఎన్నుకున్నారు. ఆ తరువాత, శ్రీకృష్ణుడు నిర్ణయించిన ముహూర్తానికే, పాండవులతోపాటు ఆహవభూమిలో అడుగుపెట్టారు.

యుద్ధాభిలాషతో, ఆ విధంగా సంగర రంగం చేరిన కురు పాండవ వీరులను అర్జునుడు పరిశీలించి చూశాడు. అలా చూసిన అతనికి, అందరూ తనవారుగానే కనిపించారు. ఇరువర్గాలుగా యుద్ధానికి సన్నద్ధులై ఉన్నవా రందరూ, తనతో ఏదో ఒక విధంగా సంబంధం కలవారుగానే అతనికి గోచరించారు. వారిలో చాలా మంది అతనికి బంధువులే. మిగిలినవారు అతని మిత్రులూ ఆశ్రితులూ పరిచ

యస్తులూ అయి ఉన్నారు. వారందరూ అశాశ్వతమైన ఏవో కొన్ని ప్రయోజనాలను ఆశించి, ప్రాణత్యాగానికి కూడా సిద్ధపడి ఉన్నవారే. అది గ్రహించిన అర్జునునకు, స్వార్థపరత్వంలో అతను వారికి ఏవిధంగానూ తీసిపోవటం లేదన్న అభిప్రాయం కలిగింది. తనకూ తనవారికీ లభించవచ్చు ననుకునే ఒక కొంత భూభాగంకోసం, వారందరినీ ఇంధనాలుగా ఉపయోగించి, మారణహోమం జరపడం మానవత్వానికి విరుద్ధమని అతనికి అప్పుడు తోచింది. తనవారిని సంహరించి తాను పొందగల సుఖంగాని, శాంతిగాని లేశమాత్రమైనా ఉండదన్న భావం అతనిలో జనించింది. పూజ్యులైన గురువులను, ప్రేమపాత్రులైన బంధువులను, మిత్రులను వధించటం పాపానికి పాల్పడటం కాకపోదనిపించింది.

అది కారణంగానే అతని మనసు వికలమయింది. శక్తి క్షీణించింది. యుద్ధాభిలాష అంతరించింది. దానితో, అతనికి కర్తవ్య విస్మృతి కలిగింది. అతడప్పుడు ఉట్టి భీరువైనాడు. అస్త్ర సన్యాసం చేయటానికి ఉద్యుక్తుడైనాడు.

శ్రీకృష్ణుడు అది గ్రహించి, సర్వానర్థాలకూ మూలమైన శోక మోహాలకు అర్జునుడంతవాడే వశుడు కావటం శోచనీయ మనుకున్నాడు. శత్రు సంహారానికి శపథం చేసిన సవ్యసాచి, సమర విముఖుడై, విరోధులకు వెన్నుచూపటం జరిగిన పక్షంలో, క్షాత్ర ధర్మమనేది ఆ పైన కలికానికి కూడా కనిపించదనుకున్నాడు. అది కారణంగానే, ఆయన, అమిత శాంత చిత్తంతో, అర్జునునకు అతనిదైన కర్తవ్యాన్ని బోధించాడు. ఆ సందర్భంలో అర్జునుని ఉద్దేశించి ఇలా అన్నాడు.

"అర్జునా! ప్రాణికోటి నంతనూ సృష్టించి పోషించి సంహరించేవాడు ఒకే ఒక డున్నాడు. అతడే పరమాత్ముడు. ప్రపంచంలో

ఎప్పుడు ఎక్కడ ఏది ఎలా జరిగినా ఆయన సంకల్ప మూలంగా మాత్రమే జరుగుతుంది. దాన్ని నిరోధించగల శక్తి ఎవరికీ లేదు.

ఈ ప్రాణులన్నీ ఆ పరమాత్ముని ప్రతిరూపాలే. ఆ పరమాత్మునకు జనన మరణాలనేవి లేవు. వృద్ధి క్షయా లనేవి అస లతనికి ఉండనే ఉండవు. పుట్టేదీ పెరిగేదీ క్షీణించేదీ నశించేదీ అతని తేజోంశకు ఆశ్రయమైన దేహమే కాని దేహి అయిన అతను కాదు.

దేహం శాశ్వతమైన దనుకోవటం అజ్ఞానం. ఆ అజ్ఞానం కారణంగా ప్రాణులకు దేహం పట్ల అభిమానం కలుగుతుంది. అది పొందే వికారాలన్నీ వారు తమవిగా భావిస్తారు; ఆ దేహం మీద జనించిన మమకారం కారణంగా వారు దానితో కలిగే వియోగానికి విచారపడతారు. పుట్టిన ప్రతి జీవీ గిట్టి తీరుతుందనీ, సంయోగమున్న చోట వియోగమన్నది తథ్యమనీ గ్రహించలేక పోవటమే ఆ విచారానికి కారణం.

ఏ ప్రాణికైనా మేలు కీళ్లను చేకూర్చేవి ఆ ప్రాణివైన పూర్వ కర్మలే కాని, ఇతరమైన వేవీ కావు. మనం చేసుకున్న కర్మలే మనకు సుఖ దుఃఖాలనూ సర్వ విధ బంధాలనూ కలిగిస్తూ ఉంటాయి.

ఆ బంధాలను త్రెంచుకోగలవారు, జ్ఞానులు. వారు మేలు కీళ్లు కష్ట సుఖాలు అనే ద్వంద్వాలకు అతీతులుగా ఉంటారు. తమ వర్గానికీ ఆశ్రమానికీ ఉచితమైన కర్మ లన్నిటినీ వారు ఆచరిస్తూ ఉన్నా, కర్మ ఫలాన్ని మాత్రం వారు ఆసించరు. అంటే, ఫలత్యాగం చేస్తారన్న మాట. అదే వారి బంధ మోక్షానికి కారణం.

నువ్వుకూడా ఇప్పుడు ఆ విధమైన స్థితినే పొందాలి. నువ్వు సుక్షత్రియ వంశంలో జన్మించావు. క్షత్రియుల ధర్మం దుష్ట శత్రు నిర్మూలనం. ఆ ధర్మాన్నే నువ్విప్పుడు నిర్వర్తించుకోవాలి, నీ జీవితానికి చరితార్థత చేకూర్చుకోవాలి,

ఇంతకూ ఇప్పుడు నీ సమక్షాన ఉన్న వారందరూ త్వరలో చావ వలసినవారే. వారిని సంహరించే విషయంలో నువ్వు నిమిత్త మాత్రుడవు. ఇదంతా కూడా భగవన్నిర్ణయమే."

ఆ విధంగా ఉద్బోధించి, మోహాపరవశుడై ఉన్న అర్జునునకు భగవ ద్విభూతిపట్ల అనుభవ పూర్వకమైన విశ్వాసం కలిగించే నిమిత్తం అతణ్ణి అంతవరకూ ఆవరించి ఉన్న మాయను తద్వారా తొలగించే ఉద్దేశంతో, ఆ వెంటనే, శ్రీకృష్ణుడు, తనదైన దివ్యరూపాన్ని అతనికి సాక్షాత్కరింప చేశాడు. దాన్ని దర్శించగల దివ్య చక్షువులను కూడా అతనికి ప్రసాదించాడు.

అలా దర్శనీయమైన మహా రూపంలో అర్జునునకు *130 చతుర్దశ భువనాలూ గోచరమయినై. చరాచరమైన జగత్తంతా ద్యోతమయింది. బ్రహ్మ రుద్రామరేంద్రులు, దేవతలు, మహర్షులు, తక్షకాదులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, మరుద్గణాలు, గంధర్వ యక్ష రాక్షసాదులు, సిద్ధులు, సాధ్యులు, చారణులు అలాగే అందరూ కనిపించారు.

ఆ దివ్యరూపం వేయిమంది సూర్యుల కాంతితో ప్రకాశిస్తూ ఉంది. హార కేయూరా ద్యాభరణాలతో భాసిస్తూ ఉంది ప్రచండమైన

---

*130 అనేక వక్త్ర నయన మనేకాద్భుత దర్శనం
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధం
దివ్య మాల్యాంబర ధరం దివ్య గంధానులేపనం
సర్వాశ్చర్యమయం దేవ మనంతం విశ్వతోముఖం.
దివి సూర్య సహస్రస్య భవేద్యుగపదుత్థితా
యది భాః సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః.
తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా
అపశ్యద్దేవ దేవస్య శరీరే పాండవ స్తదా.

వివిధాయుధాలు ధరించి, అనేక ముఖాలతో నేత్రాలతో కరచరణా ద్యవయవాలతో ఒప్పారుతూ ఉంది. భూనభోంతరాళాలను అన్ని దిక్కులా ఆవరించి ఉంది.

ఘోరమైన ఆ విశ్వరూపుని ముఖ గహ్వరంలోకి ప్రవేశిస్తున్న ధార్తరాష్ట్రులు, వారి అనుయాయులు భీష్మ ద్రోణ కర్ణాదులు, ధృష్టద్యుమ్నాది వీరులు, అలాగే అనేకమంది రాజన్యులు ఆ సమయంలో గోచరమైనారు. అనంతవదనాలతో, ఆ మూర్తి, కనిపించిన వారి నల్లా కబళిస్తూ ఉండటంకూడా ద్యోతమయింది.

అదంతా చూసిన అర్జునుడు ఆశ్చర్యచకితు డైనాడు. కలవర పడ్డాడు. కంపించిపోసాగాడు.

అలా కొన్ని క్షణాలు గడచిన తరువాత, అతడు మనసును కొద్దిగా దిట్టపరచుకుని, శ్రీకృష్ణునకు చేతులెత్తి నమస్కరించాడు. 'నీ ఉగ్రరూపాన్ని ఉపసంహరించుకోవలసింది. నన్ను అనుగ్రహించ వలసింది' అని ప్రార్థించాడు. ఆయన్ని ఎంతగానో స్తుతించాడు.

ఆ విధంగా, అర్జునునకు తన విశ్వరూపాన్ని ప్రకటించి, అతని సంశయాలన్నింటినీ తొలగించి, మోహాన్ని విచ్ఛిన్నంచేసి, అతనికి ధైర్యం కలిగించి, శ్రీకృష్ణుడు ఆపైన అతణ్ణి కర్తవ్యోన్ముఖుని చేయటం జరిగింది.

## 128 . . . సైంధవుడు :

పద్మవ్యూహాన్ని నిర్మించటంగాని, ఛేదించటంగాని సామాన్యంగా యోధు లందరికీ తెలియదు. మహాభారత యుద్ధంలో కౌరవ పక్షాన ఉన్న ద్రోణాచార్యులవారు ఆ వ్యూహం నిర్మించారు.

పాండవులలో ఆ వ్యూహ నిర్మాణ భేదన చాతుర్యం కలవాడు అర్జును డొక్కడే. ఆ శక్తి, యాదవ శ్రేష్ఠుడైన శ్రీకృష్ణునిలోనూ, ఆయన కుమారుడైన ప్రద్యుమ్నునిలోనూ కూడా ఉంది.

ద్రోణాచార్యులవారు పద్మవ్యూహం పన్నిన సమయంలో, కృష్ణార్జును లిద్దరూ ఆ రంగంలో లేరు; వేరొకచోట సంశప్తకులతో పోట్లాడుతూ ఉన్నారు.

ద్రోణాచార్యుడు, పద్మవ్యూహాన్ని నిర్మించాడని గ్రహించగానే, యుధిష్ఠిరుడు భయపడిపోయినాడు. ఆ వ్యూహాన్ని, ఆ రోజున ఛేదించలేని పక్షంలో, పాండవ వినాశనం తథ్య మని ఆయన భావించాడు. అందుకనే, అర్జునకుమారుడైన అభిమన్యుని పిలిచి, ఆ వ్యూహ విషయంలో అతని కేమైనా తెలుసునేమో అని అడిగాడు.

అభిమన్యునకు పద్మవ్యూహ నిర్మాణం పూర్తిగా తెలుసు. వ్యూహ భేదనం కూడా కొంతవరకు తెలుసు. అంటే, వ్యూహాన్ని ఛేదించుకుంటూ పోవటమేగాని తిరిగి క్షేమంగా బయట పడటం తెలియ దన్నమాట. అప్పటి కర్జును డతనికి అంతవరకే నేర్పటం జరిగింది. ఆ విషయాన్నే అభిమన్యుడు తన పెదతండ్రికి నివేదించుకున్నాడు.

అది విన్న యుధిష్ఠిరునకు కొంత ధైర్యం కలిగింది. అది కారణంగానే, ఆయన అభిమన్యుని ఉద్దేశించి, 'నాయనా! ఆ వ్యూహాన్ని ఛేదించుకుంటూ నువ్వు వెళ్ళవలసింది. మే మందరం నీకు అండగా నీ వెనుకనే ఉంటాము. నీ కేవిధమైన అపాయం కలుగకుండా చూస్తాము', అన్నాడు. భీమసేనుడు కూడా అతనికి అదేవిధంగా వాగ్దానం చేశాడు; ధైర్యం కలిగించాడు.

ఆ వెంటనే, అభిమన్యుడు పద్మవ్యూహంలో ప్రవేశించాడు. యుధిష్ఠిరాదులు అతణ్ణి అనుసరించారు.

వ్యూహంలో ప్రవేశించిన అభిమన్యుడు, కౌరవ సేన నంతనూ కలవర పరచాడు. దుశ్శాసనుని వధించాడు. ప్రళయకాల రుద్రుని మాదిరి వ్యవహరించసాగాడు. ఆ సమయంలో, అతని పురోగమనాన్ని అరికట్టినవాడు సైంధవు డొక్కడే.

అది గ్రహించిన కురువీరులందరూ సిగ్గుపడ్డారు. ఆ వెంటనే చెల్లాచెదరై పోతున్న తమ సేనలన్నింటినీ కూడగట్టుకున్నారు. ఒక్కుమ్మడిగా అభిమన్యుని మీదికి ఉరికారు. అందరూ కలిసి, ఏకాకిగా ఉన్న అతణ్ణి, అతికష్టంమీద సంహరించగలిగారు.

అభిమన్యుడు అలా దుర్మరణంపాలైనాడని విని అర్జునుడు అమితంగా దుఃఖించాడు. అతడలా కూలిపోవటానికి మూలం సైంధవు డతణ్ణి ఆ సమయంలో నిలువరించటమే ననుకున్నాడు. అది కారణం గానే, అతనిపట్ల పగ వహించి, 'రేపు సూర్యుడు అస్తమించే లోపల సైంధవుని సంహరించి తీరుతాను. అలా చేయలేని పక్షంలో అగ్ని ప్రవేశం చేస్తాను' అని శపథం చేశాడు.

అర్జునుని శపథం విని సైంధవుడు అడలిపోయినాడు. అతనికి అమితమైన ప్రాణభీతి కలిగింది. అది కారణంగానే, అతడు, కౌరవ వీరులను కలుసుకుని, తనకు ప్రాణభిక్ష పెట్టవలసిందిగా ప్రార్థించాడు. ఆ మరునాడు, తను అర్జునునిచేత సంహరింపబడకుండా చూడ వలసిందని వా రందరినీ బ్రతిమాలుకున్నాడు.

అది చూసిన దుర్యోధనుడు, అతణ్ణి కలుసుకుని, అతని ప్రాణ భీతిని తొలగించటానికి ఎంతగానో ప్రయత్నించాడు. ఆ మరునాడు జరిగే యుద్ధంలో, కౌరవ వీరు లందరూ అతనికి అండగా నిలబడి, అతను అర్జునుని కంట పడకుండా కాపాడుతారని వాగ్దానం చేశాడు. అంతేకాదు. 'రేపు నిన్ను రక్షించుకోవటం, అర్జునుడు అగ్ని ప్రవేశం చేసేటట్టు చూడటం మా ధర్మం. ఆ ధర్మాన్ని మేము అక్షరాలా పాటించితీరుతాము' అని కూడా అతనికి తెలియపరచాడు.

ఆ మరునాటి యుద్ధం దుర్యోధను డన్నట్టుగానే జరిగింది. రణరంగంలోనే ఉన్న సైంధవుడు, ఆ రోజున, అర్జునునకు అందకుండా ఉండే ఏర్పాట్లన్నిటినీ దుర్యోధను డానాడు చేశాడు. సైంధవుని దిక్కుగా గమించే అర్జునుని, కర్ణ దుర్యోధనాదులు, అడుగడుగునా

అడ్డుకుంటూనే వచ్చారు. సైంధవునకూ అర్జునునకూ మధ్య తమ తమ సేనలతో నిలబడిఉన్న మహారథు లెందరో అర్జునుని పురోగమనాన్ని అరికట్టడానికి ప్రయత్నిస్తూనే ఉన్నారు. అయినా అర్జునుడు, వారి నందరినీ తొలగించుకుంటూ ముందుకు సాగిపోతూనే ఉన్నాడు.

అంతలో సూర్యాస్తమయ సమయం సమీపించింది. సూర్యుడు అస్తమించేలోపల, అర్జునుడు, తన సముఖాన ఉన్న వీరాధివీరుల నందరినీ నిర్జించి సైంధవుని చేరటం దుర్ఘటమనీ, అలా సైంధవుని సంహరించ లేని పక్షంలో అర్జునుడు అతడు చేసిన శపథాన్ని అనుసరించి, అగ్ని ప్రవేశం చేయవలసి ఉంటుందనీ శ్రీకృష్ణుడు భావించాడు. అది కారణంగానే, ఆ పరిస్థితిని చక్కబరచే ఉద్దేశంతో, ఆయన, అర్జునుని ఉద్దేశించి ఇలా అన్నాడు.

"కిరీటీ! *131 సైంధవు డిప్పుడు ఆరుగురు మహారథుల వెనుక దాక్కొని ఉన్నాడు. ఆ ఆరుగురనూ తొలగించనిదే నీ కతడు కనిపించడు. మన మెంతగా ప్రయత్నించినా సూర్యుడు అస్తమించే లోపల వారినందరినీ తొలగించటం, అతణ్ణి సమీపించటం అసంభవ మని నాకు తోస్తోంది. అందుకనే, ఒక ఉపాయంద్వారా అతణ్ణి వధించటం సమంజస

---

*131 ఏ ష మధ్యే కృతః షడ్భిః పార్థ వీరై ర్మహారథైః
జీవితేప్సు ర్మహా బాహో భీత స్తిష్ఠతి సైంధవః.
ఏతాం ననిర్జిత్య రణే షడ్ రథాన్ పురుషర్షభ
న శక్యః సైంధవో హంతుం యతో నిర్వ్యాజ మర్జున.
యోగ మత్ర విధాస్యామి సూర్యస్యావరణం ప్రతి
అస్తంగత ఇతి వ్యక్తం ద్రక్ష్యత్యేకః స సింధురాట్.
హర్షేణ జీవితా కాంక్షీ వినాశార్థం తవ ప్రభో
న గోప్స్యతి దురాచారః స ఆత్మానం కథంచన
తత్ర చ్ఛిద్రే ప్రహర్తవ్యం త్వయాస్య కురుసత్తమ
వ్యపేక్షా నైవ కర్తవ్యా గాతోஉస్తమితి భాస్కరః,

మని నేను నిర్ణయించుకున్నాను. ఇప్పుడు, తాత్కాలికంగా సూర్యుడు మఱుగుపడేటట్లు చేయటం, అది గ్రహించిన సైంధవుడు మాత్రం సూర్యుడు అస్తమించాడని భ్రమించేటట్లు చూడటం నా వంతు. సూర్యు డస్తమించాడని నిరాశ చెందకుండా ఉండటం, ఆ సమయంలో, ఇంతవరకూ దాగివున్న సైంధవుడు, నిర్భయంగా తలయెత్తి, రథంలో నిలబడగానే, అతణ్ణి నిస్సంకోచంగా వధించటం నీ వంతు. ఈ ఏర్పాటుకు నువ్వు సమ్మతించి తీరాలి".

ఆ పలుకులు విన్న అర్జునుడు అందుకు సమ్మతించాడు. ఆ వెంటనే, శ్రీకృష్ణుడు, తన యోగమాయా ప్రభావంద్వారా, సూర్యుని మఱుగుపరచే ఒక మబ్బుతెరను కల్పించాడు. ఆ మాయను గ్రహించ రాని కౌరవ వీరులు సూర్యుడు అస్తమించి ఉంటా డనుకున్నారు. అర్జునుడు ఆ పైన అగ్ని ప్రవేశం చేయటం తథ్య మనుకున్నారు. హర్ష ధ్వానాలు చేశారు.

అది గ్రహించిన సైంధవుడు, అర్జునుని చేతులో తప్పదనుకున్న చావు తప్పిపోయిం దనుకున్నాడు. మృత్యు ముఖంనుంచి తాను ఆనాటికి బయట పడ్డట్టే భావించాడు. ఆ విధమైన తన అభిప్రాయాన్ని ధృవపరచుకునే నిమిత్తం, అతడు కూడా, తనవా రందరితోపాటు తలెత్తి ఆకసంవంక చూడసాగాడు.

శ్రీకృష్ణు డది గ్రహించాడు. గ్రహించి*132, అతణ్ణి అర్జునునకు చూపుతూ వెంటనే అతణ్ణి వధించవలసిందనీ, ఆశయాన్ని సిద్ధింప జేసుకోవలసిందనీ ప్రోత్సహించాడు.

---

*132 వీక్షమాణే తత స్తస్మిన్ సిన్ధురాజే దివాకరం
పునరే వాబ్రవీత్ కృష్ణో ధనంజయ మిదం వచః.
పశ్య సింధుపతిం వీరం ప్రేక్షమాణం దివాకరం
భయం హి విప్రముచ్యేతత్ త్వత్తో భరతసత్తమ.
అయం కాలో మహాబాహో వధాయాస్య దురాత్మనః
ఛ్చిన్ధి మూర్ధానమస్యాశు కురు సాఫల్య మాత్మనః.

ఆ మరుక్షణంలోనే, అర్జునుడు తన గాండీవానికి వజ్రాస్త్రాన్ని సంధించటం, దాన్ని సైంధవునిపైకి వదలటం, అది సూటిగా పోయి అతని తలను నరకివేయటం జరిగింది.

అదలా జరిగేలోపల, శ్రీకృష్ణుడు అర్జునుని ఉద్దేశించి ఇలా అన్నాడు.

'అర్జునా !*133 ఆ తల నేలమీద పడకుండా చూడవలసింది. అది ఎవరిద్వారా నేలమీద పడితే వారి శిరస్సు నూరు వ్రక్కలై తీరుతుందని అమోఘ వచనుడైన అతని తండ్రి, వృద్ధక్షత్రుడు పలికాడు.

ఇప్పుడా వృద్ధక్షత్రుడు, శ్యమంతపంచకం వద్ద తపస్సు చేసుకుంటున్నాడు. అద్భుతకర్మలు చేయగల నీ దివ్యాస్త్రాల ద్వారా నువ్విప్పుడు ఆ శిరస్సును అతని ఒడిలో పడేటట్టు చేయాలి. అలా చేసిన క్షణంలోనే నువ్వు బ్రతికి బయట పడగలుగుతావు'.

అర్జునుడు, శ్రీకృష్ణుడు చెప్పినట్టుగానే చేశాడు. సైంధవుని తలను, మరికొన్ని దివ్యాస్త్రాలచేత పైకి పంపి, స్యమంత పంచకం

---

*133 తస్మాజ్జయద్రథస్య త్వం శిరసి చ్ఛిత్వా మహామృధే
దివ్యేనాస్త్రేణ రిపుహన్ ఘోరేణాద్భుత కర్మణా.
సకుండలం సిన్ధుపతేః ప్రభంజన సుతానుజ
ఉత్సంగే పాతయస్వాస్య వృద్ధక్షత్రస్య భారత.
అథ త్వమస్య మూర్ధానం పాత యిష్యసి భూతలే
తవాపి శతధా మూర్ధా ఫలిష్యతి న సంశయః.
యథా చేదం న జానీయాత్ స రాజా తపసి స్థితః
తథా కురు కురుశ్రేష్ట దివ్య మస్త్ర ముపాశ్రితః.
న హ్యసాధ్య మకార్యం వా విద్యతే తవ కించన
సమస్తే ష్వపి లోకేషు త్రిషు వాసవ నందన,

వెలుపల సూర్యోపాసన చేసుకుంటున్న వృద్ధక్షత్రుని ఒళ్లో పడేటట్టు చేశాడు. అది గ్రహించని వృద్ధక్షత్రుడు, సూర్యోపాసనానంతరం లేవబోతూ ఉండగా, మణి మయాంచితమైన కుండలాలతో ప్రకాశిస్తూ ఉన్న ఆ శిరస్సు అతని ఒడిలోనుంచి క్రింద పడ్డది. ఆ వెంటనే అతని శిరస్సు నూరు ముక్కలై పోయింది.

ఆ విధంగా, శ్రీకృష్ణుడు, అర్జునుడు అగ్నిప్రవేశం చేయకుండానూ, వృద్ధక్షత్రుని శాపానికి అర్జునుడు గురికాకుండానూ చూడటం, అభిమన్యుని దుర్మరణానికి మూలమైన సైంధవుని వధించి, అర్జునుడు తన పగను సాధించుకునేటట్టు చేయటం జరిగింది.

## 129 . . . ఘటోత్కచుడు :

సైంధవ సంహారానంతరం, కురు పాండవ సేనలమధ్య తీవ్రతరమైన పోరు జరిగింది. ఆ సమయంలో, రాధేయుని ధాటికి ఆగలేక, పాండవపక్షీయులందరూ ప్రాణ భీతితో పారిపోసాగారు. అది గ్రహించినయుధిష్ఠిరుడు, రాధేయు డలా మరికొంతసేపు రణరంగంలో విహరించిన పక్షంలో కౌంతేయులుగాని, వారి పక్షీయులుగాని, బ్రతికి బయట పడటం జరగదని అర్జునునకు తెలుపుకున్నాడు. ఎలాగైనా, కర్ణుని ఆ రోజున వధించితీరాలని ఆదేశించాడు.

ధర్మజుని ఆదేశాన్ని శిరసావహించిన ధనంజయుడు తన రథాన్ని రాధేయుని దిక్కుగా నడుపవలసిందని తన సారథి అయిన శ్రీకృష్ణుని కోరాడు. ఆ నాటి పోరాటంలో, అటు కర్ణుడో ఇటు అర్జునుడో ఎవరో ఒకరు మాత్రమే సజీవులై ఉండాలన్న తన నిశ్చితాభిప్రాయాన్ని ఆయనకు తెలుపుకున్నాడు.

శ్రీకృష్ణుడు అతని పలుకులు సావధానంగా విన్నాడు. విని, ఆ పైన అతనితో ఇలా అన్నాడు.

"అర్జునా! *134 ఈ రోజున కర్ణుడు అమానుషమైన విక్రమంతో పోరాడుతున్నాడు. ఇప్పు డతణ్ణి ప్రతిఘటించగలశక్తి మీ అన్నదమ్ము లలో నీకూ, మిగిలిన మన వీరులలో ఘటోత్కచునకూ మాత్రమే ఉంది.

నువ్వు కర్ణునితో తలపడే సమయం ఇంకా రాలేదు. అతనికి మహేంద్రుడు ప్రసాదించిన వైజయంతి అనే మహాశక్తి అతనివద్ద ఉన్నంతవరకూ నువ్వు అతని ఎదుటకు పోవటం భావ్యం కాదు.

ఆ వైజయంతి వజ్రాయుధం వంటిది. దానిని నిరోధించగల ఆయుధం మరొకటి లేదు. ఆ మహాశక్తిని నీ మీద ప్రయోగించి నిన్ను నిర్జించటానికే అతడు నిశ్చయించుకున్నాడు. ఆ అవకాశం కోసమే అత డింతవరకు ఎదురుచూస్తూ ఉన్నాడు. ఇప్పుడు నువ్వతని కంట పడ్డ పక్షంలో, అతడు దాన్ని నీమీద ప్రయోగించి తీరుతాడు. అది కారణంగానే, అతణ్ణి ప్రతిఘటించే నిమిత్తం, ఇప్పుడు, బల పరాక్ర

---

*134 పశ్యామి కర్ణం కౌంతేయ దేవరాజ మివాహవే
విచరన్తం నరవ్యాఘ్ర మతిమానుష విక్రమం.
నైతస్యాన్యోఽస్తి సంగ్రామే ప్రత్యుద్యాతా ధనంజయ
ఋతే త్వాం పురుషవ్యాఘ్ర రాక్షసాద్ వా ఘటోత్కచాత్.
నతు తావదహం మన్యే ప్రాప్తకాలం తవానఘ
సమాగమం మహాబాహో సూత పుత్రేణ సంయుగే.
దీప్యమానా మహోల్కేవ తిష్ఠ త్యస్య హి వాసవీ
త్వ దర్థం హి మహాబాహో సూతపుత్రేణ సంయుగే.
రక్ష్యతే శక్తిరేషా హి రౌద్రం రూపం బిభర్తిచ
ఘటోత్కచస్తు రాధేయం ప్రత్యుద్యాతు మహాబలః.
స హి భీమేన బలినా జాతః సురపరాక్రమః
తస్మిన్నస్త్రాణి దివ్యాని రాక్షసా న్యాసురాణి చ.
సతతం చానురక్తోవో హితైషీ చ ఘటోత్కచః
విజేష్యతి రణే కర్ణ మితి మే నాత్ర సంశయః.

మాలలో నీకు ఏ విధంగానూ తీసిపోనివాడూ, మాయా యుద్ధంలో అద్వితీయుడూ, మీ పట్ల అత్యంతమైన భక్తి కలవాడూ అయిన ఘటోత్కచుని పంపటం సమంజసమని నేను భావిస్తున్నాను."

ఆ విధమైన శ్రీకృష్ణుని సూచన మీద, అర్జునుడా వెంటనే ఘటోత్కచుని అక్కడకు రప్పించుకున్నాడు. ఆనాటి పరిస్థితి నంతనూ అతనికి విశదపరచాడు. 'మహారథుడైన సాత్యకి సహాయుడుగా నువ్వీ రాత్రి రాధేయునితో పోరాడాలి' అని ఆదేశించాడు.

ఘటోత్కచుడు తన పినతండ్రి దైన ఆదేశాన్ని శిరసావహించాడు. ప్రసన్నతా చిహ్నమైన మందహాసంతో తన వంక చూస్తున్న శ్రీకృష్ణునకు నమస్కరించి, ఆ ఇద్దరి వద్దా సెలవు తీసుకున్నాడు. ఆ వెంటనే రణరంగంలో ప్రవేశించాడు.

అలా రణరంగ ప్రవేశం చేసిన ఘటోత్కచునకూ కర్ణునకూ మధ్య అప్పుడు ఘోరమైన పోరు జరిగింది. ఘటోత్కచుని మాయా బలం ముందు కౌరవసేనలు నిలబడలేక పోయినై. కౌరవ పక్షంలోని మహావీరులే, అతని యుద్ధ కౌశలం చూసి విస్మితులు కావటం, చకితులై పోవటం, ప్రాణభీతి నందటం జరిగింది. ఆ సమయంలో, కర్ణ ఘటోత్కచులిద్దరూ ఒకరికొకరు తీసిపోకుండా పోరాడసాగారు.

అప్పుడు, ఘటోత్కచుడు, మాయా యుద్ధంలో తనకున్న ప్రావీణ్యత నంతనూ ప్రదర్శించాడు. అది చూసిన దుర్యోధనాదులు అమితంగా అడలిపోయినారు. అది కారణంగానే, తనవా రందరూ ఆ రాక్షస ప్రముఖుని చేతులో నిర్మూలం కాకుండా చూసే నిమిత్తం, దుర్యోధనుడు జటాసుర పుత్రుడూ, పాండవ విరోధీ, అన్ని విధాలా అతనికి సముడూ అయిన అలంబుసుని అతనిపైకి పంపటం జరిగింది.

ఆ రాక్షస వీరు లిద్దరిమధ్యా అప్పుడు జరిగిన తీవ్ర పోరాటంలో, అలంబుసుడు హతుడై పోయినాడు. ఘటోత్కచుడు అతని శిరాన్ని

ఖండించి, దాన్ని దుర్యోధనుని మీదకు విసిరివేస్తూ, 'మహారాజా! నీ అనుచరుడైన యీ అలంబుసునకు పట్టిన దుర్గతి మరికొన్ని క్షణాలలో నీ సహచరుడైన సూతపుత్రునకు కూడా సంభవించ బోతోంది' అన్నాడు. ఆపైన వికటాట్టహాసం చేశాడు. అది గ్రహించిన దుర్యోధనుడు ఆరోజుతో తన పక్షీయులందరి ఆయువూ తీరి పోయిందనే భావించాడు. అది కారణంగానే, అతడు, వెంటనే ఘటోత్కచుని వధించని పక్షంలో, ఆ మరునాడు, కౌరవుల పక్షాన పోరాడటానికి ఏ ఒక్కడూ మిగిలి ఉండడన్న తన దృఢాభిప్రాయాన్ని కర్ణునకు తెలుపుకున్నాడు. ఎంతటి త్యాగానికి సిద్ధపడి అయినా ఆరోజున అతణ్ణి సంహరించి తీరవలసిందిగా ఉద్బోధించాడు.

దుర్యోధనుని దీనావస్థను గ్రహించిన రాధేయుడు, ఆసమయంలో ఘటోత్కచుని సంహరించటం, కౌరవులను రక్షించటం తన కర్తవ్య మనుకున్నాడు. ఆపత్సమయంలో, స్వప్రాణ సంరక్షణార్థం, అన్నిటికీ మించి తనకు ఆబాల్య విరోధి అయిన అర్జునుని హతమార్చే నిమిత్తం అంతవరకూ దాచి ఉంచుకున్న వైజయంతిని ప్రయోగించిగాని ఘటోత్కచుని అంతమొందించటం సాధ్యం కాదని నిర్ధారించుకున్నాడు. తన స్వామి అయిన దుర్యోధనునకు తాత్కాలికంగా అయినా మన శ్శాంతిని కలిగించటానికి, తనవారైన ధార్తరాష్ట్రులను విపత్సాగరం నుంచి తరింప చేయటానికి, అనంతరకాలంలో తన ఆశయ సిద్ధికి తోడ్పడగలదనుకునే వైజయంతిని త్యాగం చేయటం ఘనమైన విషయ మేమీ కాదని నిర్ణయించుకున్నాడు. ఆ నిర్ణయం ప్రకారమే ఘటోత్కచునిమీద ఆ మహాశక్తిని ప్రయోగించాడు.

అతి భయంకరమూ, రౌద్రమూ, మృత్యుతుల్యమూ అయిన ఆ మహాశక్తిని చూడగానే, ఘటోత్కచుడు గజగజ లాడిపోయినాడు తన శరీరాన్ని ఒక మహాద్రి మాదిరి పెంచుకున్నాడు. ప్రాణ భీతితో పరుగెత్తసాగాడు. అలా పరుగెడుతున్న మహాయోధుని తరుముకు వెళ్లి

ఆ మహాశక్తి అతని హృదయాన్ని చీల్చివేసింది. అది కారణంగా, అతడు, లోకభీకరంగా అరుస్తూ నేల కూలిపోవటం జరిగింది.

అలా కొండమాదిరి కూలిపోయిన ఘటోత్కచుని చూసి, భీమ సేనాదులు అమితంగా దుఃఖించారు.*135 కాని, శ్రీకృష్ణుడు మాత్రం ఆనందతాండవం చేయసాగాడు. అర్జునుని ఆలింగనం చేసుకుని, అతని వీపు చరుస్తూ, పదే పదే సింహనాదం చేయసాగాడు.

పాండు పుత్రులు పరితాప పడుతూ ఉన్న సమయంలో, శ్రీకృష్ణుడు అలా చిందులువేస్తూ ఉండటం అర్జుననకే ఆశ్చర్యం కలిగించింది. అందుకనే, అతడు, ఆ ఆనందానికి మూల మేమిటో తెలుప వలసిందిగా శ్రీకృష్ణుని కోరాడు. అతనికి సమాధానంగా శ్రీకృష్ణు డిలా విశదపరచాడు.

'అర్జునా! నీకు మృత్యువు కాదగిన మహాశక్తి నేటితో అంత రించి పోయింది. దానితోపాటు, కర్ణునిదైన ఆయుర్దాయం కూడా తీరి పోయిందనే చెప్పాలి.

నీకోసం, ఇంతకుముందు, మహేంద్రు డతణ్ణి కవచహీనునిగా కుండల హీనునిగా చేయటం, సగంవరకు చంపటం జరిగింది. ఇప్పు డీ ఘటోత్కచు డితణ్ణి శక్తిహీనుని చేయటం, ఒక జీవచ్ఛవంమాదిరి తయారుచేయటం సంభవించింది. ను వ్విప్పుడు అజేయుడ వైనావు.

కవచ కుండలాలతో ఉన్న రాధేయుడు,సమరరంగంలో కుమార స్వామి వంటివాడు. అతణ్ణి జయించటం, కుబేర వరుణ యమాదులకైనా

---

*135 హైడింబిం నిహతం దృష్ట్వా విశీర్ణమివ పర్వతం
బభూవుః పాండవాః సర్వే శోక బాష్పాకులేక్షణాః.
వాసుదేవస్తు హర్షేణ మహతాభి పరిప్లుతః
ననాద సింహనాదం వై పర్యష్వజత ఫాల్గునం.
స వినద్య మహానాద మభీషూన్ సం నియమ్య చ
న నర్త హర్ష సంవీతో వాతోద్ధూత ఇవ ద్రుమః.

అసాధ్యమే. అంతే కాదు. గాండీవం ధరించిన నువ్వూ, చక్రధారినైన నేనూ, ఇద్దరం కలిసి కూడా అతణ్ణి జయించలేక పోయేవాళ్లం. కాని, ఇప్పుడా పరిస్థితి అంతా మారిపోయింది. నీకు మరణం తప్పిపోయింది. పాండు పుత్రులకు విజయం తథ్యమయింది. అదే నా ఆనందానికి మూలం.

ఆ పలుకులు విని అర్జునుడు శ్రీకృష్ణునకు తనపట్ల ఉన్న ఆదరాభిమానాలు ఎంత ఘనమైనవో మరొకమారు అర్థం చేసుకున్నాడు. అది కారణంగానే, తనలో తాను సంతోషించాడు. తన కృతజ్ఞతను తెలుపుకుంటూ, మానసికంగా, ఆయనకు పదే పదే ప్రణామా లర్పించు కున్నాడు.

130. . . . *పరీక్షితుడు* :

ఆ తరువాత, కౌరవులకూ పాండవులకూ మధ్య జరిగిన మహా సంగ్రామంలో, కౌరవ వీరు లెందరో మరణించారు. కురుపతి అయిన దుర్యోధనుడు కూడా కూలిపోయినాడు. అంతకు ముందే, పూజ్యులైన భీష్మ ద్రోణులూ, సైంధవుడూ మోస ప్రవృత్తితో వధింపబడ్డారు. మహారథులైన కర్ణ భూరిశ్రవులు అన్యాయంగా హతులైనారు. అదంతా గ్రహించిన అశ్వత్థామకు అమితమైన ఆగ్రహం కలిగింది. అది అతనిలో క్రోధంగా పరిణమించింది.

అశ్వత్థామ దుర్యోధనుని ఉప్పు తిని జీవించినవాడు కావటం వల్ల, అతని అంతిమ క్షణాలలో అయినా అతనికి ఏదో ఒక విధంగా ఆనందం కలిగించా లనుకున్నాడు. అది కారణంగానే, గాఢ నిద్రలో మునిగిఉన్న ద్రౌపదేయులను, నిర్దాక్షిణ్యంగా నరకివేశాడు. ఆ వార్తను, చావు బ్రతుకుల మధ్య ఉన్న దుర్యోధనునకు అందజేసి, అతనికి కొంత శాంతి చేకూర్చాడు.

కన్నబిడ్డల దుర్మరణవార్త కర్ణ పుటాల్లో పడగానే, ద్రౌపది అమితంగా దుఃఖించింది. అది గ్రహించిన అర్జునుడు, ఆమె దుఃఖాన్ని

ఉపశమింపచేసే ఉద్దేశంతో, అన్యాయ మనుకోకుండా బాలకులను హతమార్చిన అశ్వత్థామ శిరాన్ని ఖండించి తెస్తాను' అని ఆమెముందు శపథం చేశాడు. ఆ శపథం ప్రకారమే, అతణ్ణి తరుముకుంటూ పోయినాడు.

అర్జునుని అల్లంత దూరంలో చూడగానే, అశ్వత్థామ అదలి పోయినాడు. అతనికి ప్రాణభీతి కలిగింది. అందుకనే, స్వప్రాణ రక్షణార్థం, తన వద్ద ఉన్న బ్రహ్మ శిరోనామకాస్త్రాన్ని అర్జునుని మీద ప్రయోగించాడు.

అలా అతని చేత విడువబడ్డ అస్త్రం, ప్రచండ తేజంతో, అర్జునుని మీదకు వెళ్ళింది. అది గ్రహించిన అర్జునుడు, దాన్ని ప్రతిఘటించే ఉద్దేశంతో, తనుకూడా మరొక బ్రహ్మాస్త్రాన్ని వదిలాడు దాంతో ఆ రెండు దివ్యాస్త్రాల మధ్యా భీకరమైన సంఘర్షణ జరిగింది. అది కారణంగా, లోకాలన్నీ తల్లడిల్లిపోయినై. అది గ్రహించిన శ్రీకృష్ణుడు. ఆ బ్రహ్మాస్త్రాలను రెంటినీ ఉపసంహారించవలసిందిగా అర్జునుని కోరాడు, అర్జును డాయన సలహాను పాటించి, ఆ రెండు అస్త్రాలనూ ఉపసంహారించాడు. ఆ తరువాత, అశ్వత్థామను బంధించి, తీసుకుపోయి ద్రౌపది ముందు నిలబెట్టాడు.

అశ్వత్థామను చూడగానే; పాంచాలికి, ద్రోణాచార్యుడు స్ఫురణకు వచ్చాడు. ఆయన రూపాన్ని అశ్వత్థామలో చూసుకుని, ఆమె అతనికి నమస్కరించింది. అతణ్ణి బంధించి తెచ్చిన అర్జునునీ, అతణ్ణి చూసి ఉగ్రుడై పోతున్న భీమసేనునీ ఉద్దేశించి, 'నాకు సంభవించిన పుత్రశోకం ద్రోణపత్నికి సంభవించకుండా చూడవలసింది' అని బ్రతిమాలుకుంది.

ఆ వెంటనే, అర్జునుడు, శ్రీకృష్ణుని సూచనమీద, అశ్వత్థామ శిరాన ఉన్న దివ్యరత్నాన్ని తీసుకుని, ప్రసిద్ధుడైన అతణ్ణి అవమానించ

టమే సంహరించటంగా భావించి, అతణ్ణి శిబిరం బయటకు గెంటి వేశాడు.

అలా ఔదార్యాన్ని ప్రదర్శించిన పాండవులపట్ల కృతజ్ఞుడై ఉండటానికి బదులు, అశ్వత్థామ, వారిమీద పగబట్టాడు. ప్రపంచం అపాండవ మైతేనేగాని తనకు శాంతి లేదని అతను నిర్ణయించుకున్నాడు. ఆ నిర్ణయం ప్రకారం, ఆ వెంటనే, అతడు మరొక దివ్యాస్త్రాన్ని మంత్రించి పాండవ పత్నుల గర్భాలమీద ప్రయోగించాడు.

ఆ సమయంలో, అర్జునుని కోడలూ, అభిమన్యుని ధర్మపత్ని అయిన ఉత్తర గర్భిణిగా ఉంది. ఆమె ప్రసవించే రోజులు కూడా సమీపించినై. అశ్వత్థామ ప్రయోగించిన దివ్యాస్త్ర తేజం ఆమె గర్భంలో ఉన్న శిశువును అమితంగా పీడించసాగింది.

దుర్భర బాణానలం వల్ల అలా తపించి పోతూ, ఆ శిశువు, మాతృగర్భంలో ఉండే, ఆ పరమాత్ముని ఉద్దేశించి, తన పరిస్థితి నంతనూ దీనాతి దీనంగా నివేదించుకున్నాడు. ఆ సందర్భంలోనే...

రాడా చూడ సమస్త భూతములలో రాజిల్లువా డిచ్చటన్
లేడా పాఱుని చిచ్చరమ్ము దొలగన్ లీలా గతిన్ ద్రోచి నా
కీడానే ఉభయ ప్రదాన మత డూహింపన్ నత త్రాత మున్
గాడా యెందఱ గావ డీ యెడల మత్కర్మంబు దానెట్టిదో !

అనికూడా వాపోయినాడు.

గర్భస్థ శిశువు పడుతున్న వేదనను గ్రహించిన ఉత్తర, ఆ వెంటనే శ్రీకృష్ణుని సమీపించి...

గర్భమందు గమల గర్భాండ శతములు
నిముడుకొన వహించు నీశ్వరేశ
నీకు నొక్క మానినీ గర్భ రక్షణ
మెంత బరువు నిర్వహింతు గాక !

అని అతి దీనంగా నివేదించుకుంది. ఆ దీనాలాపాలు చెవుల బడగానే.... *136

మేఘంబు మీది క్రొమ్మెరుగు కైవడి మేని
పైనున్న పచ్చని పటమువాడు
గండభాగంబుల గాంచన మణిమయ
మకర కుండల కాంతి మలయువాడు
శరవహ్ని నడగించు సంరంభమున జేసి
కన్నుల నునుగెంపు గలుగువాడు
బాలార్కమండల ప్రతిమాన రత్న హా
టక విరాజిత కిరీటంబువాడు
కంకణాంగద వనమాలికా విరాజ
మాను డసమాను డంగుష్ఠమాత్ర దేహు
డొక్క గద జేత దాల్చి నేత్రోత్సవముగ
విష్ణు డావిర్భవించె నవ్వేళయందు.

అలా ఆవిర్భవించిన శ్రీమహావిష్ణువు తన గదను మండలాకారంగా గిరగిరాత్రిప్పి, ఉత్తర గర్భంలో ఉన్న శిశువు తాపాన్ని

---

*136 మాతు ర్గర్భగతో వీరః స తదా భృగునందన
దదర్శ పురుషం కంచిద్ దహ్యమానోఽస్త్ర తేజసా.
అంగుష్ట మాత్ర మమలం స్ఫుర త్పురట మౌలినం
అపీచ్య దర్శనం శ్యామం తడిద్వాస సమచ్యుతం.
శ్రీమద్దీర్ఘ చతుర్బాహుం తప్తకాంచన కుండలం
క్షత జాక్షం గదాపాణి మాత్మనః సర్వతో దిశం.
పరిభ్రమ స్త ముల్కాభాం భ్రామయ న్త గదాం ముహుః
అస్త్ర తేజః స్వగదయా నీహార మివ గోపతిః
విధమ న్తం సం నికర్షే పర్యైక్షత క ఇత్యసౌ.
విధూయ తదమే యాత్మా భగవాన్ ధర్మగుబ్విభుః
మిషతో దశమాస్యస్య తత్రై వాన్తర్దధే హరిః

శమింప చేశాడు. అలా తనకు శాంతి చేకూర్చిన దివ్య విగ్రహం దెవరా అని ఆ శిశువు ఆలోచిస్తూ ఉండగానే, ఆయన అంతర్ధానం కావటం జరిగింది.

ఆ తరువాత, ఒక శుభసమయాన, ఉత్తర ప్రసవించింది. కాని, ఆగర్భస్థ శిశువు బ్రహ్మాస్త్ర పీడితుడై ఉండటంవల్ల నిశ్చేష్టుడై జనించటం జరిగింది.

అలా జనించిన మృతశిశువును చూసి, అంతఃపుర స్త్రీ లందరూ ఆర్తనాదం చేయసాగారు. అది గ్రహించిన శ్రీకృష్ణుడు, ఆ వెంటనే సాత్యకితో సహా అంతిపురిలో ప్రవేశించాడు.

ఆ విపత్సమయంలో, అలా అనుకోకుండా దర్శన మిచ్చిన శ్రీకృష్ణుని, కుంతి, ద్రౌపది, సుభద్ర మొదలైనవారు సమీపించారు. తమ విచారకారణాన్ని ఆయనకు అతి దీనంగా విన్నవించుకున్నారు. అమితంగా రోదించసాగారు. ఆ సమయంలోనే, కుంతీదేవి, శ్రీకృష్ణుని ఉద్దేశించి ఇలా నివేదించుకుంది.

"నాయనా! నువ్వే నాకూ నా బిడ్డలకూ నావారికీ శరణ్యం. మమ్మల్ని ఇంతవరకూ నువ్వే రక్షిస్తూ వచ్చావు. నిన్ను నమ్ముకునే, నేనూ నా బిడ్డలూ జీవితాలను వెళ్లదీసుకుంటున్నాము.

తనయుల తోడ నే దహ్యమానంబగు
జతుగృహంబున యందు జావకుండ
గురురాజు పెట్టించు ఘోర విషంబున
మారుత పుత్రుండు మడియకుండ
ధార్తరాష్ట్రుడు సముద్ధతి జీర లోలువంగ
ద్రౌపది మానంబు దలగకుండ
గాంగేయ కుంభజ కర్ణాది ఘనులచే
నా బిడ్డ లనిలోన నలగకుండ

విరటు పుత్రిక కడుపులో వెలయు చూలు
ద్రోణ నందను శరవహ్ని ద్రుంగకుండ
మరియు రక్షించితివి పెక్కు మార్గములను
(నేడునుఁ మమ్ము బ్రోవవే నీరజాక్ష!)

కృష్ణా! నీ మామ అయిన పాండుభూపతికిగాని, ఆయన తండ్రికిగాని, తుదకు నీ మేనల్లుని కుమారుడైన అభిమన్యునకుగాని పిండోదకాదులు లభించాలీ అంటే, ఈ చిన్నారికి నువ్విప్పుడు ప్రాణ దానం చేసితీరాలి. 'నా మామను పోలినవాడు, ఆయననే ఆశ్రయించి ధన్యత్వం పొందేవాడు నీకు కుమారుడై జన్మిస్తాడు' అని విరటు పుత్రికతో అభిమన్యుడు తరుచు అంటూ ఉండేవాడని తెలుస్తోంది. ఆ పలుకులు వ్యర్థమైనవి కాకుండా చూసే బాధ్యత ఇప్పుడు నీ మీద ఉంది. ఇతణ్ణి పాండవ వంశోద్ధారకుని చేసి, మా తాపాన్ని తొలగించ వలసింది. మృతుడై జన్మించిన ఇతణ్ణి బ్రతికించవలసింది".

ఆ విధమైన కుంతీదేవి అభ్యర్థనను, శ్రీకృష్ణుడు చిరునవ్వుతో స్వీకరించాడు. అది గ్రహించిన కుంతీదేవికి కొంత ఊరట కలిగింది.

ఆపైన సుభద్ర, శ్రీకృష్ణుని ఉద్దేశించి, దీనాతిదీనంగా ఇలా విన్నవించుకుంది.

"అన్నా! ఈ పసికూన మా అందరి ప్రాణాలకూ ప్రాణం వంటివాడు. ఇతణ్ణి నువ్విలా వదలిన పక్షంలో, మే మందరం మా ప్రాణాలను వదలుకోవట మవుతుంది.

పాండవ పత్నుల గర్భాలమీదకు అశ్వత్థామ తన అస్త్రాన్ని వదలినప్పుడు, అది ఉత్తరాగర్భస్థ శిశువును పీడిస్తున్నదని గ్రహించి నప్పుడు, నువ్వు, 'పాండవ వంశం నిర్మూలం కావటానికి వీలులేదు' అన్నావు. 'పార్థుని పౌత్రునకు నేను ప్రాణదానం చేసి తీరుతాను'అని కూడా శపథం చేశావు. నీ పలుకులు నిలుపుకోవలసిన సమయం ఇప్పు డాసన్నమయింది,

కృష్ణా! నీ ప్రభావం నాకు తెలుసు. నువ్వు తలచుకున్న పక్షంలో ఈ ఒక్క శిశువునే కాదు; ముల్లోకాలలోనూ, ఇంతకుముందు మరణించిన ప్రాణికోటి నంతనూ జీవింప చేయగలవు. అది కారణంగానే, నా మనుమనికి ప్రాణదానం చేయవలసిందనీ, నీ ప్రేమకు పాత్రులైన పాండు పుత్రులకు పరితాపం కలుగకుండా చూడవలసిందనీ ప్రార్థేయ పడుతున్నాను."

సుభద్ర హృదయ వేదనను శ్రీకృష్ణుడు గ్రహించాడు. ఆమె అలా దీనంగా బ్రతిమాలటం ఆయన భరించలేక పోయినాడు. అది కారణంగానే, ఆయనకు అంతులేని దుఃఖం కలిగింది. ఆయన, ఆవెంటనే మూర్ఛితుడు కావటం, మూర్ఛనుంచి తేరుకున్న తరువాత, 'నీ కోరిక నెరవేరి తీరుతుంది' అని ఆమెకు వాగ్దానం చేయటం జరిగింది.

సుభద్రకు ఆ విధంగా వాగ్దానం చేసి, శ్రీకృష్ణుడు, మృత శిశువు ఉన్న మందిరంలో ప్రవేశించాడు. అంతలో ద్రౌపది ఉత్తరను సమీపించి, శ్రీకృష్ణుని ఆగమనవార్త నామెకు అందజేసింది.

ఆ వార్త వినగానే, ఉత్తరలో దుఃఖం ఉబికి వచ్చింది. అది కారణంగానే ఆమె ద్రౌపది నుద్దేశించి...

పద్మనాభుండు వచ్చిన బాలు జంక
బెట్టికొనిపోయి మ్రొక్కింతు బ్రీతి యెసగ
నని తలంచుచు నుండితి నమ్మనోర
థంబు విఫలంబుగా జేసె ద్రౌణి పేర్చి

అని హృదయ విదారకంగా రోదించింది.

అంతలో శ్రీకృష్ణుడు ఆమెను సమీపించాడు. అది గ్రహించిన ఉత్తర, అచేతనుడై పడుకుని ఉన్న ఆ బాలుని ఒళ్లోకి తీసుకుని, అతణ్ణి ఉద్దేశించి...

తాత లోకగురుడు దామోదరుడు వచ్చి
యుండ లేచి మ్రొక్క వుజ్జ్వలాంగ

ధర్మవేదియైన తండ్రికి బుట్టి య
ధర్మపరుడ వగుట తగునె నీకు !

అని ప్రశ్నించింది. ఆ పైన...

కనువిచ్చి గొంతి జూడుము
నను జూడుము ద్రుపద నృప తనయ జూడుము నీ
జనకుని తల్లి సుభద్రం
దనయా చూడు తలయెత్తి దరహాసముతోన్;

అని దీనాతిదీనంగా బ్రతిమాలుకుంది. దుఃఖాతిరేకంవల్ల మూర్ఛ పోయింది,

ఆమె దురవస్తను శ్రీకృష్ణుడు చూడలేకపోయినాడు. అది కారణంగానే, ఆయన, ఆ కుఱ్ఱవాణ్ణి శయ్యమీద ఉంచవలసిందిగా ద్రౌపదిని కోరాడు. ఆమె అలా చేసిన వెంటనే, ఉత్తర నుద్దేశించి...* 137

---

*137 న బ్రవీ మ్యుత్తరే మిథ్యా సత్యమేతద్ భవిష్యతి
ఏష సంజీవయా మ్యేనం పశ్యతాం సర్వదేహినాం.
నోక్త పూర్వం మయా మిథ్యా స్వైరేష్వపి కదాచన
న చ యుద్ధాత్ పరావృత్తస్తథా సంజీవతామయం.
యథా మే దయితో ధర్మో బ్రాహ్మణశ్చ విశేషతః
అభిమన్యోః సుతో జాతో మృతో జీవత్వయం తథా.
యథాహం నాభిజానామి విజయే తు కదాచన
విరోధం తేన సత్యేన మృతో జీవత్వయం శిశుః.
యథా సత్యం చ ధర్మశ్చ మయినిత్యం ప్రతిష్ఠితౌ
తథా మృతః శిశురయం జీవతా దభిమన్యు జః.
యథా కంసశ్చ కేశీ చ ధర్మేణ నిహతౌ మయా
తేన సత్యేన బాలోఽయం పునః సంజీవతామయం.
ఇత్యుక్తో వాసుదేవేన స బాలో భరతర్షభ
శనైః శనైర్మహారాజ ప్రాస్పంధత సచేతనః.

"పగఱ యెడనైన నే బొంకు పలుకనేని
సమర ముఖమున నెన్నడు జలితవృత్తి
బిఱిది కడుగిడ నేని నిప్పిన్న వాని
యంగమున జీవ మీ ప్రొద్దయావహిల్లు.

ధరణీ సురకులము నెడం
గర మెక్కుడు ప్రియము నాకు గలదేని సధ
ర్మ రతుడనయేని నియ్యు
త్తరా సుతుడు లబ్ధ జీవితత్వము నొందున్.

నరునియెడ నా మనంబున
విరోధ మెన్నడును నేమి విధమున నైనం
బొరయమి నిజమేనియు సు
స్థిరముగ నిశ్వాలు మేన జీవము నెందున్.

నిక్కపు ధర్మువునన నే
న క్కంసాదుల వధించు టారసి చూడన్
నిక్కువమై యార్యజనుల
కెక్కనయేని నసువర్గ మీ శిశువు గనున్.

మహిత సత్యంబు బరమ ధర్మంబు గాఢ
నిర్మల బ్రహ్మచర్యంబు నిత్యసుప్ర
తిష్ఠితంబులై నాయందు దేజరిల్లు
నేని నిశ్వాలునకు జీవ మిపుడ వచ్చు"

అని పలికాడు. అలాపలుకుతూనే, ఆ బాలుని, తన పాదంతో మెల్లగా స్పృశించాడు. ఆపాదమస్తకంగా అతణ్ణి నిమిరాడు. అది కారణంగా, ఆ వెంటనే, ఆ శిశువులో చైతన్యం కలిగింది. ఆ పైన అతడటూ ఇటూ కదిలాడు. అంతలో, మూర్ఛనుంచి తేరుకున్న ఉత్తర, అతణ్ణి అమితానందంతో, చేతుల్లోకి తీసుకుంది. శ్రీకృష్ణుని సమీపించి, అతణ్ణి

ఆయన పాదాలమీద ఉంచింది. ఆయన చరణాబ్జాలకు నమస్కరించింది. ఆయన ఆశీర్వాదాన్ని పొందింది.

ఆ విధంగా శ్రీకృష్ణుడు, అభిమన్యు కుమారునకు ప్రాణదానం చేయటం, వంశమంతా పరిక్షీణమైన తరువాత జనించినవాడు కావటం వల్ల అతనికి పరీక్షితు డని నామకరణం చేయటం జరిగింది.

131 అవతారోపసంహరణం :

లీలామానుషరూపం ధరించి, రాక్షస సంహారానికి ఉపక్రమించిన శ్రీకృష్ణుడు, కాలక్రమాన, రాక్షసాంశ సంభూతులైన ధార్తరాష్ట్రులనూ, వారి సహచరులనూ వధించే నిమిత్తం, కురుపాండవ వంశాల మధ్య జనించిన ద్వేషాన్ని గ్రహించికూడా ఉపేక్షించి ఊరకున్నాడు. ఆ ద్వేషం, క్రోధాగ్నిగా పరిణమించినప్పుడు, దాన్ని ప్రజ్వలింపజేసి, అసురాంశ సంభూతులందరినీ దానికి ఆహుతి చేశాడు.

ఆవిధంగా, భూభారాన్ని తొలగించిన శ్రీకృష్ణునకు, తన సహాయకులుగా ఉద్భవించి, తమ కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వహించుకున్న యాదవవీరుల నెలా ఉపసంహరించటమా అన్న ఆలోచన కలిగింది. అప్పుడాయన...*138

---

*138 భూభారరాజ పృతనా యదుభిర్నిరస్య
గుప్తైః స్వబాహుభి రచిన్తయ దప్రమేయః
మన్యేఽవనేర్ననుగతోఽప్యగతం హి భారం
యద్ యాదవం కుల మహో అవిషహ్య మాస్తే.

నైవాన్యతః పరిభవోఽస్య భవేత్ కథంచి
న్మత్సంశ్రయస్య విభవో న్నహనస్య నిత్యం
అంతః కలిం యదుకులస్యవిధాయ వేణు
స్తంబస్య వహ్నిమివ శాన్తి ముపైమి ధామ.

"ఈ యదువీరులు, ఇంతవరకూ, నా రక్షణలో, భయమనేది తెలియకుండా వ్యవహరించారు. సర్వ విధైశ్వర్యాలనూ అనుభవించి ఐశ్వర్యబల దర్పితులై ఉన్నారు. వీరిని నిర్మూలించేశక్తి ఈనాడు ఈరేడు లోకాలలోనూ లేదు. అన్యోన్య వైరానుబంధం వల్ల మాత్రమే వీరు ఒకరి నొకరు సంహరించుకుని, ఈ శరీరాలను త్యజించటం, వారి వారి నిజావాసాలకు పోవటం సంభవమవుతుంది. అప్పటికిగాని భూభారం పూర్తిగా తొలగినట్టుకాదు; నేను నిశ్చింతగా నా దివ్య గేహానికి వెళ్లటానికి వీలు లేదు;"

అని, ఆ సందర్భంలో నిర్ణయించుకోవటం జరిగింది.

ఆ సమయంలో, ఒకసారి, బలరామ కృష్ణులను సందర్శించుకునే ఉద్దేశంతో, విశ్వామిత్ర అసిత కణ్వ దుర్వాస వామదేవ వశిష్ఠాది మహర్షులు ద్వారావతికి వచ్చారు. అలా వచ్చిన వారికి, శ్రీకృష్ణుడు అర్ఘ్యపాద్యాదు లర్పించుకున్నాడు. సత్కరించాడు. కుశలప్రశ్నలు వేశాడు. ఆ సందర్భంలో, వారు ఆయన్ని ఉద్దేశించి...

"జనములు నిను సేవింపని
దినములు వ్యర్థంబు లగుచు దిరుగుచు నుండున్
దనువులు నిలుకడగా వట
వనములలో నున్ననైన వనరుహనాభా!

భరణంబులు భవజలధికి
హరణంబులు దురితలతల కాగమముల కా
భరణంబు లార్తజనులకు
శరణంబులు నీదు దివ్య చరణంబు లిలన్.

కృష్ణా! నీ నామస్మరణం అమోఘమైనది. అందుకనే బ్రహ్మ రుద్రాదులుకూడా దాన్ని ఆశ్రయిస్తారు. మానవులు దాని సహాయంతోనే భవసాగరాన్ని తరిస్తారు.

దుర్లభమైన నీ రూప దర్శనం పరితాపాలన్నింటినీ పటాపంచలు చేస్తుంది. ఆ యథార్థాన్ని గ్రహించటంవల్లనే మేమిప్పు డిలా రావటం జరిగింది"

అని, ప్రస్తుతి పూర్వకంగా విన్నవించుకున్నారు. ఆ తరువాత, ఆయనవద్ద సెలవు తీసుకుని, అక్కడికి అనతి దూరంలో ఉన్న పిండారక మనే పుణ్యతీర్థానికి వెళ్లారు; అక్కడ కొన్నినాళ్లున్నారు.

వా రలా పిండారకంలో ఉన్నప్పుడే, ఒకసారి, సనకాది మునులతో చతుర్ముఖుడూ, భూతగణాలతో మహేశ్వరుడూ, సిద్ధ చారణాదులతో సురేశ్వరుడూ శ్రీకృష్ణ సందర్శనార్థం ద్వారావతికి దిగిరావటం జరిగింది. అలా వచ్చినవారు, ఆయనకు పదేపదే ప్రణామాం లర్పించుకున్నారు. ఆయన్ని ప్రస్తుతించారు. దివ్యసుమాలతో అర్చించారు. ఆ తరువాత ఆయన్ని ఉద్దేశించి...

'అఖిల లోకేశ సర్వేశ యభవ నీవు
నుదయ మందుట భూభార ముడుపు కొఱకు
బంచ వింశోత్తర శతాబ్ద పరిమితంబు
నయ్యె విచ్చేయు వైకుంఠ హర్మ్యమునకు'

అని వినయపూర్వకంగా నివేదించుకున్నారు.

ఆ మహనీయుల విన్నపాన్ని శ్రీకృష్ణుడు చిరునవ్వుతో స్వీకరించాడు. అది గ్రహించిన బ్రహ్మరుద్రామరేంద్రులు సంతుష్టులై, ఆయనవద్ద సెలవు తీసుకుని, తమతమ నిజస్థానాలకు వెళ్లిపోయినారు.

అది మొదలు, శ్రీకృష్ణునకు అనేకమైన మహోత్పాతాలు గోచరించ సాగినై. అది కారణంగానే, ఆయన, యదువంశానికి త్వరలోనే చేటు మూడబోతున్నదని నిర్ణయించుకోవటం జరిగింది.

అంతలో ఒకసారి, యాదవకుమారులు, పిండారక తీర్థంలో ఉన్న మహర్షుల వద్దకు వెళ్లటం, వారిని హేళన చేయటం, వారివల్ల, యదుకుల వినాశనానికి దారితీసే ఒక శాపాన్ని పొందటం సంభవించింది.

అదంతా గ్రహిస్తూఉన్న శ్రీకృష్ణుడు, తనకు సన్నిహితులైన యదువృద్ధు లందరినీ సమావేశపరచి, వారితో ఇలా అన్నాడు.

*139 "ఇటీవల అనేకమైన మహోత్పాతాలు గోచరిస్తున్నై. అవి యదువంశ వినాశనానికి చిహ్నాలని నేను భావిస్తున్నాను. ఇక మనం ఇక్కడ ఒక క్షణమైనా ఉండకూడదు. వెంటనే, మన స్త్రీజనాన్నీ పిల్లలనూ వృద్ధులనూ శంఖోద్ధారమనే పుణ్యస్థలానికి పంపటం, సరస్వతీనదీ తీరాన ఉన్న ప్రభాస తీర్థానికి మనం వెళ్లటం సమంజసం.

మన మా సరస్వతీ నదిలో స్నానంచేసి, ఉపవసించి, అర్చనాదులు జరిపి, విప్రపూజ చేసి, దాన ధర్మాదు లాచరించిన పక్షంలో మనకు

---

*139 ఏతే ఘోరా మహోత్పాతా ద్వార్వత్యాం యమకేతనః
ముహూర్త మపి న స్థేయ మత్ర నో యదుపుంగవాః.

స్త్రియో బాలాశ్చ వృద్ధాశ్చ శంఖోద్ధారం వ్రజన్త్వితః
వయం ప్రభాసం యాస్యామో యత్ర ప్రత్య క్సరస్వతీ.

తత్రాభిషిచ్య శుచయ ఉపోష్య సుసమాహితాః
దేవతాః పూజయిష్యామః స్నపనాలేపనార్హణైః.

బ్రాహ్మణాంస్తు మహాభాగాన్ కృతస్వస్త్యయనావయం
గో భూ హిరణ్య వాసోభిర్గజాశ్వ రథ వేశ్మభిః
విధిరేష హ్యరిష్టఘ్నో మంగలాయన ముత్తమమ్
దేవ ద్విజ గవాం పూజా భూతేషు పరమో భవః.

సంభవింపబోయే ఆపద తప్పకుండా తొలగిపోతుంది; శాంతి లభించి తీరుతుంది."

శ్రీకృష్ణుని హితోపదేశం, యాదవ ప్రముఖులందరికీ, శ్రేయోదాయక మైనదే ననిపించింది. ఆ వెంటనే, వారు, ఆయన చెప్పినట్టు చేశారు.

అలా ప్రభాసతీర్థంచేరుకున్న యాదవయువకులు, కృష్ణమాయకు వశులై, హద్దులుమీరి చరించారు. మైరేయకమనే మధువును త్రాగి మైమరచి ప్రవర్తించారు. పరస్పరం కలహించుకున్నారు. అన్యోన్య వధ కుపక్రమించారు. అప్పుడు జరిగిన సంక్షోభంలో, దాశార్హ భోజాంధక వృష్ణి సాత్వతాదులు ఎందరో తనువులు త్యజించటం జరిగింది.

తనవారందరూ ఆ విధంగా మానుషదేహాలు త్యజించి, తమ తమ నిజావాసాలకు వెళ్లటం గ్రహించిన శ్రీకృష్ణుడు, అప్పటితో భూభారం పూర్తిగా తొలగిపోయిందని భావించాడు. ఆ యదువీరుల వినాశంతో, తన అవతార ప్రయోజనం తీరిపోయిందని కూడా ఆయన నిర్ణయించుకున్నాడు. ఆ నిర్ణయాన్ని అర్థం చేసుకున్న బలరాముడు, ఆ వెంటనే, యోగమార్గాన పాతాళానికి వెళ్లి, అనంతునిలో లీనం కావటం జరిగింది.

బలరాముడు ఆవిధంగా తన అవతారాన్ని ఉపసంహరించుకున్న తరువాత, శ్రీకృష్ణుడు, ఆ సమీపంలో ఉన్న ఒక అశ్వత్థచెట్టు వద్దకు వెళ్లాడు. వెళ్లి, అక్కడే కొంతసేపు ప్రశాంతంగా కూర్చున్నాడు. ఆ సమయంలోనే, ఆయన తన లీలా మానుష రూపాన్ని త్యజించటం, నిజరూపం ధరించటం జరిగింది.

అలా దివ్యరూపంలో భాసించే ఆ మూర్తి* 130 చతుర్బాహుడుగా గోచరించాడు. నీలమేఘంవంటి శరీరచ్ఛాయకు అనుగుణమైన పచ్చని పట్టుబట్ట నొకదాన్ని కట్టుకున్నాడు; మరొకదాన్ని ఉత్తరీయంగా వేసుకున్నాడు.

ఆయన హృదయంమీద శ్రీవత్సం భాసించింది. ఆయన ముఖకమలం మందహాసాన్ని విరజిమ్మింది. మకరకుండలాలతో, కటిసూత్రంతో, బ్రహ్మసూత్రంతో, రత్నహారంతో, భుజకీర్తులతో, కంకణకేయూరాలతో, కౌస్తుభంతో, వనమాలతో, మణిమయాంచితకిరీటంతో విరాజమానుడై ఉన్నాడు. ఆ సమయంలో, శ్రీ మహావిష్ణువు నాశ్రయించి ఉండే ఆయుధాలన్నీ ఆయన్ని ఆశ్రయించి ఉన్నై. ఎఱ్ఱకలువవంటి తన ఎడమపాదాన్ని, కుడి తొడమీద ఉంచుకుని, దాన్ని సవిలాసంగా ఆడిస్తూ ఆయన కూర్చుని ఉన్నాడు. ఆయన దైన దివ్యతేజం నాలుగుదిక్కులనూ ఆవరించుకుని, అక్కడి చీకటి తెరల నన్నింటినీ తొలగించింది.

అంతలో, మంగళకరమూ రమణీయమూ అయిన ఆయన దివ్యవిగ్రహంలోనుంచి శతకోటి సూర్యుల తేజం ఆవిర్భవించింది. ఆ మహాను

---

*140 బిభ్ర చ్చతుర్భుజం రూపం భ్రాజిష్ణు ప్రభయా స్వయా
దిశో వితిమిరాః కుర్వన్ విధూమ ఇవ పావకః.
శ్రీవత్సాంకం ఘనశ్యామం తప్తహాటక వర్చసం
కౌశేయాంబరయుగ్మేన పరివీతం సుమంగలం.
సుందరస్మిత వక్త్రాబ్జం నీల కుంతల మండితం
పుండరీకాభి రామాక్షం స్ఫురన్మకర కుండలం.
కటి సూత్ర బ్రహ్మసూత్ర కిరీట కటకాంగదైః
హార నూపుర ముద్రాభిః కౌస్తుభేన విరాజితం
వనమాలా పరీతాంగం మూర్తిమద్భి ర్నిజాయుధైః
కృత్వోరౌ దక్షిణే పాద మాసీనం పంకజారుణం.

భావుని వైకుంఠ గమనాన్ని దర్శించుకునే ఉద్దేశంతో, అప్పు డక్కడ సమావేశమైన బ్రహ్మ రుద్రామరేంద్రులూ, దేవతలూ, దివ్యర్షులూ, ప్రజాపతులూ అందరూకూడా అది చూసి అమితాశ్చర్యంతోనూ, పర మానందంతోనూ జయజయధ్వానాలు చేశారు.

ఆకసంనుంచి జయజయధ్వానాలు వినిపిస్తూఉండగా, సురలోకం నుంచి సుమవర్షం కురుస్తూ ఉండగా, దేవదుందుభులు మ్రోగుతూ ఉండగా, ఆ దివ్యసుందర మూర్తిలోనుంచి బాహిరిల్లినమహా తేజం, గగన మార్గాన గమించి, పోయి పోయి వైకుంఠం చేరుకుంది.



ఆ విధంగా తన అవతారాన్ని ఉపసంహరించుకున్న శ్రీకృష్ణ పరమాత్ముని వంశం, అనంతరకాలంలో నూట ఒక్క శాఖగా విస్తరిం చింది. ఆయనను పరమ గురునిగా భావించి, సేవించి, ఆయన దైన మార్గాన్నే అనుసరించి, వాత్సల్యామృతాన్ని గ్రహించి, ఇహలోకంలో సర్వవిధ భోగాలనూ అనుభవించి భవసాగరాన్ని తరించింది.



శ్రీకృష్ణుడు, రాక్షసాంశతో జన్మించిన రాజులనూ, వారి అను చరులనూ సంహరించటానికీ, వారివల్ల పుడమితల్లి పడే బాధలను తొలగించటానికీ, సాధులను సంరక్షించటానికీ, ధర్మాన్ని పునరుద్ధరించ టానికీ, అనన్యభక్తితో తన్ను ఆరాధించేవారిని అనుగ్రహించటానికీ మానవ లోకంలో అవతరించాడు. ఆ అవతారానికి అనుగుణమైన లీల లెన్నిటినో ప్రదర్శించాడు. వాటి ద్వారా పామరులనుంచి పరమర్షుల వరకు అందరికీ పరమానందాన్ని ప్రసాదించాడు.

ఆ లీలలలో ఏ ఒక్క లీలను విన్నా వినిపించినా, స్మరించు కున్నా శ్రవణం చేసినా, పఠించినా ప్రవచించినా ప్రాణులకు ఆ

మహానుభావునిపట్ల అభిమానం కుదురుతుంది. ఆ అభిమానం, కాల క్రమాన అనన్యభక్తిగా రూపొందుతుంది. అనంతరం, అదే ఆయన అనుగ్రహాన్నీ తద్వారా సాలోక్యాన్నీ సాధకులకు ప్రసాదిస్తుంది.



ఇత్థం హరేర్భగవతో రుచిరావతార
వీర్యాణి బాలచరితాని చ శంతమాని
అన్యత్ర చేహ చ శ్రుతాని గుణాన్ మనుష్యో
భక్తిం పరాం పరమహంస గతౌ లభేత.

ఆ విధమైన దృఢాభిప్రాయమే ఈ శ్రీకృష్ణ లీలామృత కృతికి మూలం.

  

జై గోపాల్ !

